ఓం

సచ్చిదానందాత్మరామాయనమః

# విజ్ఞప్తి

ఈ గ్రంథ నామము "శ్రీ భగవద్గీత చోదనా" సార్థక నామమే. విషయచోదనా సిద్ధాంతము బ్రహ్మస్పర్శయుత అనాసక్త కర్మయోగమున సాధకుడు జ్ఞానియగుననిన్ని, జీవన్ముక్తుడు (జ్ఞాని) అనాసక్త కర్మయోగి (అకర్మి) యగుననియు, అగుచున్నది. ఈగ్రంథములో (1) విషయచోదనా సిద్ధాంతము, (2) బోధకాల చోదనా సిద్ధాంతము, (3) బ్రహ్మస్పర్శ చోదనా సిద్ధాంతమునను ప్రకరణములున్నవి. యోగాజ్ఞములలోని విశేషాంశములు సప్రమాణికముగ చూపింపబడినవి. (1) స్థిత ప్రజ్ఞాని లక్షణములు, (2) ఆత్మమాయా నాశము (3) సన్యసలత్యాంశ విశేషార్థమున్ను 18, 17 అధ్యాయములలో ఉచితమగుటను అక్కడ విశేష వివరణ చేయబడినది. పఠితలున్ను, ఈ గ్రంథము హృదయంగమము చేసుకొని బ్రహ్మస్పర్శ ఫలము నొందుదురుగాక.

ఈ గ్రంథమును కూడ వ్రాయ నన్ను ప్రోత్సహించి త్వరపెట్టిన శ్రీ శ్రీ శ్రీ జగద్గురు విమలానంద భారతీస్వాములవారి శిష్యులగు శ్రీ శ్రీ శ్రీ శాంభవీ పీఠాధిపతులు శ్రీ ఉ. ఉ. జగద్గురు ప్రకాశానంద భారతీస్వాముల వారికిన్ని (2) ఉభయ భాషా ప్రవీణ రావ్వూరు ఆంధ్రగీర్వాణవిద్యాలయ ప్రధానోపాధ్యాయులు శ్రీ కే. యాజ్. అప్పారావుపంతులు యమ్. ఏ. గారికిన్ని నా కృతజ్ఞతావందనములు.

ఇందు దొర్లిన దోసగులను మన్నించి సత్యములను గ్రహించి దోసములు నాకెఱింగించిన నాపడిన ప్రయాస సార్థకమైనదని మానసికాకాంక్షలుల నర్పింతును.

క. శ. 5058; శా. శ. 1879;
హే॥ హేవళంబి సం॥ ఆశ్వీజ
బ॥ సప్తమీ మంగళవారము.
క్రీ. శ. 15-10-1957.
బక్కారోడ్ హామ్‌పేట,
విజయవాడ.

ఇట్లు, బుధజన విధేయుడు,
సహజపాండిత్య కవితావిచిత్ర
వేదాంత వైజ్ఞానిక
**గంగరాజు**
**వేంకట నరసింహరాయశర్మ**
పాకయాజీ, B. M. D.
గ్రంథకర్త.

# ప్రస్తావన

శ్రీ భగవద్గీతచోదనా విమర్శనా గ్రంథమును మేము సాకల్యముగ పరిశీలించితిమి. భగవద్గీత కేవలపరమాత్మ చేతనే తన రెండవ అంశయగు అర్జునుని ద్వారా లోకమునకు తెలియునటులను చేయబడిన బోధ కలిగి యున్న ఉత్తమ గ్రంథమగుట ప్రసిద్ధమే. అనాసక్తకర్మి బ్రహ్మజ్ఞాని యున్ను, జ్ఞాని అనాసక్తకర్మి (అకర్మి) యగుననిన్ని ఇద్దరికిన్ని మోక్షమే ఫలమనిన్ని 'చోదనా' శబ్దము చేతనే విషయ సిద్ధాంతమును గ్రంథనామమే సూచించుచున్నది.

శ్రీమద్భగవత్పాద శంకరాచార్య భాష్యానుసారమే సిద్ధాంతము చేసి యుండుటచేత తత్త్వ జిజ్ఞాసులందరు నీ గ్రంథము పఠించి తరింతురు గాక! ప్రతియింటను ఒక ప్రతినుంచుకొని స్త్రీ పురుషులందరును నీ విషయచోదనా ప్రయోజన మొందుదురుగాకయని యాదేశించుచున్నాము.

క. శ. 5059<br>
శా. శ. 1880<br>
చాంద్రమాన<br>
విళంబి సం॥ చైత్ర<br>
శు ౧ శుక్రవారము<br>
తారీఖు. 21-3-58

ఇట్లు<br>
శ్రీ శ్రీ శ్రీ శాంభవీ పీఠాధిపతులు<br>
శ్రీశ్రీశ్రీ ప. పూ. జగద్గురుశ్రీ కాశానంద<br>
భారతీస్వామి నారాయణస్మృతులు

---

విజయవాడ వేదాంత గ్రంథమాలలో ఈ గ్రంథకర్త చేత విరచితమగు శ్రీ భగవద్గీతచోదనా ప్రచురణకొఱకై అయాచితముగ విరాళమునిచ్చి గ్రంథ ప్రచురణలో తోడ్పడిన క్రింది రాజపోషకులను శ్రీకృష్ణపరమాత్మ సకల కల్యాణప్రదులనుగ చేయుగాక!

కొనిజేటి చెంచయ్యశ్రేష్ఠిగారి పుత్రుడు<br>
పున్నయ్య శ్రేష్ఠిగారు<br>
విజయవాడ-2

ఇచ్చిన విరాళము<br>
రు. 250-0-0

# విషయ సూచిక

విషయము | | పుట



## ప్రథమ షట్కము



## ద్వితీయ షట్కము

## తృతీయ షట్కము



## రెండవ భాగము



## మూడవ భాగము



శ్రీ భగవద్గీత చోదనా గ్రంథము సమాప్తము

# గ్రంథస్థ సాంకేతిక సంజ్ఞా వివరణ

అన్నపూర్ణ = అన్నపూర్ణోపనిషత్
అం. బిం. = అమృత బిందూపనిషత్
(బ్రహ్మబిందూపనిషత్)
అధ్యాత్మ = అధ్యాత్మోపనిషత్
అ = అధ్యాయము
ఈశావాస్య = ఈశావాస్యోపనిషత్
ఉ. అ. = ఉత్తరార్ధము
ఋ. వే = ఋగ్వేదము
ఐతరేయ = ఐతరేయోపనిషత్
కఠోప – కఠోపనిషత్
క. శ. = కలిశకము
క. శ. వి. = కలిశక విజ్ఞానము
కేన = కేనోపనిషత్
ఛాం = ఛాందోగ్యోపనిషత్
జీ. ప్ర. = జీవన్ముక్త ప్రకాశిక
తై. ఉ. = తైత్తిరీయోపనిషత్
తై.బ్ర. = తైత్తరీయబ్రహ్మానందవల్లి
తే. బిం. = తేజోబిందూపనిషత్
నిరాలంబ = నిరాలంబోపనిషత్
పాశుపత = పాశుపతబ్రహ్మోపనిషత్

పం. } = పంచదశి
ప. ద. }
ప్ర = ప్రమాణము–ప్రకరణము
పూ. అ. = పూర్వార్ధము
పైంగల = పైంగలోపనిషత్
బ్ర. సూ = బ్రహ్మసూత్రము
బృ. ఉ. = బృహదారణ్యోపనిషత్
భ. గీ. = భగవద్గీత
మహోప = మహోపనిషత్
ముక్తికోప = ముక్తికోపనిషత్
ముణ్డక = ముణ్డకోపనిషత్
యో. వా. ముముక్షు = యోగవాసిష్ట ముముక్షుప్రకరణము
యో.వా.నిర్వాణఉ.అ. = యోగవాసిష్ట నిర్వాణ ప్రకరణము ఉత్తరార్ధము
వరాహోప = వరాహోపనిషత్
శ్వేత = శ్వేతాశ్వతరోపనిషత్
శా. వా. = శాలివాహనశకము
సి. సూ. = సిద్ధాంతసూత్రము
సరస్వతీ = సరస్వతీ రహస్యోపనిషత్

# కృతికర్తవంశావతారము

తే. గీ. సుహిత కౌమ్మూరు గంగరాజు గృహనామ
క పెదగంగరాజగు మాలిగనగుమాకు
విశ్వామిత్రాష్టక ఋషులుగా వినుతలోహి
తసపు గోత్రజాలముగను తగనగుదుము॥ 1

కం॥ ఆయనకు పెద్దిరాజు
నాయనకు తృతీయసుతుడనం నగస్త్యుండు
నాయనకు పెద్దిరాజు
నాయనకొడుకచ్చనసుతుడా వీరాజున్॥ 2

తే॥ గీ॥ ఆయనసుతుండప్పయ కోడలామె నర్స
మయు గనిరి 'నర్సము' నతడుం బత్నియాగె
మ యును గనిరి సుతత్రయ మంత వేంక
టేశ 'రామబ్రహ్మ' 'నరసిం' హాఖ్యులందగ॥ 3

" 'రామబ్రహ్మము' బ్రహ్మయారాధకుండు
పత్ని 'కామాంబ' తారకోపాసకియును
గనిరి మమ్ము నైదుగురినింక సుతులందగ
'సత్యనారాయణాఖ్యుడు' సప్రథముండు॥ 4

" 'వేంకటనరసింహారావు' నింక నేను
'సుబ్బరాయుడు' కుటుంబరావ్ సుతులు మూడు
నాల్గు; పూర్ణేశ్వరుం డైదు నగుచు వంశ
మందు విభజితుల మగుదు మందఱమును॥ 5

కం॥ మాతల్లి కామమ కుడిచె
చేతిప్పెడ స్పృహయులేక చేర్పృత్వము చే
నాతత లత్ప్యత నంతిమ
నాతారక దేశికుండ నైతిందననిక॥ 6

కం॥ పితరుని మాత నిక సుఖే
తులను చేసితిని అధ్య సితజ్ఞానిని; మ
త్సతి నర్సమ్మ, కామేశ్వరి

యుండెఁ; ఇఁకను కడపటివాఁడు నగు నాకుఁ
సరసుఁడీవిళంబికి సుత సప్తకంబుఁ; 14

క॥ నాజామాత ప్రసిద్ధుం
రాజాన్వయ వేంకటయామాత్య రాధాకృష్ణుం
ప్రోజ్జ్వలుఁ బట్టభద్రుఁడు
రాజద్యోగి ఇఁకఁ మాగ్రహయాశేషమగుఁగా; 15

తే॥ గీ॥ నాదు తమ్ముఁడు సుబ్రహ్మణ్యుఁడు సతి
తోడ తీర్థయాత్ర సేసి యతఁడు జ్ఞాని
యాచు గా మహాన్మహానుభావుండు నగుచుఁ;
పరుఁడునయ్యెఁ; నిర్గుణబ్రహ్మ స్థితిఁ బరుఁడై ఇదుతఁ; 16

వ॥ ఇట్టులను చాంద్రమాన సర్వధారినామసం॥ నిజచైత్ర శు॥ సప్తమీ పుష్యమీనక్షత్రమున జన్మించినట్టియు వెంకట నరసింహరాయశర్మ పాండ్యాజి ఘాతికవ్యక్తుఁడనగు నట్టియు నేను క. శ. 5058 సం॥ శా. శ 1879 సం॥ వ్యావహారిక చాంద్రమాన హేవిళంబి సం॥ ఆశ్వయుజ బహుళ సప్తమీ మంగళవారమునకు సరియయిన క్రీస్తు 1957 సం॥ అక్టోబరు 15వ తేదీన పరీక్షిన్నరేంద్రుని మాతృగర్భములోనే తన చక్రముతో కాపాడినట్టియు తన ఏకాంతభక్తులగు పాండవులను ధర్మోద్ధారకులనుగ చేసినట్టియు భీష్మనిర్యాణకాలమందు ప్రత్యక్షమూర్తిగ నిలుచునిల్చినట్టియు మహానుభావ మూర్తియగు శ్రీకృష్ణపరమాత్మయగు మద్భాగ్యగానుని ( స్వప్రకాశభావరూపుని ) నాహృదయమందు కల్పించుకొని మహాకారుణ్యము, ప్రహృష్టచిత్తము, జీవబ్రహ్మైక్యావధిదము లేక మోక్షదమగు ' శ్రీ భగవద్గీత చోదనా గ్రంథమును ముందు మంగళాచరణము సంబంధ చతుస్స్తుతులఁ జెప్పి శ్రీకృష్ణపరమాత్మకు సమర్పిత మీగ్రంథమారంభించి సమాప్తి నొందించెదను.

ఓమ్
శ్రీ సచ్చిదానందాత్మారామాయనమః

# శ్రీ భగవద్గీతచోదనా

## మంగళాచరణము

తే॥ గీ॥ విధినె వేద్యమును ముముక్షు ♦ హృదయమగుచు ।
నాత్మశక్తిమాలి, వృతిద్వ ♦ యముగ వాచ్య!
శుక్రము నపాపవిద్ధమ ♦ వక్రి మవ్రి
ణము నకాయ కృష్ణా! మంగ♦ళమిదూనతిదె॥

బాహ్యార్థము:- విధినె=వేదమునందే (బ్రహ్మయని చెప్పఁబడు వేదమునందే) వేద్యము=తెలుసుకొనబడునట్టినిన్ను, ముముక్షు=మోక్షముయొక్క తీవ్రకోతికగలవారికి, హృత్ = ఆత్మ(సాక్షిస్వరూపము)అయం=ఈప్రత్యక్షమగునిది లేకవీడు అగుచు (అనగా జీవుని హృదయమను మనోగుహాలోనే అతి సమీపముగ ప్రమాతగానున్నది) అగుచు, ఆత్మశక్తి = బ్రహ్మనన్య శక్తికి (బ్రహ్మసత్త) మాలి=మూలకారణిక మగువాడవగుచు అనగా అహంకార వృత్తి చేతనమగుటకు కారణమగు ప్రమాణము, ప్రమేయములను ప్రమాత (బోద్ధ లేక జ్ఞాత) యొక్క రెండువృత్తుల చేతనే చెప్ప బడు వాచ్య=వాక్యార్థముగ చెప్పబడు పరమాత్మయగు వాడా! శుక్రము=శుద్ధసత్వగుణానన్యము నగునట్టినిన్ను (అతి నిర్మలమగునట్టినిన్ను) అపాపవిద్ధము=పుణ్య పాపరహితమున్ను

వివర్తముగా మనస్సు (బుద్ధి) వలకు ప్రచారమగుచున్నట్టిన్ని, అనగా సాక్షిగానుండి దేహాదిసంఘాతమునకు చేతనముఁకలుగ చేయు చున్నట్టిన్ని, (అనగా ఈ తెలుసుకొనుబోద్ధయే, శుద్ధ బోధస్వరూపమగుచు, ప్రమిత్సుడగుచు, ప్రమాణ,ప్రమేయ ములున్ను అగునని భావము. మఱియు కోఱికల ఫలముగా పుణ్య పాపకర్మలు చేయబడుచుండుటచే అట్టి కోఱికలే లేని వా డగుటను పుణ్యాపాప రహితుడగుననిన్ని భావము) అవ్రక= వికార రహితమైనట్టిన్ని, (అనగా ముక్కుకు సూటిగా మనో వృత్తిని ప్రత్యక్ వైపుకు నూర్ధ్వముఖము చేసిననే తెలియ తగిన వస్తువైనట్టిన్ని) అకాయ=స్థూల,సూక్ష్మ కారణ శరీర ముల నంటక వాటిలో సాక్షిస్వప్రకాశవస్తువైనట్టిన్ని అవ్రణ= కత్తిచేత నరకబడనలవికానట్టి వస్తువైనట్టిన్ని, అనగా నీ విశేషణములతోనున్నటుల వేద్యమగు వస్తువగునని 'వేద్యము' శబ్దముతో అన్వయమని యెఱుగనగును. ఇటుల రెండేసి మూ డేసి అక్షరముల పదముల అర్థ విభాగముచే అంతరమగు బ్రహ్మ ఒకటే.

ఆ అక్షరముల సంపుటి లేక అనేకముగా కనపడు ఒకే బ్రహ్మ, మూడక్షరములగు పదములోనున్నా, ఏక, రెండు, అక్షర పదములోనున్న ఒకేబ్రహ్మ తెలుపబడుచున్నదని భా వము. ఇటుల మొదటిపాదములో బహుళముగా ( మూడేసి అక్షరములు గల) పదముల యొక్కయు, - రెండవ పాదము లో రెండేసి అక్షరములయొక్క రెండు పదముల యొక్కయు, మూడవ పాదములో మూడక్షరముల పదముల యొక్కయు,

నాలుగవ పాదములో ప్రతి అక్షరము యొక్కయు అర్థము ఒకే బ్రహ్మార్థమును యుక్తి చేతనే తెలుసుకొనదగును. ఇది సంబోధన మగుటను, సంబోధనలో నిమిడియున్న బ్రహ్మను (ప్రమేయము) నమస్కృతిచేయు జీవుడు, (గ్రంథకర్త) (ప్రమాతయు) అక్షరరూపమగు పలుకు దాని అర్థజ్ఞానము. (ప్రమాణము) అన్నియు బ్రహ్మగానే నగునని ప్రతి అక్షర మున్ను "కృష్ణా" అను సంబోధనతో సహా స్పృశింపబడు చున్నది. తర్వాత చివరి రెండుపాదములున్ను కొన్ని గుణ విశేషములయొక్క అనంతత్వముచేత నొప్పు శ్రీకృష్ణుని సంబోధన మగుచున్నది. దీని భావమేమన నమస్కర్త నమ స్కారము, నమోభర్త అంతయు ఏక బ్రహ్మయే. అనగా జీవి గ్రంథకర్త బ్రహ్మయే యని తనను తాను నమస్కరిం చు చున్నాడని తేలుచున్నది. దాని ఫలమేమన అనుభవము మనోప్రశాంతి లేక నిర్విద్య లేక నిర్వృత్తిరూప శుద్ధ మనబడు ఆనంద స్వరూపమగు అప్రమేయత్వమే ప్రతి పాద ములోను చెప్పబడుచున్నది. ఇటులను ఆ బ్రహ్మయొక్క అ నంత గుణములను, ప్రత్యేకముగాను, ఐదుగాను విభజించి ప్రతిగుణ అనంతత్వ వస్తువు ఒక్కటే ఎట్లు నిరూపింప బడు చున్నదో ఇంకను ఈ నామరూపవివర్త బ్రహ్మ లేక ప్రపం చము శబ్దబ్రహ్మ యని యెటులను నిరూపింప బడుచున్నదో చెప్పబడుచున్నది.

అవక్రము — వికారరహితమైనట్టిన్ని, అవ్రణ... దానిని ఏ విధముగాను చెడగొట్టుటకు ... ...గా విభజించుటకు

లేక గాయపరచుటకు వీలుపడనట్టిన్ని, అకాయము — దానిని కనపరచకుండా ఆవరించు ఇంకొక ఉపాధి లేనట్టిదిన్ని, అనగా కాయము లేక ఉపాధి లేక శరీరము యొద్దియు కలిగియుండనట్టి వస్తువున్నూ, అగు అనగా స్థూల సూక్ష్మ కారణ శరీరములకు లేక కప్పులకు లేక ఉపాధులకు సాక్షిగా వాటన్నిటిలోను ఉన్నవస్తువు అగుచున్నట్టిన్నీ, కృష్ణా - భూవాచకము లేక ప్రవృత్తివాచకమగు కృషి, నిర్వృత్తి వాచకమగు 'ణ' ల యొక్క ఐక్యసూచక మగు లేక ఫలమగు "కృష్ణ" (కృషి:+ణ:+క్లిప్ = కృష్ణ +అ) బ్రహ్మగా అన్నిటికీ అధిదేవతా ! అనగా బ్రహ్మయే అంతయూ నగువాడా ! (శ్రీ కృష్ణశబ్దితబ్రహ్మగ సంబోధనవాచ్యా!) నాకు మంగళము సుఖములేక ఆనందమును ఇచ్చుటకై నమస్కారము ఇదె = ఇదియే కైకొనుము. అనునది లోపించియున్నదని స్ఫురించుచున్నది. అని బాహ్యార్థము. ఇటుల మంగళాచరణ బాహ్యార్థము లేక వాక్యార్థము లేక వాచ్యార్థము అనంతత్వముచేత శ్రీకృష్ణునికి ఒప్పుచున్నది.

అంతరార్థము:- బ్రహ్మయని చెప్పబడు పరమాత్మ ఇచట మొదటి మూడుఅక్షరములచేతనున్నూ వి - వికారము లేక వివర్తము అగునట్టిన్ని ధి - అనగా మనోరూపమగునట్టిన్ని న - బ్రహ్మ = ఆకాశ బీజమగునట్టిన్ని ఏకవస్తువే [illegible] మూడు విధములుగా "ఏకంసత్" పదార్థమే "విప్రా [illegible] ఋగ్వేద వాక్యార్థము యుక్తి చేతనే బహుధా భవన్తి" [illegible] తెలుసుకొనగలుగుదుము చెప్పబడుచున్నది. ఆ వస్తువు నెటుల

అనగా ఒక్కొక్క గుణముచేతనే అనంత గుణోపేతమగు ఆ ఒకే బ్రహ్మవస్తువే తెలుపబడుచున్నది. అనంతత్వముగా కొన్నిగుణములుతీసుకొని వాటియొక్క అనంతత్వము ప్రత్యేకముగానే ప్రతిగుణానంతత్వమునున్న, స్వతంత్రముగాకలిగి యున్న వస్తువుగా వర్ణించి, తక్కిన విశేషములు కలిగియుండ లేదను భ్రమ నివర్తి చేయుటయే ఈ పద్యముయొక్క అంతరార్థ ప్రయోజనమగుచున్నది.

<u>లక్ష్యార్థము:-</u> ఈ అంతరార్థముచేత లక్ష్యమగు బ్రహ్మార్థముగా కృష్ణుడు తెలుపబడుచున్నాడు. అట్టిబ్రహ్మనే కృష్ణాయని సంబోధించుటచేత అవిఘ్నకరములేక మంగళకరము అగుటచే అట్టి మంగళకరుడగు బ్రహ్మసంబోధన జీవుడే బ్రహ్మయను బోధ విషయమైన ఈ విమర్శనాత్మక గ్రంథ విషయ ప్రయోజనకరమైనది.ఐతే ఈ బ్రహ్మవస్తువు ప్రతిఅక్షరములోను ఎటుల మూడు విధములుగా అనగా బహుళముగా తెలియుచున్నది అను సందేహమును నివర్తింప బడుచున్నది. మొదటి అక్షరము 'వ్'+ఇ=వి, 'వ్' బీజాక్షరము ఉదకబీజము సంతోషకారి లేక ఆనంద స్వరూప సూచకము. వివర్త వస్తువు (వ్యాప్య వ్యాపకవస్తువు) వ్ – ఇ– అనుటచే 'ఇ' అగ్ని బీజము. ఇది తదితరములను దహించు వస్తువు. బహుళముగా ఇటుల మూడువిధములను ప్రత్యక్షము (వివర్తము, ఇతరమునుదహించునది ఆనందము) అగు వస్తువగుచున్నది. దీనిని 'వ్' + ఇ అని రెండుగా మాత్రము విడదీసిన అవి రెండుగావున్న వస్తువు అనగా

ద్వైతముగా అనుస్యూతముగా నున్నదని అర్థము. 'ఇ' అనగా ఇదము. ఇదము అనగా యావత్తు దృశ్యప్రపంచమని యర్థము. ఇటుల అది ఆనందము లేక బ్రహ్మతో కూడిక కలిగిన బ్రహ్మసత్తు, లేక శక్తి(కార్యము)కూడికయగుచుఅందులో బహుళముగా ననుస్యూతం, విశిష్టాద్వైత మగుచున్నది. అనగా కూడికకల్గి ఏకత్వములేక అద్వైతమగు ఉనికియే ఆ కూడిక వస్తువు అగుచున్నది. ఇటుల ఒకే అక్షరముకూడ ఒకే బ్రహ్మార్థకమని తెలియనగును. ఇటులనంతయు (అద్వైతము) ద్వైతము విశిష్టాద్వైతముగ ఏకం, సత్, విప్రా, బహుధా భవన్తి. (ఋగ్వేదం 10-32-3) అను వేదవాక్య లక్ష్యార్థమే అగుచు ప్రతి అక్షరములోను బ్రహ్మ స్ఫురించుచున్నదని, క్లుప్తముగా యుక్తి లేక మనస్సుయొక్క ఊహచేతనే తెలుసుకొన బడుచున్నది. ఎట్లనగా పక్షాంతరముగ 'న్' అను అక్షరమున కధి దేవత, వరుణుడు, ఆకాశబీజము, ఫలము, విష నిర్హరణ అనగా వికార నాశము. "ఇ" అగ్నిబీజము, అధి దేవత మన్మధుడు, ఫలము పుష్టి, ధి-[ధ్+ఇ] ఉదకబీజము "ధ్" అధిదేవత ధన్వంతరి, ఫలము విషజ్వర వినాశము. 'ఇ' అగ్నిబీజము, మన్మధుడు- పుష్టి, 'ధి' అనగా మనస్సు. బ్రహ్మనన్య, శక్తి లేక ఈశ్వరవశ్య నె (ఞ+ఎ) న్ లేక న ఆకాశబీజము. వినాయకుడు, ఫలము, విఘ్ననాశము. 'ఎ' వాయు బీజము. వ్యాప్యవ్యాపక వస్తువగు విష్ణువు, ఫలము స్త్రీవశ్యము. అనగా ధీ యను మనస్సు విష్ణువశ్యమే. 'ధీ' స్త్రీవాచకమే అగుచు అవినాభావసంబంధము అగుటవలన అనన్యమునున్న, అంతకంటె మించకపోగా ఆయనవశ్యమే. ఈ అనన్య

శక్తి లేక చిచ్ఛక్తిగా చిత్ అని చెప్పబడు పరమాత్మ లేక విష్ణువుయొక్క భార్య వాచి-లేక అవినాభావవాచి అగుచున్నది. అందుచేత పురుషవాచి విష్ణువుయొక్క వశ్యముఐనదే ఆయనశక్తియగు స్త్రీవాచకము. ఇటుల నాఫలము అంతయు విష్ణ్వనన్యమగుటే. అందుచే ఎటువిచారించినను, లక్ష్యమగు బ్రిహ్మ ఒక్కటే,విశిష్టాద్వైతము మూడు లేక బహువిధములుగాను ద్వైతము లేక రెండువిధములుగాను, అద్వైతము లేక ఒకే విధముగాను అన్నిటిలోను అనుస్యూతముగా నుండుట వలన అంతయు ఏకవస్తువనిన్ని, అది స్వప్రికాశవస్తువనిన్ని, 'భారూప' అను ఛాందోగ్య ప్రిమాణముచేత చెప్పబడు 'భా'= ప్రికాశ 'భాస్య' ప్రితిబింబ రూపముగా ప్రిత్యక్షముగా అందరికి పాిచుర్యము (లేక పాితిలోమ్యముగా ప్రికాశించు చున్నది. లేక వ్యతిరేకముఖముగా యుక్తితో శోధించిన ఏకవస్తువుగానే మిగులుచున్నది.) అనియు అది తానే (జీవుడే) ఎటులనగునో ఆ విషయమే 'శ్రీభగవద్గీత చోదనా' యగుటచేత ఆ ఫలమును పొందుటకగు సులభమార్గబోధయు వాటియొక్క నిర్ణిక్తము లేక సిద్ధాంతము కిింద చేయుటలో ఏ అడ్డంకులు లేకుండ కొనసాగించుటకు అనగా ఫలితముగా ప్రిశాంతస్వరూపుడగుటచేత, అట్టి ప్రిశాంతస్వరూపుడు అగు శ్రీకృష్ణపరమాత్మ సంబోధనఅగునట్టిన్ని జీవానన్య మగునట్టిన్ని బ్రిహ్మసంబోధన శ్రీకృష్ణునికే కొన్ని గుణములయొక్క అనంతత్వ చోదనావివరణ అగుచున్నది. ఐతే ఈ బోధ జీవ బ్రిహ్మైక్యముకాగా, అదెటుల నిందులో స్ఫురించుచున్నదను శఙ్క వివర్తి చేయబడుచున్నది. వ్+ఇ

అనగా 'వి' విష్ణువాచియగు సమిష్టి ప్రపంచములో జీవి ప్రత్యేక అవయవముకాగా అది జీవవాచిగానున్నా, అది అంతర్భావముగా నున్నది. అందు జీవవాచి వి—వివర్త బ్రహ్మ వాచి—ధి=మనస్సు. దానిలో—న బ్రహ్మావాచి ఏకవే లేక వ్యాప్య వ్యాపక రూపమే అనగా జీవబ్రహ్మైక్య విషయమే ఇచట ద్యోతకమగుచున్నది. అని క్లుప్తముగా చెప్పబడుచున్నది. అందుచేత 1. లక్ష్యార్థకము, 2. అంతరార్థకము, 3. బాహ్యార్థకముగానున్న, 4 శబ్దముగానున్న 5. శబ్ద సముదాయము గానున్న 6.అక్షరముగానున్న,(ప్రాణము లేక స్వరముయొక్కయు హల్లు లేక వ్యంజనముయొక్కయు,' కూడికఫలముగా నున్న, 7. నాలుగవ అవస్థ లేక అనుభవమగు ఆనంద స్వరూపమును ఏకవస్తువు యగు బ్రహ్మయే.అన్ని నామ రూపజడ ఉపాధులలోనున్న ప్రాచుర్యము 'భా' 'భాస్య' రూపములుగా 'భాభా' అఖండైక్య ప్రకాశమగు చున్నది. ( అనగా స్వప్రకాశమగుచున్నది. ) ఇటుల నొకే బ్రహ్మ (వస్తువు) ద్వైత (రెండు) అద్వైత (ఒక్క) విశిష్టాద్వైత(బహుళము లేక అనేకము)ముగా అనుస్యూతముగ (అనుసరించి వాటిమయముముగ) ప్రాచుర్య మగుచున్నదని లక్ష్యార్థము. అది ఆకసమును బోలియుండుట చేత అధికార తారతమ్యముగ జీవుల భావ (మనోవృత్తి) ఆకారముపొందు చున్నది. (తాదాత్మ్య మొందుచున్నది లేక విషయాకార మొందుచున్నది. )

ఇటులగుట దాని స్వభావము. దృష్టాంతముగ ఒక

వృత్తమును (సున్నను) చూడుడు. దానిలోని కేంద్రస్థానము బొట్టులేక సున్నయగుచున్నది. ఆ బొట్టునుంచే అనేక బొట్టులు ( సున్నలు ) కలయికచేత నగు గీతలే వ్యాస వ్యాసార్ధములు వృత్తపరిధివరకు క్రమనియమముగా నగుచున్నది గదా! ఇదంతయు బొట్టులమయమే యని తెలియనగును కదా!అందుచేత ఈవృత్తములోని గీతలన్నిటిలోనుబొట్టే మయమగుచు నిండి నిబిడీకృతమగునని చెప్పబడుచున్నది. అటులనే పూర్ణబ్రహ్మయే ఈ సృష్టి [ప్రపంచము) యందంతటను ఒకటిగాను, రెండుగాను, అనేకముగాను, నిండి నిబిడీకృతమై యున్నదని బ్రహ్మశాస్త్రము, 'పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే ' ' ఏకం సత్ విప్రా బహుధా భవంతి' అను ప్రమాణములచేత సిద్ధాంతము చేయుచున్నది.

ఇటులనే బ్రహ్మ స్పర్శ విచారణచేసి చేయనగును. ఎటులనగా మనోవృత్తి రెండువిధములు. 1. సంస్కృత మనస్సు 2. మలినమనస్సు— సంస్కృత మనస్సు శుద్ధ సత్వమే; మలిన మనస్సు రజస్సు, తమము అను గుణములతో కూడియుండి 1. అసంభావన, 2. విపరీతభావన, 3. సంశయ భావనలతో కూడియుండును. అసంభావుడు కేవలము తెలియని వాడే. అపార్థము చేసుకొనువాడు విపరీత భావుడు. సంశయ భావుడు విచక్షణచేయ ప్రారంభించువాడు. అసంభావుని తీసుకొని ఆతని అజ్ఞానమును పోగొట్టి నీవు బ్రహ్మవేనని చెప్పి సంశయ భావునిగా (మధ్యమాధికారిగ) చేసి నీవు బ్రహ్మవే అగుదువు. ఆ విషయమును నీవు మఱచితివి.

నీవున్ను బ్రహ్మవగుదువు సుమా! అని బోధించి అందువలన అవునా కాదా అను సంశయములతో కూడిన వానినిగా నొనర్చి నంతటను బ్రహ్మగ నే నెట్లయితిని అను జీవుని బ్రహ్మయందు మనోవృత్తిని ముక్కుకు సూటిగా నిలుపునట్లు చేయుటమూలముగా పై న్యాయముచేతనున్నూ, రజస్సు, తమస్సులను గుణములనువృత్తులు లేమి దానికి సాధన ములు. (అనగా కోరికలుఅన్నిటినిన్ని అనగా వాటి కార్యములు తుడిచివేయుట) అనుసాధనము అజ్ఞముగా నుపయోగించిన సత్వగుణము మాత్రమే ఆ మనస్సు అగుచు శుద్ధసత్వమే అగు నని చెప్పబడు ఆ మనస్సగును ఈ సంస్కృత మనస్సే దాని కంటె ఇతరముగాకుండ అనన్యముగానే బ్రహ్మగా ప్రకాశిం చును. అందుకు అట్టి శుద్ధజీవుడే బ్రహ్మ జ్ఞానైకరసముగా నగును. అట్టి అనుభవమే అప్రమేయావస్థ లేక మోక్షము. దీని విశేష వివరణమే మాచే రచితమగు "అద్వైతాంభ" గ్రంథములో చూడనగును.

ఇదంతయు బ్రహ్మసూత్రములలోనున్నూ, ఉపని షత్తులలోనున్నూ చెప్పబడి యున్నందున అన్నిపావనముల లోను బ్రహ్మస్పర్శ (లక్ష్యము) గననగును.

1. శ్లో॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥
( బృహ. ఉప )

2. మనసైవేద మాప్తవ్యం నేహనానాస్తికించన ।
... ... ... ... ... ... (కఠోప)

3. భారూప:- (ఛాందోగ్య ఉ.ప) ప్రమాణములను చూడనగును. అందుచే అన్నిటికిని, మూలము సత్యమగు అద్వైత బ్రహ్మ (ఒక్కటే) అనియు అదే రెండుగా (ద్వైతముగా) బ్రహ్మగ ఆయనతో కూడిన బ్రహ్మనన్యశక్తి లేక బ్రహ్మసత్త లేక చిచ్ఛక్తిలో వ్యాపించియున్నదనియు, అదియే తిరిగి బహుళముగా (అనేకముగా) నున్న ప్రతి ప్రత్యేకభాగములోను, విశిష్టాద్వైతముగానున్న కూడి వాటి సంపుటియగు ఈ కనపడు నామరూప ప్రపంచముగా నున్నదనియు స్పష్టమగుచున్నది. ఈ బహుళ ప్రపంచమును సృష్టించి అద్వైతముగా బ్రహ్మ ప్రకాశించును. ఈ ద్వైతమును శోధింపగా అంతటను అనుస్యూతముగానున్న ఒకే బ్రహ్మ గోచరించును. ఆ సమకాలములో జీవుడు వేఱు, బ్రహ్మవేఱు అను భ్రమవృత్తి నశించి జీవుడు బ్రహ్మగా దశమునివలెనే మిగులుచున్నాడు.

Rs 1189 294572 PAK

అవస్థ:—ఈ సాధననే, వ్యతిరేకముగా క్రమనియమముగా నగు శోధన లేక యుక్తియందురు. ఆ అవస్థలో జీవుడు వేఱుగానుస్థితి, లేక అప్రమేయము (తనకంటె అన్యము నెఱుంగని స్థితి) జీవుడుపొంది అప్రమేయనియు, అనగా తెలివి లేక జ్ఞానమే ఏకరసము, కాగా బ్రహ్మగనే అనుభవించుచుండును. ఈ అనుభవమే బ్రహ్మావస్థ. ఇంతకంటే వేఱు సులభమార్గమేదియు, జీవుడు జీవించియుండగానే బ్రహ్మయగుటకు లేనందున, బ్రహ్మను తెలుసుకొనుటకే భగవంతుడు ద్వైతమగు నామరూప ప్రపంచమును, సృష్టించెను.

దాని ఉపయోగమేమన ద్వైతమును శోధించి అందులో ఏకముగానున్న (అద్వైతమగు) బ్రహ్మ లేక జ్ఞానైకరసము అనుభవమును కలిగి జీవులు తరించుటకు సాధనముగానది సృష్టిచేయఁబడినది. తక్కిన మార్గములన్నియు మాయా కార్యములగుచు చివరకీ మార్గమున ఏకాగ్ర్యబుద్ధినందు జీవుని (సాధకుని) ప్రేరేపించునవే. ఈ విషయమే సూత్ర ప్రాయముగా "విజ్ఞప్తయే హి సర్గం జగాజగా" అను సి సూ. 1-4-30 అను ప్రమాణములో చెప్పబడుచున్నది. ఈ క్రింది సాధనలు మాత్రమే జీవబ్రహ్మైక్యజ్ఞానమునకు 1. శ్రవణము: (విచారణ) లేక శోధన. 2. మననము (ఏకాగ్ర్యము లేక కేంద్రీకరణము లేక యుక్తిచేసగు ఊహ) 3. నిదిధ్యాసన (శోధనను విడువక ఆ బ్రహ్మవృత్తుల సంపుటిని ఎడతెగ కుండా కలిగియుండుటయు నగుచున్నది. మననమునుచేయుచు శుద్ధముగా సంస్కరించుటయు) అను మూడేమార్గములు రాచ బాటగా ఏర్పరుపబడి ఒక్కొక్కటేగాని, రెండుగాని, మూడు సాధనములు కలిసిగాని పరికరములుగ ఫలమీయగలవు అనగా జీవుడే బ్రహ్మగా ననుభవము నీయగలవని ఉపనిషత్తులే చెప్పుచున్నవి. మాచే రచిత 'అద్వైతభా' చూడనగును. పారిశేష్యముగా ఈ రెండు, మూడు (లేక బహుళము)గా కనపడు యావత్తు దృశ్యమున్న అద్వైతమే (ఒక్కటే) యగుటను పైవిధముగా అద్వైతములో, ద్వైత, విశిష్టా ద్వైతములు ఏకదేశిమతములగుచున్నవి. అద్వైతమే శాంతిని తృప్తినిచ్చుచు, ఆనందస్వరూపుని చేయును. అది అనుభ

వైకవేద్యమేనని స్పష్టమేయని బ్రహ్మస్పర్శ సారాంశమున్ను లక్ష్యార్థమున్ను, అగుచున్నది.

మార్గమూ సులభము, ఫలమూ అనంతము అగు బ్రహ్మత్వము లేక మోక్షము. అదియు జీవించియుండగానే జీవునికి కరతలామకము. కష్టమూ ద్వైత విశిష్టాద్వైత, అద్వైత గమ్యస్థానములకు ఒక్కరకపు కష్టమే. అనగా విమర్శ జ్ఞానవృత్తి లేక మనోవ్యగ్రత మూటికి కావలసినదే. దానికి పరికరము గురుశిష్యన్యాయ సుగమతర్కము (మనోవృత్తి లేక ఊహ) కనుక 'అద్వైతభా' గ్రంథము చదివిన సాధకు లకు కరతలామలకమగును. జీవబ్రహ్మైక్యమే "శ్రీభగవద్గీత చోధనా" యని లక్ష్యార్థక మంగళాచరణమును అనగా లక్ష్య వస్తు నమస్కారమును అవిఘ్నముకొఱకుచేసి గ్రంథారంభ మున వివరింపబడునట్టి జీవబ్రహ్మైక్య సాధనయగు అనాసక్త కర్మయోగమే శ్రీభగవద్గీత చోదనా యగుననుటకు అవతా రిక ప్రారంభింపబడుచున్నది.

## అవతారిక -

ఇటుల బ్రహ్మతత్వము మంగళాచరణములోనే వివ రింపఁ బడినదిగదా! శ్రీ "భగవద్గీత చోదనా" ను గూర్చిన విచారము అనావశ్యకమేనను శఙ్క నివర్తి చేయబడుచున్నది. మంగళాచరణ పద్యములో గ్రంథస్త విషయసారము స్థాలీ పులాకన్యాయముగా వ్రాయబడును. ఈ జీవులు సాధార ణాధికారులు. వీరు బాహ్యమున చూచునదంతయు నిత్య

సత్యమని నమ్మి సంసారబంధ నిమగ్నులగుచున్నారు. వీరు వస్తుతత్త్వ జ్ఞానమునుమఱచిపోయిరి. అట్టివారిని (అనధికారులను) ఏకాగ్ర్యులను చెప్పబోవు విషయమందు చేయుటే మంగళాచరణపద్యము చేయును. అందుచేత పఠిత సంశయోపేత మధ్యమాధికారి, ఆ పద్యార్థ గ్రహణముచేత నగుచున్నాడు. మఱియు నీ "శ్రీ భగవద్గీత చోదనా" విషయ ప్రతిజ్ఞ చేయుటకు నీ మంగళాచరణపద్యము ప్రయోజనకారి. తత్ప్రాంత విషయ బాహుళ్యమగు వివరణ చోదనా సాధనయగు "అనాసక్త కర్మయోగము" ద్వారా ముఖ్యముగా మూడు విధములగు తర్కము లేక మనస్సుయొక్క ఊహతో చెప్పబడుచు విషయసిద్ధాన్తము చేయబడును. ఈఊహ (తర్కము) 1. ప్రతిజ్ఞ, 2. ఆక్షేపసమాధానము 3. సిద్ధాంతము అని మూడువిధములుగా నగుచున్నది. ఈ మూటిలోనే తక్కిన తర్క భాగములు అగు 21 అర్జములున్న అంతర్భాగములని గ్రహింపనగును. శ్రీ భగవద్గీతలో శ్రీకృష్ణుడు గురువు (పరమాత్మయే). అర్జునుడు శిష్యుడు (జీవుడు) బోధయన్ననో గురు శిష్యన్యాయమున చేయబడినది. విషయప్రయోజనము మోక్షము. అందుచేత చోదనా మోక్ష ప్రయోజనకారియే.

♦ అనుబంధ చతుష్టయము ♦

ఇది ముముక్షు గ్రంథమైనయెడల అనుబంధ చతుష్టయ ముండవలెనే ? గురు శిష్యాధికారము చెప్పిరి గదా ?

తక్కిన అనుబంధచతుష్టయ మంశములున్నవా నను శంక పరిహరింపఁబడు చున్నది.

2. విచారకర్తవ్య సంబంధము : పైన చెప్పబడిన శిష్యుడు మధ్యమాధికారి యగుచున్నాడు.

ముఖ్యసంశయములు : 1. జీవుడు బ్రహ్మయేనా ? కాడా ? బ్రహ్మయైన యుద్ధమెందుకు చేయవలెను ? యుద్ధము పాపకార్యము కాదా ? చేసిన ఆ పాపము నాకు ఎటుల నివర్తించును? స్వధర్మ యుద్ధము చేసినయెడల నాకు పాపమెందుకులేదు ? పాపము లేకుండుటే నిశ్చయమై యుండవలెను. లేనిచో యుద్ధప్రవర్తన విరమింపక అనాసక్తకర్మగా చేయుమనుచున్నాడు శ్రీకృష్ణుడు. అది నిజమై యుండవచ్చును. భీష్మాదులు యుద్ధోన్ముఖులై యున్నారే? ఐన యెట్లు పాపనివర్తకముగ యుద్ధము చేయవలయును ? హింసాత్మక యుద్ధకర్మము చేసిన మోక్షము నాకెటుల కలుగును ? అను సందేహములతోనున్న అర్జునునికి (మోక్షార్థికి) విచారకర్తవ్యతా సంబంధమును నిర్ధరించుచున్నది. భగవద్గీత ఉపదేశించు కర్మ, జ్ఞాన, భక్తియోగములలో నేది కర్తవ్యము అగు నని నిర్ణ విచారకర్తవ్యమే.

3. ప్రమేయ విషయము : ( తెలుసుకొనబడు విషయము ) ఈ 'శ్రీభగవద్గీతచోదనా' లో అనాసక్త కర్మయోగమే అర్జునున కుపదేశింపఁబడుచున్నది. అది మోక్షము నిచ్చునని యే చెప్పబడినది. అతని సందేహములు తీరుటకున్ను అనాసక్త కర్మయోగము చేయుటకున్ను, భక్తిజ్ఞాన యో

గాజ్ఞములుచెప్పి అతనికెట్టి పాపమును యుద్ధపూర్వక హింసా కర్మముచేత కలుగదో ప్రిబోధింపబడినది. ఇటులను ముఖ్య సన్యాసము (పారమార్థికసన్యాసము) నిచ్చు మోక్షమునే అనాసక్త కర్మయోగము (గౌణ సన్యాసము) నిచ్చుననిన్ని అట్టి యనాసక్తకర్మయోగి చేసిన హింసాత్మక కర్మవలన హననపాపము కలుగదనిన్ని ప్రిబోధవిషయ మగుచున్నది.

4. విషయప్రియోజనము : సయుక్తిముగ జెప్పు నీ యనాసక్త కర్మయోగమును వివరించు శ్రీభగవద్గీతచోదనా విషయము జ్ఞాన, భక్తియోగములవలననే అట్టి మోక్షము కలుగచుండవచ్చునా యను సందేహనివర్తి చేసి శ్రీ భగవద్గీతచోదితానాసక్త కర్మయోగమున్ను, జీవబ్రిహ్మైక్యజ్ఞాన ఫలక ప్రియోజక మోక్షప్రితిపాదికమే నను ప్రియోజనము కలుగజేయుచున్నది. ఇచట మోక్షమనగా జీవబ్రిహ్మైక్యావధి. అది అనాసక్త కర్మయోగ ఫలము. అట్టి జ్ఞానానన్య జ్ఞానైకరసప్రాప్తి జీవించియుండగానే కలుగుస్థితి అనాశక్త కర్మయోగముద్వారా భగవంతుని కృపవలననే సులభముగా కలుగును. ఈ మోక్షము, పరమార్థ (ముఖ్య) జ్ఞానసన్యాస, మక్కరలేకనే కలుగునను విశేషము గమనీయము.

ఐతే ఈ ప్రిత్యేక విమర్శనాగ్రింథావశ్యక మేలయను శంకగూడ నివర్తింపబడుచున్నది.

ఈ భగవద్గీతకు లోగడ ననేక వ్యాఖ్యానములును, ముఖ్యముగా ద్వైత, విశిష్టాద్వైత, అద్వైత పరముగా భాష్య త్రియము చేయబడియున్నవి. వారివారి బుద్ధిసూక్ష్మత ననుస

రించి భాష్యములను రచించిరి. శ్రీ మధ్వ, శ్రీ రామానుజ, శ్రీ శంకరభాష్యములు ప్రచారములో ముఖ్యముగానున్నవి. ఇందులో యేది సరియయిన దనునది .వివాదాంశము గానే యున్నది. అందుచేత శ్రీ భగవద్గీతయొక్క బోధ మూల శ్లోకముల నన్వయముగు చేసియున్నా, యోగవాసిష్ఠ శ్లోకముల నన్వయము చేసియున్నా, శ్రీ భగవద్గీతచోదనా అనాసక్త కర్మయోగమనియే నిష్పాక్షిక సిద్ధాంతము చేయుటకీ యీ విమర్శనాగ్రంథ మావశ్యకమై యున్నందున రచింపబడు చున్నది. ఆయా భాష్యము లటుల వేరుగా నుండుట ఆయా కాలములందలి జీవుల బుద్ధి పరిణామము ననుసరించి మాత్రి మప్పటిజీవుల కవగతమగునటుల వ్రాసి ద్వైత,విశిష్టా ద్వైత భాష్యకారులు ఆకాలపు జీవుల కనవగత మాంశము ను కాలమునకు వదిలివేసినటుల కన్పడుచున్నది. శ్రీశంకరా చార్యులవారు ఒక్కగే ఉపనిషదులను బ్రహ్మసూత్రములను సమన్వయము చేసి వ్రాసిరి.

సత్యాన్వేషణము అత్యవసరమగుటను అద్వైతభాషాస్త్ర జ్ఞాన స్పృహయును ఆకుటాయి కూడ తలచి అనేక గ్రంథము లను పరిశీలించి చరిత్రాత్మకముగానున్నా, ప్రామాణికత్వ ముగానున్నా, అనాసక్త కర్మయోగమే శ్రీ భగవద్గీత చోదనా విషయమనియు ఇట్టి గౌణసన్న్యాసము (కర్మఫలసన్న్యాసము) పరమార్థ సన్న్యాసమిడు ఫలము [ ముఖ్యమగు జ్ఞాననిష్ఠా ఫలము ] నెటుల నిచ్చునో కేవల తర్కమూలముగానే ప్రద ర్శింప బడుచున్నది.

# శ్రీ భగవద్గీత చోదనా

## విషయ ఉపోద్ఘాతము

ఈ విషయము 1. ప్రతిజ్ఞ -2. ఆక్షేపసమాధానము. 3. సిద్ధాంతము అను మూడు విధములుగా స్థూలముగా; విభజింపబడి వివరింపఁబడుచున్నది.

ఈ భగవద్గీతబోధ విషయమేమి? అనుశఙ్కనివర్తింపఁబడుచున్నది. ఇందుకు ఉపనిషత్ప్రతిపాదితమగు తర్కము (మనస్సుయొక్క ఊహయే)సాధనగా అనువదింపబడుచున్నది. మామిడిపండ్లు కనపడకుండా వేయబడిన, దాని చుట్టునున్న కంచెను ఛేదించిననే, ఆపండ్లను తెలుసుకొనుటయు, అనుభవించుటయు ఎటులసాధ్యమగునో అటులనే శ్రీ భగవద్గీతలో చెప్పబడిన విషయము నిగూఢముగానున్నందున, "తత్త్వే వితర్కోన్మేషకల్మషాత్। (సి.సూ 3-4-31) తత్త్వాభివ్యక్తిశ్చైత్యాధిగమ వితర్కాపాయాభ్యామ్ (సి.సూ 3-4-37) అను ప్రII లచేత తర్కసాధనచేతనే ఈ చోదనావిషయము బయలుపఱుపబడుచున్నది. ఐతే ఈ తర్కము మూఁడుఅఙ్గములలో తక్కిన 21 అఙ్గములు అంతర్భాగములని తెలియవలెను.

1. ప్రతిజ్ఞ :- 'శ్రీ భగవద్గీతచోదనా లేక బోధ' అనాసక్త కర్మయోగమే. ఆ ప్రబోధముద్వారానే జీవుని గమ్యస్థాన మగు జీవ బ్రహ్మైక్య జ్ఞానానన్ద మోక్షమును పరమాత్మ యగు శ్రీకృష్ణుడు తన ప్రియశిష్యుడగు అర్జునుని ప్రాకృత పురుషు డగు జీవుని స్థానములో సుఖ దుఃఖానుభూతునిగా నొనర్చి, భారత యుద్ధభూమి యగు కురుక్షేత్రములో అనాసక్త కర్మయోగము నవలంబించి (కర్మఫల సన్యాసము చేసి) విశ్వరూపసందర్శనము చేయుచు యుద్ధము చేసిన అపాపుడే అర్జునుడు (జీవుని స్థానములో నున్నవాడు) అగునని ప్రబోధించెను. బ్రహ్మ సంస్పర్శచే అజ్ఞానము నాశనమగుటకు ఈ అనాసక్త కర్మయోగమునకు భక్తి జ్ఞానయోగము లంగములుగా ప్రబోధించెను ఇచట సత్పదార్థ మగు సర్వజ్ఞుడగు పరమాత్మయే శ్రీకృష్ణుడను గురువు.

ఆ సత్పదార్థముగా నిగూఢముగానుండి పరమాత్మ అంశ యగునట్టిన్ని, తానుగూడ పరమాత్మయే యనునది మరచిపోయి, జీవత్వమును ఉపాధిదోషముచేత, జపాపుష్పము చేత ఆవరింపబడు శుద్ధ స్ఫటికమువలె, రాగద్వేషములచే నావరింపబడిన అధ్యాసిక జీవుడు(అర్జునుడు) భగవత్కరుణ చేత ఉభయ యుద్ధ వ్యూహముల మధ్యను తానుండి రానున్న బంధుమారణ పాప దుఃఖమున్ను, రాజ్యప్రాప్తి సుఖమున్ను అనేకబహు ద్వంద్వములలో చిక్కుకొని, రాజ్యమును కోల్పోవుట మంచిదా? దుఃఖభూయిష్ట రాజ్యప్రాప్తిని గైకొనుట మంచిదా? అను సందేహాయుతుడైన (అనగా అసం

భావన, విపరీతభావన, సంశయభావన అను వాటితో కూడు కొనియున్న) శిష్యుడు ఈ అర్జునుడు. కాగా అందుచేత పర గురువగు శ్రీకృష్ణ పరమాత్మ మార్జాలకిశోర న్యాయమున తన యంశమే యగు అర్జునుని అజ్ఞానావస్థలో నుంచి ధర్మ యుద్ధమెటుల సుక్షత్రియునికి గమ్యస్థానము (మోక్షము లేక బ్రహ్మత్వము) కలుగజేయునో అందుకు అనాసక్త కర్మ యోగ మెటుల నుత్తమ క్షత్రియ కర్మయో అర్జునుని నిమిత్తీకృతుని చేసి, యుద్ధ వ్యూహములోనున్న ఉభయపక్షముల వారికిన్ని, ప్రపంచములో జీవులందరికిన్ని, ఉపదేశ మూలకముగా తదుపాయమును ప్రదర్శించిరి. దీనికి భాషా పరికరము పామర భాష (వ్యావహారిక భాష) అనగా బ్రహ్మ కాని నామరూపాత్మక వస్తు వొకటి, సత్య వస్తువగు బ్రహ్మ మొక్కటి యుండగా తన కనన్యమగు బ్రహ్మశక్తి లేక సత్త (మాయాశక్తి) యొక్క కార్యరూపమగు నామమును ఆరోహించి (అనగా యెక్కి లేక విషయీకరించి లేక గ్రహించి, ఆ బ్రహ్మయే సర్వనామములున్ను, రూపములను ఆరోహించి (ఎక్కి లేక విషయీకరించి లేక గ్రహించి) సర్వరూపములున్ను తానే అగుటచేత, పామరులు వ్యావహారికముగా నామరూపములే బ్రహ్మయని భ్రమపడి చెప్పుచుండు భాష ఈ పామరభాష అని అర్థము. ఇట్టి భాషచేతనే ఆ పదముల బాహ్యార్థము (బయటికి తెలియబడు పదముల అర్థము) చేతనున్ను, (బాహ్య ప్రాకృత) యథా సంభవ కర్మ చేతనున్ను, లక్ష్యమగు ఒకే బ్రహ్మత్వము పొందుటకు సరియయిన వ్యవహార మార్గమును చూపించి, ఈ బ్రహ్మచో

దనా ఎటుల నభయమునిడునో వ్యవహార భాషలో పండిత పామర జనరంజకముగా చెప్ప నవసర మగుటచేత చెప్పఁబడ దగినదే. దీనిద్వారానే ప్రాకృతులు (అనగా బ్రహ్మను మర చినవారు) తిరిగి బ్రహ్మను తెలుసుకొనగలరు. అటులను బ్రహ్మానుభవము నొందెదరు. ఇదియే రంతు అనఁబడును.

ఆక్షేపము :- ఈ భగవద్గీతబోధ 6 అధ్యాయములలో 1. అర్జున విషాదయోగము 2. సన్న్యాసయోగము 3. కర్మ ప్రశంసాయోగము 4. జ్ఞానకర్మ సన్న్యాసయోగము 5. ధ్యాన యోగము 6. కర్మసన్న్యాసయోగము అను సాధన ప్రధాన మగు " త్వం " నీవు అను లక్ష్యప్రధాన మగుచున్నది. తరువాతి ఆరు అధ్యాయములు ఉపాస్య నిష్ఠా తత్పదార్థ ప్రధానమగు జ్ఞాననిష్ఠా యోగము 2. బ్రహ్మకర్మ నిర్దేశ యోగము 3. రాజవిద్యా రాజగుహ్య యోగము 4. విభూతి యోగము 5. విశ్వరూపదర్శనము 6. భక్తియోగము ననునవి యగుచున్నవి. ఇఁకను చివరి 6 అధ్యాయములున్నూ ప్రకృతి పురుష వివేకయోగము 2. గుణత్రయ విభాగయోగము 3. పురుషోత్తమయోగము 4. సంపద్విభాగ యోగము 5. శ్రద్ధాత్రయవిభాగయోగము 6. మోక్షసన్న్యాస యోగము ననునవి తత్త్వంపదార్థ ఐక్య రూపమగు ( అనగా ఆ "తత్" పదార్థమే "త్వం" పదార్థమగు నీవు 'అసి' అగుచున్నావు అని జీవుని మనస్సు సంస్కృతము చేయుబడినందున అటుల జ్ఞానైక రసమగు లేక (వాక్యార్థనిష్ఠా సమ్యగ్ధీ) ప్రధానాంత ములగుచున్నవి. అదెటుల ననగా నేను నీకు చెప్పిన అనేక

ఉపపత్తులచేత నిరూపింపబడిన 'నీవే బ్రహ్మమై యున్నావు.' జ్ఞానవృత్తిచేత నీవు 'నేను బ్రహ్మనే' అను వృత్తిని లెస్సగ మనోవృత్తిచేసి జీవుడే బ్రహ్మ - ఇతరుడు కాడు అను వృత్తిని లెస్సగా ననుసంధించి దాని ఫలితముగానే 'చిత్త' లేక 'బ్రహ్మయే చిత్తము' లేక మనస్సగుట చేతనున్నూ అచట యితర వృత్తులు అన్నియు నశించి చిన్మయమే చిత్తముకాగా ఆ మనస్సంతయు చిత్త్వము అనగా 'చిత్తు' మాత్రమే యగు నను వృత్తియగుటచేత ఆ 'చిత్' ఆతివాహికము అగుటను (ఆకాశమువలె అతిసూక్ష్మమున్నూ; సర్వవ్యాపియగుటను) అది చిత్తేయగుచున్నది.

అటుల ననన్యముగా చిత్తే (బ్రహ్మ) చిద్వ్యోమైవ కిలాస్తీహ పరాపర వివర్జితః (అన్నపూర్ణ 5-69) ౨. మన సైవేద మాప్తవ్యం నేహనానాస్తి కించన.। (కఠ 2-4-11) అను ప్ర॥ లచేత శుద్ధజీవుడగు 'త్వం' పదవాచి, 'తత్పద' వాచియగు బ్రహ్మగానే మిగిలియుండగా జీవబ్రహ్మైక్యాను భవము జ్ఞానైకరసముగా స్ఫురించును. (ప్రకాశించును) స్ఫురణమనగా, ప్రకాశము లేక వెలుగు అని అర్థము. మఱొకటక్కడ నుండుట కనకాశమే లేదు. అనగా బ్రహ్మయే జీవుడు అనన్యముగా అప్రమేయగుచున్నాడని అర్థము. అది వఱకున్న జ్ఞానమే జీవుడై యున్నను, జీవుని పూర్వవాసనలు స్మృతిరూపములుగానుండి అవిఘనీభవించి భౌతికవృత్తులుగా మనోవికారములగుచుండును. కాగా తాను వేఱు, బ్రహ్మ వేఱు అను భ్రాంతి సత్యము (నిశ్చయము) తాను బ్రహ్మ

కాలేదు అనుభ్రాంతిని పొందు జీవుడు, భ్రమ ఇప్పుడు నశించుటచేత జ్ఞానైకరసమైనాడు. అవిద్యయను శక్తియొక్క వృత్తులు 1. అజ్ఞానము 2. జ్ఞానము అగుచు ఇవి ఆత్మ నాశ్రయించును. ఈ రెండున్ను పరస్పరధ్వంసకారులు. అందుచేత జ్ఞానమెక్కువపాలైనపుడు అజ్ఞానము నశించును. చీకటి వెల్తురు దీనికి దృష్టాంతము. ఇటుల అనేక విషయ ప్రతిపాదితమున్ను, జ్ఞాన బోధకమున్ను అగుచు, జ్ఞానైక రసము, లేక జీవబ్రహ్మైక్యము, జ్ఞానసాధ్యమే కాగా అనాసక్త కర్మయోగ మెటుల మోక్షసాధకము అగుచున్నది అనునది ఆక్షేపాశయము. జీవ బ్రహ్మైక్యావధియే మోక్షము అగుచున్నది.

సమాధానము:—

ఈ భగవద్గీత బోధించున దెపుడో కాలనిర్ణయ ప్రకరణములో చెప్పబడును. బోధ శ్రీకృష్ణునిచేత అర్జునునకు రెండు యుద్ధ వ్యూహముల మధ్యనుండు రథమునందు యుద్ధారంభ సమయముననియే నిర్వివాదాంశము.

ఈ రెండు వ్యూహములను పరిశీలించి ఘోర యుద్ధములో చావనున్న బంధువర్గమును చూచి దాని ఫలితముగా కలుగనున్న తన దుఃఖమునున్ను తాను గెల్చిన తనకు రానున్న రాజ్యప్రాప్తి సుఖమునున్ను తలపోసి రాగద్వేష యుతుడై ప్రారంభింపనున్న యుద్ధమును విరమించి తన గురువగు శ్రీకృష్ణ పరమాత్మకు,ఎటులనున్ను తాను యుద్ధ

ము చేయుట తగదని, దుఃఖముతో కూడిన రాజ్యసుఖము కంటె భిక్షాటన సౌఖ్యమే మేలని మొఱపెట్టుకొని, యుద్ధపరికరములను జారవిడిచి తనకు శ్రేయోమార్గము బోధింపుమని ప్రార్థించెను.

శ్రీకృష్ణపరమాత్మ ఉత్తమ క్షత్రియధర్మము ఫలకాంక్ష లేకుండా యుద్ధముచేయుటయు, ప్రపంచ మంతటను బ్రహ్మస్వర్శ చేయుచునే యుద్ధము చేయుటయు, (అనాసక్త కర్మయోగము) ఫల మెట్టిదైనను అనుభవించుటయే పరమధర్మమనియు, అట్టి యుద్ధకర్మ అకర్మయే యగుననియు, యుద్ధవిరమణ కర్మయే అగుననియు, కోఱికతో చేయు యుద్ధకర్మ కుకర్మ యనియు, బోధించుచు సందర్భాను సారముగా అర్జునుని శంకలను బాపుచు ఆ వ్యాజమున అర్జునుని అజ్ఞానమంతయు పటాపంచలు చేసెను. ఇటుల యుద్ధకర్మకుగాని — ఏ యితర కర్మకుగాని నీవు సాక్షిగానుండి చేసినయెడల నీ కెట్టి పాపము అంటకుండా నిన్ను తరింపచేయుటయే కాక, పరమార్థ సన్న్యాస (ముఖ్యసన్న్యాస) ఫలక మోక్షము నే ఈ అసక్త బుద్ధికలిగిన గౌణ ముఖ్యసన్న్యాసివైన నీకు ప్రసాదించెదనని అభయము నిచ్చెను. అని—

శ్లో॥ సర్వకర్మాణిమనసా సన్న్యస్యాఽస్తే సుఖంవశీ।
నవద్వారే పురేదేహే నైవ కుర్వన్నకారయన్॥

(భ. గీ. 5 – 8)

అసక్తబుద్ధి సర్వత్ర జితాత్మా విగతస్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసేనాధిగచ్ఛతే॥
అను శ్లోకములు చెప్పుచున్నవి. (భ.గీ. 18-49)

అందుమీద అర్జునుడు బ్రహ్మత్వము తన కెటుల కల్గు నని ప్రశ్నింపగా శ్రీకృష్ణుడు

శ్లో॥ సిద్ధింప్రాప్తో యథాబ్రహ్మ తథాఽఽప్నోతినిబోధమే
సమాసేనైవ కౌంతేయ నిష్ఠాజ్ఞానస్యయాపరా॥
[ భ. గీ. 18-50 ]

శ్లో॥బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానంనియమ్యచ
శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా రాగద్వేషౌవ్యుదశ్యచ॥
(భ. గీ. 18-51)

భక్త్యామామభిజానాతి యావాన్యశ్చాస్మితత్త్వతః
తతోమాం తత్త్వతోజ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥
(భ. గీ. 18-54)

అను శ్లోకములలో చెప్పబడు పరమార్థ సన్యాస జ్ఞాన యోగ ఫలకమోక్షమే నీవు నీ స్వక్షత్రియ కర్మను పైన చెప్పినటులను, అనాసక్తిచేతను చేసి

శ్లో॥సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతంపద మవ్యయం॥
(భ. గీ. 18-56)

చేతసా సర్వకర్మాణి మయి సంన్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతంభవ॥
(భ. గీ. 18-57)

మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అథచేత్త్వ మహంకారా న్నశ్రోష్యసి వినఙ్క్ష్యసి॥
(భ. గీ. 18-58

అను శ్లోకములలో స్వభావముచేత గలుగు కామనా కర్మలను పరిత్యజించుటయు సంన్యాసము కాదనిన్ని ఈశ్వరుడే (పరమాత్మయే) జీవు లందరియందున్ను ఉన్నం దున ఆయనయందే శరణుజొచ్చి జీవుని మనస్సు అను గుహ లోనుండు ఆ పరమాత్మను పూజచేయుచు శాంతిని (మోక్ష మును) పొందుము. ఇదియే జ్ఞానమాఖ్యాన మనిన్ని, అట్టి జ్ఞానాశ్రయమగు అనాసక్త కర్మయోగముయొక్క ఫలము మాయనున్ను, మాయాకార్యములనున్ను నిర్వర్తించు ననిన్ని, ఇటుల పరమార్థజ్ఞాన ఫలమున్ను, అనాసక్త కర్మ యోగ ఫలమున్ను, మోక్షమే ననియు నిర్ణిక్తము (సిద్ధాం తము) మూలముగా శాంతి పొందునట్లు శిష్యునకు చెప్పిన ప్రత్యుత్తరము యిచ్చిన తరువాత చివరకు తన ఉపదేశ మును ఈ క్రింది శ్లోకములలో ముగించెను.

శ్లో॥స్వభావజేన కౌంతేయ నిబద్ధం స్వేనకర్మణా
కర్తుంనేచ్ఛసియన్మోహా త్కరిష్య స్యవశోఽపితత్॥
(భ. గీ. 18-60)

ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి
భ్రామయ న్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥
(భ. గీ. 18-61)

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాంశాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం॥
(భ. గీ. 18-62)

ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా
విమృశ్యైతద శేషేణ యథేచ్ఛసి తథాకురు॥
(భ. గీ. 18-63)

మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాంనమస్కురు
మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోఽసిమే॥
(భ. గీ. 18-64)

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥
(భ. గీ. 18-66)

తా॥ ఇటుల సర్వధర్మములను నాయందు (ఈశ్వరుని యందు) సమర్పించి నీ స్వధర్మ మగు యుద్ధమును కోరిక లేకుండా యథా సంభవమగుటను చేయుము. నాయందే భక్తిని వుంచి యుద్ధమును నా కర్మయే చేయుము. నన్నే స్మరించుచుండుము. దాని ఫలముగా నీవు నాయందే ఐక్య మగుదువు. సర్వ ధర్మములను (వాటిఫలములను) సంన్యసించి నన్నొక్కనినే శరణు జొచ్చుము. నా భక్తియే కలిగి యుం

డుము. నేను నిన్నన్ని పాపములనుంచి విడిపింతును. నీవేమి దుఃఖమును పొందకుము. ఇదియే నిజమైన జ్ఞానబోధ. నీవు నా కత్యంత ప్రియశిష్యుడ వగుటను ఈ రహస్యజ్ఞాన బోధను చేయుచున్నాను. ఇక నీ కిచ్ఛవచ్చినటులను అన్నివిషయములున్ను సాకల్యముగా ఆలోచించి నీకు తోచినటులను చేయుము. అనగా యథేచ్ఛగా యుద్ధము చేయుటో, విరమించుటో స్థిరపరచుకొని అటులనే చేయుము. అనిచెప్పి తిరిగి—

శ్లో॥కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా
కచ్చిదజ్ఞాన సంమోహః ప్రనష్టం తే ధనంజయ॥
(భ. గీ. 18_72)

నేను బహువిధములగు ప్రత్యుత్తరములచేత నీ సందేహము నంతయు నివర్తి చేసితినా? అని శ్రీకృష్ణుడు ప్రశ్నింపగా అర్జునుడు ఈ క్రింది శ్లోకములో ప్రత్యుత్తర మిచ్చెను.

శ్లో॥నష్టోమోహః స్మృతిర్లబ్ధ్వా త్వత్ప్రసాదాన్మయాచ్యుత
స్థితోస్మి గత సందేహః కరిష్యే వచనం తవ॥
[భ. గీ. 18_73]

తా॥ ఆ ప్రత్యుత్తర మేమన నా కన్ని సందేహములున్నూ తీరినవి. మోహము నశించినది. జ్ఞానస్మృతి కలిగినది. మీ ఆజ్ఞ (వచనము) ను శిరసావహించి చేయుచున్నాను. (అనగా యుద్ధము ఫలరహితముగా యధాసంభవము అగునది చేయుచున్నాను.) అనున దగుచున్నది. అందుచేత శ్రీకృష్ణ భగవద్గీతోపదేశము అనాసక్త కర్మయోగమనియ్ని

అర్జునుని మోహాకృత రాగద్వేషములు నశించుటకు కావలసిన అనాసక్త కర్మయోగాఙ్గములను పై నుదహరించినటులను ఉపదేశించెననిన్ని స్పష్ట మగుచున్నది. అటుల భక్తి జ్ఞానాంగము లన్నియున్ను, అర్జునుని సందేహములను తీర్చి స్థితప్రజ్ఞుని చేసి అనాసక్త కర్మయోగిని చేయు ఉపకరణము లేనని తెలుచున్నది. శ్రీ భగవద్గీత ముఖ్యోపదేశము ఇటులను, అనాసక్త కర్మయోగమే ననిన్ని, ఉపదేశము జరిగిన ద్వాపరయుగమునకు పూర్వమే అగతానాగత దర్శి యగు శ్రీ వశిష్ఠులవారు శ్రీరామునకు ముందే ఉపదేశించిరి. అది ఈ క్రింది యోగవాశిష్ట శ్లోకములలోనుదహరింప బడుచున్నది. ఇవి రాబోవు ద్వాపరయుగములో (అనగా ఈ 28 వ మహాయుగములోని ఈ కలియుగమున కవ్యవహిత పూర్వ ద్వాపరయుగములో అర్జునునికి శ్రీకృష్ణోపదేశము అనాసక్త కర్మయోగమును చేయునని తెలియజేయుచున్నవి.

శ్లో॥ యోగస్థః కురుకర్మాణి సంగంత్యక్త్వా ధనంజయ
నిః సఙ్గస్త్వం యథా ప్రాప్త కర్మవా న్న నిబధ్యతే॥
(యో. వా. ముముక్షు. ప్ర॥ 53-10)

శాన్త బ్రహ్మ వపుర్భూత్వా కర్మ బ్రహ్మమయం కురు
బ్రహ్మార్పణసమాచారో బ్రహ్మైవ భవతీక్షణాత్॥
యోగవా. ముముక్షు ప్ర. 53-17

సంన్యస్త సర్వ సంకల్పః సమః శాన్త మనామునిః
సంన్యాసయోగ యుక్తాత్మా కుర్వన్ముక్త మతిర్భవ॥
(53-19)

వికల్పభేదే స్ఫురితే సంవిత్సార మయాత్మని
వైచిత్ర్యేణ విచిత్రేఽపి కిమేకత్వేపినోగ్రహః॥
(53- 29)

ఇతిజ్ఞాత విభాగస్య బుద్ధ్వా తస్య పరీక్షయః
కర్మణాం యః ఫలత్యాగ స్తం సంన్యాసం విదుర్బుధా॥
(53-30)

త్యాగ సంకల్ప జాలానా మసంజ్ఞః సకథ్యతే
సమస్త కలనాజాల స్యైశ్వరైత్యైక భావనా॥ (53-31)
గలితద్వైత నిర్భాన మేతదేవేశ్వరార్పణాత్
అబోధవగతో భేదో నాస్మ్యైవైషాంచిదాత్మని॥
(53-32)

బోధాత్మాకిల శబ్దార్థో జగదేకం నసంశయః
అహ మాశా, జగదహం, స్వమహం, కర్మచాప్యహం॥
(53-33)

కాలోహ మద్వైతం ద్వైతం చాహ మహం జగత్
మన్మనాభవ, మద్భక్తో, మద్యాజీ మాం నమస్కురు॥
(53-34)

అను శ్లోకములు శాన్త బ్రహ్మస్వరూపముగానే కర్మ చేసిన యెడల అట్టి కర్త యకర్తయు, బ్రహ్మయు నగును. శాంతస్వరూపు డగును. కర్మఫల త్యాగమే సంన్యాసమని యెఱుంగుము. ఇది గౌణ సంన్యాస మగునుగాని పరమార్థ సంన్యాసము కాదు అనినిష్మి, కామ్యకర్మ (కోరికతో చేసిన

కర్మ) వదలిన మాత్రమున గౌణ సంన్యాసము కాదనిన్ని, సంకల్ప త్యాగము (ఫలమును వదలుట) అనెడి అసఙ్గ (అనాసక్త) స్థితిచే అర్జునుడు కల్పన లన్నిటిని ఈశ్వరుని (పరమాత్మ) యందే ఏకీభూతము (ఐక్యము) చేసి బ్రహ్మయందు కల్పిత ద్వైత బుద్ధిని (అనగా జీవుడు వేరు, పరమాత్మ వేరు, అను కల్పిత భేదబుద్ధిని) నశింపజేసుకొనుటయే ఈశ్వరార్పణ బుద్ధి యనఁబడును. అనిన్ని, అజ్ఞానము వలననే ఈ భేదబుద్ధి చిదాత్మయందు (చిన్మాత్రాత్మ లేక భారూప పరమాత్మ యందు) కల్పింపబడుచున్నది. అనిన్ని పై 10 శ్లోకముల లో నిఃసఙ్గమున కర్థము అనాసక్తి. 31 శ్లోకములోని సఙ్గమునకు ఆసక్తి అని అర్థము. "బోధాత్మ" యను పదమునకు జగత్తంతయు యేకబ్రహ్మ యనియే. అన్ని సంకల్పముల త్యాగము అసఙ్గము (లేక అసక్తి) అని అర్థము. "అహం" అను శబ్దమునకు అర్థము 1. ఆశ, 2. జగత్తు, 3. నాది, 4. కర్మయు నగును. నేనే కాలస్వరూపుడను లేక అద్వైతము లేక ఒక్కటే. అనగా నే నొక్కడనుగానే బ్రహ్మముగా నున్నాను. రెండుగా బ్రహ్మయు జీవుడుగా నున్నాను. నేను జగత్తుగా అనగా అనేక జీవరాసుల సంపుటిగా, నామరూపాత్మగా, దృశ్యప్రపంచముగా నున్నాను. అనగా పత్ సత్య పదార్థములు నేనే 1. బ్రహ్మగానున్న, 2. జీవుడుగానున్న 3. వ్యాప్యవ్యాపక రూపముగానున్న, 4. జీవసమష్టి నామక మున్న అగు జగత్తుగాను ఉన్నాను. ఎటులననగా వ్యతిరేక ముఖముగా జీవు డను భోక్తకు కారణము అగు కర్తనున్న కర్తకు కారణమగు చిదాత్మనున్న శోధింపగా జడమగు

నహంకార వృత్తిలో చేతనమగు "చిత్" సాక్షిగా ప్రతిలోమ్యముగా ప్రకాశించుచు, అందులో ప్రతిఫలించుచు అహంకార విషయాకారము నొందుచున్నది. ఇటులనే జీవ సమిష్టి రాశియగు జగత్తులో నామరూపములను నిషేధించి [విడిచిపెట్టి] అందులోపల 'అస్తి' 'భాతి' 'ప్రియం' అను మూడు విధములుగా (ఉనికిగా, ప్రకాశకుగా, ఆనంధముగా) వ్యతిరేకముఖముగా శోధింపగా మిగిలియుండి "నేను" అని తెలుగులో ఉచ్చరింపఁబడు "ఆత్మ" లేక శుద్ధ జీవుడుగానున్న, అది అనబడు జగత్తు ప్రకాశముగానున్న, ఆనందము లేక స్వప్రకాశ వస్తువుగానున్న, ఒక్కటే పదార్థము మిగిలి యుండుట గ్రహింపనగును. అదియే అహంలక్ష్యార్థము. అహంకార వృత్తి లక్ష్యమగు సర్వాహంభావ మర్థముగా అగునని ఉపదేశసార మగుచున్నది. ఇట్టిజీవబ్రహ్మైక్యజ్ఞానమే అఙ్గముగా కలుగు అనాసక్త కర్మయోగము శ్రీకృష్ణుని యుపదేశము అగునని తాత్పర్యము.

## విగ్రహ స్థానము

ఆక్షేపములో ఇతరమగు జ్ఞానయోగాదులే భగవద్గీత చోదనా యనియు, అనాసక్త కర్మయోగ సిద్ధాంతము కాదనునదియు, కాగా విగ్రహస్థానమున బ్రతివాది ఆక్షేపములో కలుగు దోషము పై శ్లోకములచేత నిరూపించి శ్రీ భగవద్గీత చోదనా విషయబోధ 1. కర్మజ్ఞాన సముచ్చయ వాదము, 2. జ్ఞానయోగము, 3. భక్తియోగములు ముఖ్య

ముగా కావనెడి సమాధాన పూర్వకముగా ఆక్షేపనిరాస చేయబడుచున్నది.

3. సిద్ధాంతము : పై సమాధానములో శ్రీభగవద్గీత చోదనా అనాసక్త (అసఙ్గ) కర్మయోగమని సప్రామాణిక ముగాను, సయుక్తికముగాను నిరూపింపఁబడినది. ఈ అసఙ్గ కర్మయోగమునకు (అనాసక్తకర్మయోగమునకు) ఇతరయోగ ములు (భక్తి జ్ఞానయోగములు) ఎటుల నఙ్గము లగునో క్రమ ముగా క్రిందవివరింపబడుచు సిద్ధాంతము (ఉపదేశము) అనా సక్త కర్మయే యని చేయబడును.

1. ఇచట అధికారులు గురుశిష్యులు (శ్రీకృష్ణ పర మాత్మ అర్జునుడు)

2. బోధ — అనాసక్తి కర్మయోగము (కర్మ సంకల్ప సన్న్యాసము)

3. అనాసక్త కర్మయోగాఙ్గములు : (1) కర్మ సం న్యాసాత్మక సాధన ప్రధానమగు 'త్వం' పదార్థ ప్రధానము మొదటిఆఱుఅధ్యాయములు (ప్రథమషట్కము) (2) ఉపాస్య నిష్ఠా తత్పదార్థాత్మక సాధన ప్రధానము — రెండవ ( లేక నడిమి) ఆఱుధ్యాయములు (మధ్యమ షట్కము) (3) తత్త్వం పదార్థఐక్య రూపవాక్యార్థనిష్ఠాత్మక సమ్యగ్జ్ఞానప్రధానము—చివరి ఆఱుధ్యాయములు (అంత్య షట్కము)

## 1. ప్రథమ షట్కాంగము – విషయసూచిక

అర్జునుఁడు తన స్వధర్మమగు యథాసంభవ యుద్ధ కర్మకుపూనుకొని ఆ కర్మఫలముగా కలుగు గురుబంధుమరణ రూప దుఃఖమును తలంచి యుద్ధ విరమణ చేయుట ఇచట ప్రధానమగుచున్నది. ఇటుల అజ్ఞానులగు జీవులు పొందు ద్వంద్వపీడనమున్ను, ఆ ద్వంద్వబాధ బోధచేత నెటులనివా రణ మగునదిన్ని, త్వంపదార్థ జీవుడే బ్రహ్మయగుటను జీవ తటస్థ లక్షణమును తెలుపునట్టిన్ని అజ్ఞమగుచు కర్మయోగి అనాసక్త కర్మయోగియైన కర్మసన్యాసి యగునని నిరూ పించుచున్నది.

## 2. ద్వితీయ షట్కాఙ్గము

శ్రీకృష్ణుఁడు పరమాత్మ యగుటచేత అట్టి పరమాత్మ సమష్ట్యాత్మయగు నీశ్వరాత్మ యగుటచేతనున్ను, ఆయనే విరాట్ స్వరూపుఁడగుటనున్ను, తత్పదార్థ మగుటనున్ను తత్పదార్థేశ్వరాత్మను అనాసక్తి లేక అసఙ్గమగు కర్మ యో గముచేత కర్మరూప ఉపాసన చేయుమని దానికి భక్తిజ్ఞానాఙ్గ ము లటు చెప్పబడుచు విశ్వరూపోపాసకుఁడు ఈ కర్మయోగి యగుననిన్ని చెప్పఁబడుచున్నది. తత్పదార్థోపాస్య సాధన ప్రధానమే.

## 3. తృతీయ షట్కాఙ్గము

తత్పదవాచ్యు డీశ్వరాత్మ లేక బ్రహ్మ – త్వంపద వాచ్యుడు జీవుడు లేక ఆత్మ, కర్మఫలమంతయు అసఙ్గముచేత ఈశ్వరార్పణ చేయుట వలన జీవబ్రహ్మైక్యము అగునని

యున్ను, అట్టి భావముచేత నేకర్మముచేసినను అనాసక్తకర్మ లేక గౌణసంన్యాస మగుననిన్ని, పరమార్థ సంన్యాసఫలమగు మోక్షమును అనాసక్త కర్మయోగికి ఈశ్వర ప్రసాదముచేత కలుగుననిన్ని, గౌణసంన్యాసికి మోక్షము మార్జాల కిశోర న్యాయమున భగవత్ప్రసాదముచేత కలుగుననిన్ని చెప్పు చున్నవి.

ఇచట బ్రహ్మ వశిష్ఠమహర్షిని అజ్ఞానములో ముహూర్తమాత్రి ముంచినటులను, శ్రీకృష్ణ పరమాత్మ యుద్ధ రంగములోనున్న అర్జునుని ప్రాకృత జీవుని స్థితిలో నుంచి తదుపరి మధ్యమాధికారిని (సంశయయుతుని) జేసి తనబోధ చేత ఉత్తమాధికారిని చేయుటయేకాక రెండు వ్యూహముల వారికిన్ని, వారిద్వారా ప్రపంచములోని జీవు లందరికిన్ని, ఉత్తమాధికార మార్గమును బోధించెను. ఇటుల నీస్మృతిలో పురుషోత్తము డగు శ్రీకృష్ణ పరమాత్మయే తన యంశమే యగు (బ్రహ్మాంశమే యగు) అర్జునునికి ఎల్లెడలను బ్రహ్మ స్పర్శ చేయుచు, అనాసక్త కర్మయోగ మవలంబించువారి కిన్ని, (గౌణ సంన్యాసికి) పరమార్థ సంన్యాసికి బ్రహ్మజ్ఞాన ముచేత కలుగు ఫలమే ప్రాప్తించుననిన్ని, బ్రహ్మజ్ఞాని కపి కిశోర న్యాయముచేత సంపాదించుకొను మోక్షమును, గౌణ సంన్యాసికి భగవంతు డగు తాను మార్జాల కిశోర న్యాయ మున అన్ని అడ్డంకులను దాటించి మోక్షమును ప్రసాదింతు ననిన్ని అభయము నిచ్చెను. ఇదియే ఈ స్మృతిబోధ విష యము. మహాత్మా గాంధిగారు ఈ స్మృతి అనాసక్త కర్మ

యోగమును నడుపుచున్నదని తెలియజేసిరి. గాని స ప్రమాణకముగా ఋజువు చేయరైరి. ఇటుల పరమాత్మచే బోధింపబడిన స్మృతిచోదిత అనాసక్త కర్మఫలము ఎటుల పరమార్థ సంన్యాస కర్మఫలక మగు మోక్షప్రాప్తి నిచ్చునో, అ దెటులను సుసాధ్యమో, స ప్రమాణికముగా తెలుపుటయే ఈ విమర్శన గ్రంథ ప్రయోజనము. మరియు భక్తి జ్ఞానయోగములు ప్రధానాంశములు గావనియు, అనాసక్త కర్మకి ఇవి అంగములు అగుచున్న వనియు, ఈ గ్రంథము స ప్రమాణికముగా ఋజువు చేయుచున్న దను విశేషము గమనీయము.

(ఇటుల నజ్జప్రధాన మొదటి భాగము విశేష వివరణ క్రింద చూడ నగును.)



# శ్రీ భగవద్గీత చోదనా

## విషయ సిద్ధాంతము

అనాసక్త కర్మయోగ మను మొదటి భాగము

కర్మ సంన్యాసాత్మక సాధన ప్రధాన "త్వం" పదార్థ ప్రధానాఙ్గము.

ఆది షడాధ్యాయి — మొదటి ఆఱు అధ్యాయములు.

మొదటి అధ్యాయము - అర్జున విషాదయోగాఙ్గము.

—o—

జీవుడు స్వభావముచేత రాగద్వేష కార్యములగు సుఖ దుఃఖములచేత కొట్టబడి సంసారిగా వ్యవహర్త యగుచు సుఖదుఃఖములను మాపుకొనుటకు అశక్తుడై వాటివలన కలుగు మోహవశుడై విలపించుచుండును. జీవుడు బ్రహ్మ (లేక) ఆత్మయే, అసఙ్గుడే అని తెలుసుకొనునంత వరకు ఈ సంసారము నశింపదు. కురుపాండవుల యుద్ధ వ్యూహముల రెంటి మధ్య రథమును నిలపి సారధి యగు శ్రీకృష్ణుడు అర్జునునియొక్క మానవత్వమును లేక అజ్ఞానావస్థను ఇటులను ప్రదర్శింపజేసెను.

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణా యుయుత్సుం సముపస్థితం
సీదన్తి మమ గాత్రాణి ముఖంచ పరిశుష్యతి॥ భ.గీ.1-28

అని మొదలుకొని శ్లో॥ తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణం । విషీదంత మిదంవాక్య మువాచ మధుసూదనః॥ (భ.గీ. 2అ.1)వరకు దుఃఖము ప్రదర్శించెను. ఇదియే అజ్ఞానిగాయుండి జీవుడు తాను బ్రహ్మమనునది మరచి సంసార కారణ మగు "నేను" "నాది"("అహం" "మమ") శబ్దరూపమగు మాయాకార్యములగు రాగద్వేషములచేనగు మోహితుడగు బద్ధజీవుడుగా అర్జునుని నిమిత్తీకృతునిచేసి ప్రదర్శించెను. ఈ రాబోవు ప్రదర్శనమును గడచిన ద్వాపరా వ్యవహితపూర్వ త్రేతాయుగములో శ్రీ వశిష్ఠమహర్షి చేత యోగవాసిష్టములో శ్రీరామునికి చెప్పఁబడెను. దీనికి కారణము వశిష్ఠ మహర్షి జ్ఞానయోగ శక్తియే. దీనినే దివ్యదృష్టి యందురు.ముముక్షు ప్రకరణములోని 52 వసర్గ చూడఁనగును. అప్పటికే అనగా ఈ 28వ మహాయుగములో త్రేతాయుగమునకు పూర్వమే 6 కృష్ణావతార ఘట్టములు గడచినవి. ఆ బోధ విషయధారణ ఫల విశదీకరణపు పలుకులే నని తెలియనగును. ఇట్టి శాస్త్రానుభవమే లేదన్నవది సింహము ఏనుగును చంపలేదనుటయే అగును. ఆ శ్లోకము లీ క్రింద నుదహరింపబడి ననువదింపఁ బడుచున్నవి.

యో. వా. ముముక్షుప్ర. సర్గ 52.

శ్లో॥ విష్ణో రర్జున నామాసౌ ప్రాకృతం భావమాస్థితః
హర్షామర్షాన్వితో దేహో నరధర్మా భవిష్యతి॥ 33

శ్లో॥ సేనాద్వయ గతాన్దృష్ట్వా స్వజనాన్మరణోన్ముఖాన్।
విషాదమేష్యత్యద్యోగం యుద్ధాయ నకరిష్యతి॥ 38

తా॥ అనేకముగా ప్రాతిలోమ్యముగా ప్రకాశించు విష్ణునామక రూపుడగు కృష్ణుడే ప్రాకృతదేహిగా నరుడను అర్జునుడుగా కూడ నుండి రెండు వ్యూహములలోనున్న తన స్వమనుజులే మరణమునొందుటకు సిద్ధపడినవారిని కనిపెట్టి యుద్ధయోగమును మానెను. అని అర్థము. ఇదియే శ్రీ కృష్ణుడు కనిపెట్టినటులనున్ను, అర్జునుని మందలించెననిన్ని, ఈ క్రింది భగవద్గీత శ్లోకములు చెప్పుచున్నవి.

ద్వితీయాధ్యాయము సాంఖ్యయోగాఖ్యము.

శ్లో॥ కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున!
భ. గీ. 2-2 మొదలుకొని,

శ్లో॥ ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః! పరంతప!
నయోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవహ॥
భ. గీ. 2-9.

శ్లో॥ తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత।
సేనయో రుభయోర్మధ్యే విషీదన్త మిదంవచః॥
భ. గీ. 2-10

అను శ్లోకములతో శ్రీ కృష్ణాంశములోనున్న విష్ణువే ముందు ఆ విషాదమును పోగొట్టుటకై ఉపదేశము చేసెను.

ఏమనగా అర్జునా నీవు ఏడువకూడనట్టి విషయమును గురించి ఏడ్చుచున్నావని,

శ్లో॥ అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః॥
భ. గీ. ౨-౧౧

అను శ్లోకముతో ప్రారంభించెను: జ్ఞానులు గత అసూన్=ఆయువుతీఱినందున అట్టివారి చావునుగూర్చి ఏడువరు. అగతాసూన్=ఇంకను చావక జీవించియున్న వాఱిని గూర్చియున్ను ఏడువరు. నీవు జ్ఞానివలె మాట్లాడుచున్నావుగాని అజ్ఞానములో మునిగియున్నావు. ఆత్మ (స్వప్రకాశజ్ఞానస్వరూపము) దేనిని అంటక అంతటికి సాక్షిగానే పంచభూతములతోను, ఇంద్రియములతోను కూడి లోపల ప్రకాశించుచున్నది. కర్మలన్నియు దేహము మొదలగుసంఘాతముయొక్క కార్యములే. అందుచేత నాత్మవగు నీవు చంపఁబడువాఁడవు కావు. చంపువాఁడవుకావు. చంపు క్రియయు కావు. నీకు (ఆత్మకు) చావు పుట్టుకలే లేవు.

నీవున్ను నేనున్ను అంతే. దేహాది సంఘాతమే ఆత్మయని నీవు భ్రమపడుచున్నావు. అందుచేతనే చావుపుట్టుకలే రూపముగాగల సంసారములో చిక్కుకున్నావు. నీవు దేహేంద్రియములలో సాక్షిగా నున్నావనిన్ని అక్కడ (ఆత్మలో) దేహేంద్రియములగు జడవస్తువులు లేవనిన్ని, కనుగొనిజ్ఞానివగుము. ఆత్మ చేతనము (నిత్యసత్యవస్తువు) అనిన్ని దేహేం

ద్రియములు జడములు లేక నశ్వరము లనియు యథార్థమును కనిపెట్టుము. ఇటులనే జ్ఞానులు భావింతురు. నీవున్ను ఇటులనే భావించి నీవుచేయు కర్మఫల మంతయు నా యందు (బ్రహ్మయందు) అర్పించి నీవు బ్రహ్మమేనని బ్రహ్మ భావమలవరచుకొన్న, కర్మలయొక్క ఫలమగు పుణ్య పాపములు నిన్నంటక, అట్టి కర్మఫలము నీకు జ్ఞానప్రసాదమిచ్చును.

అజ్ఞానులనుకొను జాగ్రదాదిమూడుఅవస్థలను జ్ఞానులు అజ్ఞానావస్థయే యనిన్ని, అట్టిదికాని దేదో అది జ్ఞానావస్థయే యనిన్ని భావించుచుందురు. దృష్టాంతముగా ప్రచండమైన సూర్యుని యెండవేడిమిప్రకాశములో గుడ్లగూబ కళ్ళుమూసుకొని చీకటిని అనుభవించుచున్నది. ఇచట ఉపమేయములో అజ్ఞానము చీకటినిన్ని, జ్ఞానము వెల్తురు వేడిమినిన్ని, గుడ్లగూబ అజ్ఞానినిన్ని, ఎండవేడిమిని అనుభవించు మనుజుడు జ్ఞానినిన్ని పోలియున్నారు. ఈజ్ఞాని ఉత్తమాధికారియే. మధ్యమాధికారిఅగునీవు కాకిదృష్టిన్యాయమున బాగుగావారి మనోవృత్తిని ఏకాగ్ర్యము చేసి అన్ని కోరికలనువదిలి, మమత్వము (నాది అనుస్వభావము) అహంకారము (నేను కర్తను భోక్తను, విద్యాధికుడను) అను స్వార్థభావమును విడిచి విమర్శన పూర్వకముగా (తర్కమూలకముగా) నీవేబ్రహ్మ వెటులనగుదువో విచారణలో నిమగ్నుడ వైనయెడల ఆ సమకాలములో నీ కాకలి దప్పులు లేకపోగా విశ్వరూపుడవే నీవగుచు నభయుడవుగానే తిరుగుచుందువు. లేక మౌనభావమునొంది యుందువు.

ఇచట మౌనమనగా నిరంతర బ్రహ్మభావన. దీనినే ద్వైతైక్య పదనిర్ముక్తి ( అనగా రెంటిగా నుండు స్థితి ఒక్కటిగానే యుండు స్థితియున్న ) వదలకుండా యుండు అద్వైతభా స్థితి (పదము) అనగా విశ్వముఅగు నామరూపము లలో నంతటను వ్యాప్యవ్యాపకముగా ఒకే పరమాత్మ (ఆత్మ లేక బ్రహ్మ) అన్నిభూతములలోను అంతరాత్మగా ననుస్యూ తముగా నుండుట. ఇట్టి భావమును అలవర్చుకొను స్థితియే బ్రాహ్మీస్థితియనియు ఆ స్థితి యలవడిన తర్వాత తిరిగి ఆ స్థితినుండి చలనము లేదనియు అదియే బ్రాహ్మీస్థితి లేక మోక్షమని ఈ క్రింది శ్లోకముతో ముగింపబడినది.

శ్లో॥ ఏషాబ్రాహ్మీస్థితిః పార్థ నైనాంప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యామన్తకాలేపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥
భ. గీ. 2-72

ఈ అధ్యాయములోని విశేషమేమన (1) యథాసంభవ యుద్ధకర్మను ఫలమును శ్రీకృష్ణపరమాత్మయందర్పించి చేసిన స్థితప్రజ్ఞుని లక్షణములు (జ్ఞానిలక్షణములు) అలవడును. ఇట్టి లాక్షణికావస్థయే బ్రాహ్మీయస్థితి. ఆత్మవస్తువు చావు పుట్టుకలు లేని నిత్యసత్యవస్తువు. జీవుడు శాశ్వతవస్తువు. పాతబట్ట చిరిగిపోయిన క్రొత్త బట్టను మనుజుడు ధరించు నటులనే జీవుడు పాతశరీరము నశించిన క్రొత్త శరీరమును ధరించు నని 2 అ 12, 17, 20, 21, 22 శ్లోకములలో చెప్పబడియున్నది. "అన్తకాలేపి" అను పదమునకు సాధా

రణముగానందఱు, ఇట్టి బ్రిహ్మస్థితి మరణకాలసమయమందు కలిగినను మోక్ష మగునని చెప్పుదురు. పంచదశిలో—

శ్లో॥సదద్వైతేఽ నృతద్వైతే యదన్యోన్యైక్య వీక్షణమ్
తస్యాన్త కాలస్త ద్భేద బుద్ధి రే వనచేతరః॥
(పంచదశి 2–140)

అర్థము— సత్యమగు అద్వైతమున్నూ, అసత్యమగు ద్వైతమున్నూ, అనగా సత్, అసత్ రూపముల చేతనగు భేదబుద్ధియొక్క అంతకాలము అని గ్రాహ్యము. ఈ పరమాత్మ ద్వైతముగానున్న, అనగా రెండు వస్తువులలో నున్న, అద్వైతముగా నున్న, అనుస్యూతముగా ఒకే స్వప్రకాశ జ్ఞాన స్వరూప వస్తువుగా అన్నిటిలోనున్న "భా" భాస్యముగా నున్నదనియు, అది తలచగా ఏకభాసక వస్తువే అనియు, అది అద్వైతభా అందుచేత నగుననిన్నీ, అదియే ద్వైతైక్య పద నిర్ముక్తి యని యోగవాశిష్టము నుడువుచున్నది. "ఏకం సత్ విప్రా బహుధాభవంతి" అను ఋగ్వేద ఋక్కున్ను చెప్పుచున్నది. యిచట సత్య, అనృత రూపములుగా అనుస్యూతముగా ఒకే వస్తు వున్నదను జ్ఞాన కాలమే భేదబుద్ధియొక్క అంతకాలమను విశేషార్థము గమనార్హము. విశేష వివరణ అద్వైతభా గ్రంథములో చూడనగును. సాధారణార్థము అగు అంత్యకాలముననున్న, [మరణకాలము నొందున్న) ఈ ద్వైతైక్య పదనిర్ముక్తి లేక అద్వైతభా జ్ఞాన సిద్ధి అనగా ద్వైతముగానే బ్రహ్మ యున్నది. లేక అద్వైత

ముగానే బ్రహ్మయున్నది. అను భ్రమ జ్ఞానాంతకాలము— అదియే ఒకే బ్రహ్మ అనుస్యూతముగా ద్వైత ప్రపంచ ములో మూర్తముగా సగుణబ్రహ్మగానున్న సృష్టి పూర్వా పరములలో నిర్గుణ బ్రహ్మగా నున్న, మిగిలియుండు వస్తు స్థితిజ్ఞానము, ప్రాకృత(భేద) జ్ఞాన అంతకాలము అగుచున్నది. అందుచేత అద్వైతభాగానే ఒకే బ్రహ్మ యున్నదని — ''భారూపః'' (ఛాం. 3-14-2)అను ప్రమాణమున్న చెప్పుచు న్నది. ఆత్మవస్తువు యోగవాశిష్ఠములోని ముముక్షు ప్రకరణ ములో ఇట్లు వర్ణింపబడినది.

శ్లో॥నజాయతే మ్రియతేవా కదాచి న్నాయంభూత్వా
భవితావా నభూయః॥ స 52-35

వర్ణ్యతేఽహం కృతేస్త్యాగః సజ్గత్యాగాది లక్షణమ్
ఉపాస్యజ్ఞేయ రూపేచ దశాభేద వ్యవస్థితే॥ 53-1

అర్జున త్వం న హంతా త్వ మభిమాన మలం త్యజ
జరామరణ నిర్ముక్త స్త్వయ మాత్మాసి శాశ్వతమ్ 2

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య నలిప్యతే
హత్వాఽపిసర్గ మాంల్లోకా నహంసి న నిబధ్యతే॥

నైవ సంజాయతే సంవి దస్త్యైవానుభూయతే
అయం సోహ మిదం తన్మ ఇత్యన్త సంవిదంత్యజ॥ 3

అనవైవచ యుక్తోస్మి నష్టోస్మీతిచ భారత
అభిత సుఖ దుఃఖాభ్యామవశః పరితవ్యచ॥ 4

స్వాత్మాంశైః క్రియమాణాని గుణైః కర్మాణి భాగశః
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి ఉచ్యతే॥ 5

చక్షుః పశ్యతు కర్ణశ్చ శ్రుణోతు త్వక్స్పృత్విశదమ్
రసనా చ రసం యాత్తు కాఽత్రకోఽహమితిస్థితిః॥ 6

కలనాకర్మణి రతే మనస్య స మహాత్మనః
నకశ్చిదత్రాహమితి క్షేత్ర భాగ క ఏపతే॥ 7

బహుభిః సషుఘాయేన యత్కృతేన తత్రిచారీత
యేనోభిమాన దుఃఖేన హోసామైనసగృహ్యతే॥

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలైరింద్రియైరపి
యోగినఃకర్మ కుర్వంతి సఙ్గంత్యక్త్వాఽఽత్మ శుద్ధయే॥ 9

అహన్ని్వ పయచూర్ణేన యేషాంకాయో నమారితః
కుర్వన్తోఽపి హరన్తోఽపి సచ తేనిర్విషూచికాః॥ 10

నక్వచి ద్రాజితే కాయో మమతామేధ్య దూషితః
ప్రాజ్ఞోద్యతిచ హ్యజ్ఞోపి దుఃశీల యివమానవః॥ 11
(యో వా. ముముక్షు ప్ర. 53–8)

ఈ పై శ్లోకములందు క్లుప్తముగా త్యాగాది లక్షణము ఉపాస్యమగు ఆత్మరూపమందు ఆయా దశాంతర స్థితియే. అర్జునా నేను చంపుచున్నా ననెడి బుద్ధి యభిమాన జాడ్యము వదులుకొనుము. జనన మరణములు లేని శాశ్వతముగానుండు ఆత్మవే నీవు. ఎవనిని నేను చంపినాననెడి బుద్ధి వశము చేసుకొనలేదో అట్టివాడు యావత్తు సృష్టిని, నాశ

ఆ

మును (ప్రేరేపించుమను) చేసినను అట్టి క్రియకారి కాడు. కార్యమువలన బద్ధుడున్నూ కాడు. ఏ భావము (వృత్తిఫలము) చేత ఉండునో ఆవృత్తి ఆకారముగానే పుట్టుచున్నాడు. "ఇది", "అది", "నేను", "ఇది అది కాదు" అను నంతవఱకుండు వృత్తులను వదలుకొనుము. అటుల వృత్తులతో కూడిన (మనోవృత్తి, ఆవృత్తి, ఆకారమును పొందిన) సుఖ దుఃఖములకు వశ్యుడవై నేను నశించితిని అని అనుకొన్న ఎడల అట్టి సుఖ దుఃఖియే నీవు అస్వతంత్రుడవైతే అగుదువు. తనయొక్క అంశ (శక్తి) చేతనే సత్త్వరజ స్తమోగుణముల చేత వేఱుగా కర్మలుచేయుబడును. అవి నేను చేయుచున్నా ననుకొనెడు మూఢుడగు జీవుడు నేను కర్తను అని తలంచు చుండును. కండ్లు చూచుచుండగా, చెవులు వినుచుండగా, నీ వృత్తులే విశద మగుచున్నవి. అక్కడ అహంకార వృత్తి యేది? అనగా అదేమియు లేనిస్థితియే.

కల్పితభావముతోటి కర్మలయందు రమించినను(నిమగ్నుడైనను) అప్పుడు మనస్సే ఆ అనురక్తి నొందుటచేత ఆత్మ మహాత్ముడు అక్కడ నేను అను అహంకార మగు క్షేత్ర భాగము (నశించు వస్తుభావము) కాడు. అనేకములగు సమవాయముల (కూడికల) చేత చేయుబడిన కర్మలచేత అచరించు నతడు అనగా వాటి అభిమాని లేక వాటియొక్క ఒకే ఫలమగు దుఃఖముచేత నశించినవాడు అని చెప్పబడుచున్నాడు. ఐతే మనశ్శుద్ధికై [జ్ఞాన] యోగులు కర్మ ఫలమందు ఆసక్తి లేకనే మనోవాక్కాయములద్వారా కేవ

లము ఇంద్రియములచేత కర్మలను చేయుచుందురు. అహం కార మగు విషయ చూర్ణము (విషయాకారము నొందుట చేత) అట్టిపూతచేత యెవని శరీరము (మూడు విధములగు అనగా స్థూల, సూక్ష్మ కారణ శరీరముల, లేక జాగ్రత్స్వప్న సుషుప్తి రూప శరీరముల) యొక్క వశ్యముకాదో [చంపబడదో] అట్టివాడు కర్మలు చేసినను, చంపినను, అట్టి పాపము చేయనివాడే, అనగా అకర్మియే- అని ఫలితార్థము. ఇదియే భ. గీ. రెండవ అధ్యాయములోనున్న చెప్పబడినది.

---

## తృతీయ 3 వ అధ్యాయము - కర్మసంన్యాస యోగాజ్ఞము

అంతట అర్జునుడు శ్రీకృష్ణా కర్మకంటే జ్ఞానమే గొప్పదనుచున్నారే! నాకు కర్మయందే అధికార మనుచున్నారే! ఇందులో ఏది గొప్పదో శలవిచ్చి అట్టిదానినే నేనవలంబింప ఆజ్ఞ యిండని కోరగా, నీకు అకర్మయే ఆచరణ యోగ్యమున్ను, మోక్షకారియున్ను అగునని చెప్పి కర్మఫలమును ఈశ్వరార్పణము చేసిన యెడల ఈశ్వరు డగుటయే దాని ఫల మగును. 2. కర్మఫలము, కర్త, భోక్త, కర్మయజ్ఞ పరికరములు, కర్మయజ్ఞ ద్రవ్యము నంతయు బ్రహ్మమేయని తలంచుచు, కర్మచేసిన బ్రహ్మకర్మ సమాధిచే నిన్ను ఈశ్వరానన్యుని [అనగా బ్రహ్మనుగా] చేయును. అట్టి కర్మ బ్రహ్మయే యని తెలుసుకొనుము. నాకు [శ్రీకృష్ణునకు] ఏ కోరికలు లేకున్నను నేను కర్మ చేయకుండా నుండుటకు వీలు లేదు. ఈ కర్మ బ్రహ్మవలననే కలిగినది. ఈ బ్రహ్మ

సదా కర్మయజ్ఞమందే లెస్సగానున్నాడు. అందుచేత చంప బడుటకు, చంపుటకు నీవు కర్తవు గావు. అని భావించి అకర్మ యగు అనాసక్తకర్మను చేయుము. దాని కుపాయము ఇంద్రియములను విషయముల వైపుకు పరుగెత్తనీయకుండ నియమము చేయుము. అందుమూలముగా పాపమును నశింప జేయగలవు. ఎందుచేత ననగా? ఇంద్రియములకు మనస్సు, మనస్సునకు బుద్ధి, అధిష్ఠానము. అనగా మొదటిదానికంటే రెండవది శ్రేష్ఠమని మఖ్యార్థ అర్థము. అందుచేత వాటిచేత కలుగు మోహముచేత అవి జ్ఞానమునావరించుటచేత మోహ మెక్కు వగుచున్నది. ఈ బుద్ధిని సత్వగుణ మగునటులను సంస్కారముచేసిన యెడల కోటికలు నశించును. బ్రహ్మయం దీ సంస్కృత బుద్ధిని నిలిపిన బ్రహ్మయే ఈ సత్త్వబుద్ధి అగు చున్నదని కఠోపనిషత్తు చెప్పుచున్నది. అటుల సంస్కారము చేయని యెడల బుద్ధియొక్క శత్రువగు కామము(కోటిక)బుద్ధిని వశపరచుకొని, నీవు బ్రహ్మఅను స్మృతిని నశింపజేయునని—

శ్లో॥ జ్యాయసీచేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన
తత్కిం కర్మణి ఘోరేమాం నియోజయసి కేశవ!

మొదలుకొని, భ. గీ. 3–18

శ్లో॥ నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహకశ్చన
నచాస్య సర్వభూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః॥ 3_18
తస్మాదసక్త సతతం కార్యం కర్మ సమాచర
అసక్తో హ్యాచరన్కర్మ పర మాప్నోతి పూరుషః 3_19
అనునంత వరకున్న,

మరిన్ని— శ్లో॥ కర్మణ్యేవహి సంసిద్ధి మాస్థితాజనకాదయః
లోకసంగ్రహ మేవాపి సంపస్యత్కర్తుమర్హసి॥ 3-20

ఏవంబుద్ధేః పరంబుద్ధ్వా సంస్థభ్యాఽత్మానమాత్మనా।
జహిశత్రుం మహాబాహో కామరూపం దురాసదం॥ 3-43

వరకు శ్లోకములలో సంన్యాసయోగాంగమును ముగించెను.

ఈవిషయమే యోగవా ముముక్షు ప్రలో. సర్గ 53-1-18, 19, 29-32 శ్లోకములలో శాంతస్వరూపముగానే కర్మచేసిన కర్మ, కర్త బ్రహ్మయే (శాంతమే) అగుననియు ఈస్థితి (ఆసక్తి) లేమిన్ని అనగా అనాసక్తి, త్యాగము, బ్రహ్మార్పణము, లేక ఈశ్వరార్పణము, లేక ఫల సంన్యాసము లేక సంకల్పసంన్యాసము; జ్ఞానము, యోగముల విభాగమున్నకర్మఫలత్యాగమే.ఇదియే సంన్యాసము. అటుల నిది గుణములు గుణములందు వర్తించుచున్నవను గౌణ సంన్యాసముగాని పరమార్థ సంన్యాసము కాదు. కామ్యకర్మ వదలిన మాత్రముననే సంన్యాసము కాదు. సంకల్ప త్యాగమన అసఙ్గస్థితి (అనాసక్తస్థితి). అర్జునుడు కల్పనలన్నిటిని ఈశ్వరుని యందు ఏకీభూతమొనర్చి ద్వైతబుద్ధి నశింపజేయుటయే ఈశ్వరార్పణ బుద్ధియగును. అజ్ఞానమువలననే ఈ భేదములన్నియు చిదాత్మయందు కల్పింపబడుచున్నవని చెప్పబడినవి. ఇటులను సంన్యాసయోగము ముగించెను.

---

# నాల్గవ అధ్యాయము

## చతుర్థ జ్ఞానకర్మ సంన్యాస యోగాజ్ఞము

ఈ కర్మయోగము రాజయోగమే. ఇక్ష్వాకునిచేత చేయబడినది. ఈ యోగము సృష్టిమొదటిలోనే సూర్యుని ఉపదేశించితిని. యోగముచేతనే రాజులు రాజ్యరక్షణమునుచేసిరి. బ్రహ్మ సృష్టినిచేసెను. చాలాకాలము గతించినందున, అది మఱుపుగలిగినందున ప్రియశిష్యుడవగు నీకు తిఱిగి చెప్పుచున్నాను. ఇది సనాతన యోగమేనని చెప్పగా నంనుమీద ఇప్పుడు వాసుదేవుడుగ జన్మకలిగిన మీకు పూర్వమింకొక ఆదిత్యుని జన్మకలిగియున్నదని చెప్పుచున్నారదేటుల మీరు తెలుసుకొన్నారు? అను అర్జునునిప్రశ్నకు శ్రీకృష్ణుడు, అర్జుననకున్ను పూర్వమనేకజన్మలున్నవి. ముందుకూడ కలుగగలవు. అని చెప్పి తాను (శ్రీకృష్ణుడు) పుట్టుకలేనివాడేయయ్యును,ప్రకృతిని (మాయను) వశ్యముచేసుకొనిఅవ్యయుడగు తాను మాయచేత పుట్టుచున్నాడననియు, ఎప్పుడెప్పుడు ధర్మహానికలుగునో అప్పుడాయాయుగములందు తానవతారము నెత్తి ధర్మసంస్థాపన చేయుచుందురనియు, దుష్టసంహారమునున్ను, శిష్టరక్షణమునున్ను చేయుచుందుననియు, ఇట్లు తన జన్మకర్మలు సాధు ధర్మరక్షణకేనని, అవి ఈశ్వరశక్తి కార్యమగునని ఎవరు తెలుసుకొందురో వారు జన్మరాహిత్యము అను మోక్షము నొందుదురనియున్ను, ఎవరెవరు తన్ను ఏయే విధములుగ ఏయే ఫలముగోరి భజించు

చుందురో వారివారి కాయా విధమగు ఫలములను తానిచ్చు చుందుననియున్ను, ఆయా ఫలానుభవము తీఱిన తత్పాత తత్క్షణమే మనుష్యలోకములోని జన్మనిచ్చుచుందు నని యున్ను, ఇటుల వాని కర్మానుసారముగా వర్ణాశ్రమములలో నుండువారినిగా చేయుచున్నాననియున్ను, కర్మాధికారులు మనుజులేననియున్ను, కర్మలు తనను (శ్రీకృష్ణుని) బద్ధుని చేయఁ లేవనియున్ను, అవి తనను ముట్టనే ముట్టవనియుఁన్ను, ఈ రహస్యము తెలిసినవారు పూర్వులు (మోక్షగాములు) చేసినటులనే అనాసక్తకర్మ చేయుదురుగనుక దానినే అర్జు నుని చేయమనిన్ని ప్రత్యుత్తరము చెప్పిరి. మఱియు కర్మ యందకర్మయున్ను (అనాసక్తకర్మయున్ను), అకర్మయందు కర్మయున్ను (కర్మచేయకుండా ఊరకనేయుండు స్థితియందు కర్మత్వమున్ను) చూచువాడే (తెలుసుకొనువాడే) మనుజు లలో కృతకృత్యుడు. (చేయుతగినది చేసినవాడు) బుద్ధిమం తుడు. (జ్ఞాని) అగును. ప్రతిషిద్ధ కర్మయే వికర్మ అనబడును. కామసంకల్పత్యాగముచేసినకర్మజ్ఞానాగ్నిచేదగ్ధమగునని పణ్డి తులు చెప్పుదురు. కర్మఫలసఙ్గము (రక్తి) వదిలి కర్మచేయు చున్నను ఆకర్మ అకర్మయే. విషయాసక్తిలేకుండా అన్ని విధ ములైన ప్రతిగ్రహములు వదిలివేసి శరీరమే కేవలము కర్మ చేయుచున్నదని తలంచునట్టి శరీరి (దేహి లేక జీవుడు) ఎట్టి పాపియుఁ గాడు. (అనగా పుణ్య పాప రహితుడే). అట్టివాడు యథాసంభవము ననుభవించుచు సుఖ దుఃఖములు, రాగ ద్వేషములు, శీతోష్ణములు అను ద్వంద్వములు ప్రాప్తించిన వాటిన్ని సహించి సమభావ మలవర్చుకొనును. ఫలాఫల వర్జితు

డగుటచే కర్మచేయుచున్నను కర్మచేయనివాడే. అనాసక్త కర్మను బ్రహ్మజ్ఞానము కలిగి యజ్ఞకర్మగా జేసిన అట్టి కర్మ లన్నియు నశించును. అందుచేత1అర్పణఁ 2హవిస్ 3అగ్ని బ్రహ్మయనియు, 4 హుతము బ్రహ్మచేతనే చేయబడుచు బ్రహ్మయందు లయమగుచున్నదనియున్ను చేయుకర్మ బ్రహ్మకర్మ బ్రహ్మసమాధిచేత చేయబడిన దనియు చెప్ప బడును. అనగాఅర్పణాదిబుద్ధిముత్యపుచిప్పయందలి తెలుపు వెండియదగునను కల్పితబుద్ధివలెనే ఇచట బ్రహ్మబుద్ధియు నగుచున్నది. అనగాలోకములో కొందఱు అర్పణాదిబుద్ధి బ్రహ్మయే యని తలంచుచుందురు. ఇట్టియజ్ఞమును కొందఱు దేవపరమనియు, మఱికొందఱు బ్రహ్మపరమనియునందురు. మఱికొందఱు బ్రహ్మయజ్ఞమందురు. ఇటులనే ఇతరులు ప్రాణాయామయజ్ఞమును చేయుచుందురు. మఱికొందఱు ద్రవ్యయజ్ఞమును చేయుచుందురు. ఇటులను యజ్ఞముచేసి యజ్ఞశిష్టమగు భోజనముచేయువారు బ్రహ్మలోకప్రాప్తి నొందుదురు. కుక్షింభరుడు (తనకుటుంబమును మాత్రము పోషించువాడు) ఐతేనో వానికి మానవలోక జన్మగాని, స్వర్గలోకప్రాప్తిగాని లేదు. దీనికి కారణ మట్టివాని యజ్ఞవిరమణయే. ఇటుల యజ్ఞము లనేకములున్నవి. ద్రవ్యయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠము. సర్వకర్మలును జ్ఞానమును కలుగచేసి నశించును. ఇటుల నీవతిపాపివైనను జ్ఞానముచేత అన్నిపాపములు నశించును. కట్టెలచేత అగ్నిని మథించిన, ఆ అగ్ని కట్టెలను భస్మముచేయునటులనే, జ్ఞానాగ్ని కర్మములను భస్మముచేయును. జ్ఞానమంటిది వేరొకటి లేదు,

అది శ్రద్ధచేతనే లభించును. శ్రద్ధయనగా ఇచ్చట అంతటను బ్రహ్మనేచూచి అనుభవించుట. జ్ఞానఫలము అగు శాంతి తత్క్షణమే కలుగును,కనుక శ్రద్ధకలిగియుండుము. సంశయాత్మ నశించును. ఇటుల సంన్యస్తకర్మునిన్ని, జ్ఞానముచేత (జగజ్జీవేశ్వర బ్రహ్మైక్యభావ రూపజ్ఞానముచేత) సర్వసంశయములను నశింపచేసి ఆత్మదర్శియగు నప్రమత్తునిన్ని కర్మలు బంధింపవు. అందుచేత నీవు అజ్ఞానకార్యములగు సర్వసంశయములను జ్ఞానాగ్నిచేత నశింపచేసి యోగనిష్ఠుడవగుము. అని,

శ్లో॥ ఇదంవివస్వతేయోగం ప్రోక్తవానహమవ్యయమ్
వివస్వాన్మనవేప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥
భ. గీ. 4-1

తస్మా దజ్ఞాన సంభూతం హృత్ స్థం జ్ఞానాసినాఽఽత్మనః।
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత॥4-42

వరకు జ్ఞానకర్మ సన్యాసయోగాంగోపదేశమును చేసి ముగించెను.

## అయిదవ అధ్యాయం.

## పంచమ సన్యాస యోగాజ్ఞము

కర్మలో సన్యాసమున్ను తిరిగి యోగమున్ను మీరు గొప్పగా శ్లాఘించిరి. ఇందులో ఏది మోక్షదాయకమో చెప్పమనెడి అర్జునుని ప్రశ్నకు ప్రత్యుత్తరముగా ఈ రెండున్ను మోక్షదాయకములే ఐనను, కర్మసన్యాసముకంటె కర్మయోగమే ( అనాసక్తి కర్మయోగమే ) శ్రేష్టము. కర్మయోగి లేక నిత్యసంన్యాసి ( మోక్షసంన్యాసి ) ద్వేషిగాని

రాగిగాని కాడు. సుఖదుఃఖములందున్నూ, వాటి సాధనలందున్నూ అట్టి నిత్యసన్న్యాసి చరించుచున్నను అతడు నిత్యసంన్యాసి అని ఎఱుగుము. సాంఖ్యమునకున్నూ పై కర్మయోగమునకున్నూ అజ్ఞానులు పరస్పర విరుద్ధఫలమును చెప్పుదురు. ఐతే జ్ఞానులు సమఫలమునే చెప్పుదురు. ఎవరైతే ఈరెంటివల్ల ఒకేబ్రిహ్మత్వము వచ్చునని గమనించెదరో వారే జ్ఞానులు. సంన్యాసము దుఃఖఫలకమే యగుటను అది జ్ఞానయోగికి కలుగును. యోగయుక్తుడగు ముని (మనన శీలుడు) శీఘ్రమే తరించును. యోగయుక్తుడును శుద్ధాత్మనుజుడున్నూ, ఇంద్రియజయుడున్నూ అగును. ఎవ్వడైతే సర్వభూతములందు ఒకేపత్యక్‌ను భూతాత్మగా లెస్సగా జ్ఞానముచేత తెలుసుకొనునో (అనగా జ్ఞానైకరసమగు ఆత్మభూతమునే బ్రిహ్మమొదలుకొని గడ్డిపోచవరకు నుండు ఉపాధులలో చూచుచు ఆనంద స్వరూపానుభవము నొందుచుండునో) అట్టివాడు కర్మచేసినను అట్టి కర్మచేత బద్ధుడుగాడు. అతడు కొంచెముకూడ కర్మచేయలేదని సమబుద్ధితో యోగిగా కూర్చుండుటచేత తత్త్వజ్ఞాని అనబడుచున్నాడు. అట్టివాడు చూపు మొదలగు అన్నిక్రియలు చేయుచున్నను, ఇంద్రియములు విషయములందు చరించుచున్నవను బుద్ధితో ధారణాలో అనగా ఏకాగ్రిగా భగవద్ధ్యానములో నున్నవాడు ఎండమావులలో నీరున్నదని జ్ఞాని ఎటుల భ్రిమింపడో అటులనే కర్మ కర్మయనిభ్రిమపడడు. మనోవాక్కాయకర్మలు ఇంద్రియములు చేయుచున్నవనుబుద్ధితో యోగిచేయును. ఆ యోగి కాకర్మయందుగాని, కర్మఫలమందుగాని ఆసక్తి (అనురక్తి)

లేదు. యోగయుక్తుడుకానివాడై తేనో ఫలమును కోఱుటచేత కర్మబద్ధుడగుచున్నాడు. ఇటుల కర్మఫలత్యాగముచే కర్మ యోగి మోక్షమును (శాంతిని) పొందును. అందుచేత నీవు సర్వకర్మలయొక్క ఫలమును మనసా త్యాగముచేసి అట్టి సంన్యాసమువలన సుఖముగా నుండుము. తొమ్మిదిద్వార ములు లేక రంధ్రములుగల దేహమను పట్టణమునందు ఈ అనాసక్త కర్మయోగియగు దేహి (జీవుడు) ఏమియును చేయ కుండానే యుండును. ఇటుల కర్మఫలము కోఱువాడుండ లేడు, యోగికిటుల పుణ్యపాపములేలేవు. జ్ఞానము, అజ్ఞానమనునవి రెండునున్ను అవిద్యలేక మాయాశక్తి యొక్క వృత్తులే. జ్ఞాన స్వరూపమగు ఆత్మ అజ్ఞానవృత్తిచేత, అగ్నిపొగచేత ఆవ రింపఁబడినటులనే, ఆవరింపబడి యున్నది. ఈ అజ్ఞానముచేతనే జీవులు మోహావశులగుచున్నారు. ఎవరికైతే, సూర్యప్రకా శము వలన చీకటి నాశమగునటులనే, జ్ఞానప్రకాశముచేత అజ్ఞానము నాశమగునో, అట్టివారికి జ్ఞానము ప్రకాశించుచు ఆ బ్రహ్మపదప్రాప్తి కలుగును. అందుచేత అట్టి బ్రహ్మ బుద్ధినే (అనగా జీవుడే బ్రహ్మయను బుద్ధినే) వదలక ఎప్పుడును అలవర్చుకొనుము. ఇట్టిపణ్డితులు (జ్ఞానులు) మనుజులలో జ్ఞానా జ్ఞానులందును, జంతువులందును, కుక్కలందును, చండాలుల యందును, ఒకే బ్రహ్మభావము కలిగి సమదర్శనులగుదురు. ఇటుల సృష్టియే లేకపోగా మనస్సుటస్థితిని పొందగా, నిర్దోష మగు బ్రహ్మ (ఆత్మ) యగుటను ఆ బ్రహ్మయందే తత్త్వ జ్ఞానులుందురు. వారు ప్రియాప్రియములచేత చలింపరు. అట్టి స్థిరబుద్ధి బ్రహ్మయందలి బుద్ధియే. బాహ్యదృష్టి లేనివాడే

ఆత్మ సుఖమును అసక్తమనసుతో పొందును. అట్టిబ్రహ్మ యుక్తుడగు జీవుడే ఆనంద స్వరూపుడగును. ఎవరైతే విషయేంద్రియములను స్పృశింతురో అట్టివారుదుఃఖితులే. అందుచే వాటిలో రమింపకుము. మరణము సంభవముకాకమునుపే జీవించయుండగానే ఆనందానుభవమును కలిగిన జీవుడు కామక్రోధోద్భవవేగమునణచిన యోగియు సుఖియునగును. అంతరమైన సుఖము ననుభవించును. అంతర్జ్యోతియే (స్వప్రకాశజ్ఞాన స్వరూపమే) యెవడగునో అట్టివాడు (జ్ఞాని) యోగియు, బ్రహ్మభూతుడును, నిర్వాణము నొందినవాడును అగును. అటులనే ఋషులుబ్రహ్మత్వమునొందిరి. కామక్రోధములను జయించిన, మనస్సునుఅణచుటఅనుప్రయత్నముచేయు చుండువారు(యతులు)త్క్షణమే బ్రహ్మణ్యము నొందుదురు. కారణమువారుజ్ఞానిలగుటయే. సన్నే యజ్ఞతపోఽనుభవుని గను సర్వలోక మహేశ్వరునిగను కేవల పరోపకారినిగను సర్వభూతములలోను బ్రహ్మ ననుభవించు చున్నవానిగా నున్న మహాభోక్త గనున్న తెలుసుకొని శాంతిని (మోక్షమును) అట్టిజీవుడు పొందును. అని

శ్లో॥ సంన్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ
తయోస్తుకర్మసన్న్యాసా త్కర్మయోగోవిశిష్యతే॥ 5–2
భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరం।
సుహృదంసర్వభూతానాంజ్ఞాత్వామాంశాంతిమృచ్ఛతి
భ॥ గీ॥ 5—29

వరకు శ్లోకములతో నీ సన్న్యాసయోగాజ్ఞబోధను విరమించెను.

ఈ అంశమే క్లుప్తముగా యో. వా. ముముక్షు ప్ర. సర్గ 53—33, 34 శ్లో॥లలో ఇట్లు వివరింపబడినది. 1 శబ్దార్థము, 2 బోధాత్మ (జ్ఞానస్వరూపాత్మ) 3. జగత్తున్ను ఒకే బ్రహ్మయగును. ఇందు కెట్టి సంశయమున్ను లేదు. 1. ఆశ 2. జగత్తు 3. నాది 4. కర్మ 5. అహంకారవృత్తి 6. కాల స్వరూపము 7. అద్వైతము, ( ఒకే వస్తువు అనుభావము ) 8. ద్వైతము, (రెండువస్తువులు అనగా జీవుడు బ్రహ్మ లేక బ్రహ్మ జగత్తు వేరను భావమున్ను) నేనే. అందుచేత నా యందే యజ్ఞము చేయుము. నన్నే (బ్రహ్మనే) నమస్కరింపుము. నాలోనే విలీనము (ఏకీభావము) కమ్ము. ఆత్మయందే యోగము చేయుచు నా పరమగువాడవు కమ్ము అని శ్రీకృష్ణోపదేశమును ముగించెను.

సంన్యాస యోగాజ్గము సమాప్తము.

---

## ఆ ఱ వ అ ధ్యా య ము

### ♦ షష్ఠమ ధ్యాన యోగాఙ్గము ♦

1. శ్రీకృష్ణ పరమాత్మ కర్మఫలమును ఆశ్రయింపకనే కర్మచేయు అనాసక్తకర్మయోగి సంన్యాసియు, యోగియు అగుననిన్ని, నిరగ్నిహోత్రియున్ను, కర్మచేయని వాడున్ను, సంకల్పమును సంన్యసింపనివాడున్ను అట్టి యోగి కాడనిన్ని —

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః
ససంన్యాసీ చ యోగీచ ననిరగ్నిర్నచాక్రియః॥

యంసంన్యాసమితిప్రాహుర్యోగంతం విద్ధిపాణ్డవః।
నహ్యసంన్యస్తసంకల్పో యోగీభవతికశ్చన॥

భ. గీ. 6—1_ 2 శ్లో

లలో చెప్పెను. ఈ విషయము విపులముగ ఛాందోగ్యములో చల్లారిన బొగ్గులలో హోమము చేసిన నేయివలెనే అజ్ఞాని చేయు కర్మ నిష్ఫలమగుననియు, జ్ఞాని చేసిన హోమకర్మ సర్వలోకములందున్ను, సర్వభూతములందున్ను, సర్వ ఆత్మలందున్ను చేయబడిన హోమఫలము నిచ్చుచు వీర్యవత్తరమగుననియు, అట్టి విద్వత్కర్మఫలముగ, అట్టికర్మియొక్క పాపములన్నియు న్ను దూదిపింజలు అగ్నిలో భస్మమైనటులనే జ్ఞానాగ్నిలో భస్మమగుననిన్ని (ఛాం. 5—24 1-3) ప్రబలు చెప్పుచున్నవి. దీని విశేషవివరము మాచే రచిత అద్వైతభా—భా 3॥ కర్మోపాసనఫలశీర్షికలో చూడసగును సాధారణముగ అగ్నిహోత్ర కర్మ చేయనివానిని అనగా భార్యపోయినందున అగ్నిహోత్రి కర్మ చేయనివానిని నిరగ్ని అందురు.

ఐతే 1. పైన వివరింపబడిన జ్ఞానియగు కర్మియు, 2. వైశ్వానర స్వరూపముగ పరమాత్మయే దేహేంద్రియముల లో నున్న ధాత్వగ్నిగ జీవుడనుభవించు పదార్థముసంతనున్ను పక్వము చేయుచుండుటను అట్టి అగ్నియే భోక్తగాని, తాను (జీవుడు లేక దేహేంద్రియ సంఘాతి లేక పరిజ్ఞాత) కాదని భావించుకొనువాడున్ను, నిత్యాగ్ని హోత్రియు, అనాసక్త కర్మియు, నగుననునది విశేషార్థము. అనాసక్తకర్మి యనగా కామసంన్యస్త, సంకల్పకర్మఫలత్యాగియనియు, బ్రహ్మస్పర్శి (అనగా అన్ని ఉపాధులలోను ఒకేబ్రహ్మ అనుస్యూతముగా

నున్నటులను భావించువాడు అగును. భ గీ. 4 అధ్యాయము లో 18 శ్లోకములో నతడు అకర్మి యనిన్ని కర్మయందు అక ర్మత్వమున్ను. అకర్మయందు కర్మత్వమున్ను భావించువాడ నిన్ని చెప్పబడియున్నది.

దృష్టాంతముగ నావ ప్రయాణములో నున్న మనుజు లకు ఒడ్డునవున్న చెట్లు నడచుచున్నటులను, నావకదలకుండు నటులను విపరీతభావము కలుగుట లోక విదితమే. కర్మయం దకర్మబుద్ధి కలిగినట్టివాడు జీవన్ముక్తుడు లేక జ్ఞాని అగు చున్నాడు. అని, "వ్యవహార ప్రికల్పితా, కర్మేతిచ, క్రియ మాణేంద్రియైః, కర్మాణ్యమాకరోమీత్యధాఽత్మనిష్టతయా కృతంకర్మైవకర్మ, అకర్మేతిచ, కర్తృత్వ భోక్తృత్వాఽద్య హంకారతయా, బంధరూపం జన్మాదికారణం నిత్యనైమిత్తిక యాగవ్రత తపోదానాదిషు ఫలానభిసన్ధానంయత్తత్ కర్మ జ్ఞాన మితిచ.—— —— సచ్చిదానంద స్వరూపం జ్ఞాత్వాఽనన్దరూపా వస్థితిరేవచ.————సమస్త బంధ సంకల్ప క్షయో మోక్షః—— సర్వార్థాన్ పరిత్యజ్య నిర్మమో నిరహంకారోభూత్వా బ్రహ్మేష్టం శరణ ముపగమ్య —— —— మహావాక్యార్థా నుభవ జ్ఞానాద్బ్రహ్మైవ ...... (నిరాలంబనోప. 2 ప్ర॥) చెప్పుచున్నది.

అకర్మయనగా సామాన్యార్థము అజ్ఞానులకు కర్మచేయ కుండుటయే స్ఫురించును. విశేషార్థము :—— కురు తేతి కర్మ యను వ్యుత్పత్త్యర్థముచేత సహజముగ ఊపిరి రేచక, పూరక, కుంభకములున్ను, కర్మలున్ను, దేహాదిసంఘాతి (పరిజ్ఞాత) యే చేయుచున్నాడు, ఆత్మ చేయుటలేదని తలచు భావిన్ని అక

ర్మయే అగును అనునది విశేషార్థము అగుచున్నది. అందుచేత అగ్ని స్వరూపమును బ్రహ్మగనేతలంచి నిత్యాగ్ని హోత్రము చేయువాడున్ను "యద్భావం తద్భవతి" యను న్యాయమున అకర్మయే. దీనికి ప్ర॥లు॥ "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః। ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం" (భ. గీ. 15-14) 2. అహ మన్నగ్ంసదా న్నాద ఇతి బ్రహ్మవేదనం" (పాశుపత 1-3) 3. ఏతద నస్యాన్నమనో హ వై నామప్రత్యక్షం। నహవా ఏవంవిది కించ నా నన్నం భవతీతి" (ఛాం. 5-2-1) 4. అథయేవ తదేవం విద్వా నగ్నిహోత్రం జుహోతి తస్య సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మసు హుతంభవతి" (ఛాం.5-24-2)

ఈ ప్ర॥ల చేత విద్వత్కర్మయే అకర్మ యగుననిన్ని, మామూలు కర్మ అకర్మ గాడనిన్ని, అకర్మయే బ్రహ్మవృత్తము నెక్కగలడనిన్ని అందుచేతనే జీవుడెప్పుడును అనాసక్తుడు గానే యథాసంభవ కర్మను చేయుచునేయుండును. ఇదియే బ్రహ్మ మను మేడ ఎక్కుటకు మెట్టువలె ధ్యానయోగము నకు కారణమైయున్నది. ఈ ధ్యానములో ధ్యాత (ధ్యాని) ధ్యానము (తాను బ్రహ్మయే యను ఊహ లేక వృత్తి సంతతి) ధ్యేయము (ధ్యానింపబడు బ్రహ్మ) ఐక్యమగుట లేక బ్రహ్మత్వప్రాప్తి లేక అప్రమేయత్వము జీవుడు పొందుటకు లేక జీవుడే కేవల బ్రహ్మగా మిగిలియుండు ఫలమునకు శ్రేష్ఠమైన ధ్యానయోగము సాధనమగుటను దీనికి కామ సంన్యస్త సంకల్ప కర్మఫలత్యాగయోగము అనాసక్త కర్మ

యోగము లేక సంన్యాస కర్మయోగముయొక్క ఆరూఢమే కారణమగుచున్నది.

2. ఇదియే పరమార్థజ్ఞానము లేక పరమార్థజ్ఞానానన్య బ్రిహ్మాత్వ ఫలమునిచ్చు జ్ఞానాంగము లేక ఉత్తమసాధనము శమము (అంతరింద్రియ నిగ్రిహము)నకు లేక దమము(అంతర బాహ్యేంద్రియ నిగ్రిహము) నకు కాగా దానిద్వారా ధ్యాన యోగారూఢునికి బ్రిహ్మాత్వమునిచ్చు సాధనమని భావము. అందుచేత నీ ఉత్తమ ధ్యానయోగము, బ్రిహ్మ వృత్తము నెక్కుటకు శమముద్వారా చివరిసాధనము లేక చివరిమెట్టు అగుచున్నది. ఇటులను ధ్యానయోగమెట్టు దాటుటకు, కామ సంన్యస్త సంకల్పకర్మఫలత్యాగ యోగారూఢమున్ను, శమ మున్ను మెట్లగును. దానికి కర్మయోగారూఢ మవసరము.

చివరిఫలమగు జీవబ్రిహ్మైక్యమను మేడచేరుటకు।కర్మ యోగారూఢము, 2 కామసంన్యస్త సంకల్పఫలత్యాగ యోగా రూఢము ఉత్తమ సాధనములగు మెట్లు. ఈ క్రిమాధికార మెట్లను మధ్యమాధికారియగు జీవుడు అజ్ఞాననిద్రి నుంచి మేలుకొనగానే గురు శిష్య న్యాయ తర్కసాధనము ద్వారా బ్రిహ్మజ్ఞానమను మేడ ప్రాంగణమును చేరువటకు క్రిమ ముగ 1. కర్మయోగ మెట్టునున్ను, 2. కామ సంన్యస్త సంకల్ప కర్మఫలత్యాగయోగము(అనాసక్త కర్మయోగము) అను మెట్టునున్ను (3) తర్వాత శమ (దమ) మెట్టునున్ను 4. తర్వాత ధ్యానయోగమెట్టునున్ను ఎక్కుచుండునని భ. గీ. 6-3 శ్లోక నిశ్చయార్థము అని మననము చేయుము. ఏలనన ఇంద్రియములను ముఖ్యముగా మనస్సును ఇంద్రియా

ర్థములను (విషయములయొక్క ఆకారములను) పొందనీయ కుండ నియమించి బ్రహ్మ (ప్రత్యక్) వైపునకు మనస్సు అను నదిని ప్రవహింపచేయుటయే ఆరురుక్షుము లేక ధ్యానారురుక్షును. అందుచేత వృక్షముయొక్క చివరి భాగము లేక మేడ ప్రాంగణము చేరుటకు ఈ పై మెట్లు ఎక్కుట అవసరము. అందుచేత నీ అధ్యాయములో అనాసక్త కర్మయోగమావశ్యకత్వము తిరిగిదట్టింపబడినది. 4అ.లోని వికర్మకర్థము కొందరు చెప్పినటులను విశేషకర్మకాదు. కర్మఫల త్యాగము బ్రహ్మ స్పర్శయుతముగ చేయువాని మనస్సు క్రమముగ సంశుద్ధి యగుచుండును. అతఁడు ప్రతిషిద్ధకర్మవదలివేయును. కామ్య కర్మలను సంన్యసించును. అందుచేత మనస్సు క్రమముగ సంశుద్ధి దానంతట అదియే అగుచుండును. అందుచేతనే అనాసక్త కర్మ ప్రాముఖ్యత భ. గీ. 6-1,2 ల విశేషార్థ సింహావలోకనమును క్లిష్టముగా పైన నుదహరించినటులను వివరించిన తర్వాత ఈ క్రింద శమ ధ్యాన యోగమును గుఱించి విశేష వివరణచేయబడుచున్నది.

3. శ్లో. ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే
యోగారూఢస్య తస్యైవ శమ కారణముచ్యతే. భ. గీ. 6-3

మనస్సనునది వృత్తియే. నదినిపోలి, అంతరమున, ప్రత్యక్ వైపునకున్ను, బాహ్యమున విషయముల వైపునకున్ను రెండు వైపులనున్నూ స్వభావముగ ప్రవహించుచుండును. ఈ మనోవృత్తి నది బాహ్య విషయములవైపుకు ప్రవహించి నప్పుడు బాహ్యవిషయాకారము పొంది సంసార రూపకర్తృ భోక్తృత్వమున్ను, దాని ఫలమగు జనన మరణ రూప ఫలక

బంధమున్ను పొందుచున్నది. ఈ మనోవృత్తి నదీ ప్రవాహమును ఒక వైపున నరికట్టిన అది రెండవ వైపునకు ప్రవహించును. అందుచేత నీ సంసారము వైపున నరికట్టిన 1. సంన్యస్త సర్వసంకల్ప స్సమశ్శాంతమనామునిః సంన్యాసయోగయుక్తాత్మా జ్ఞానవాన్ (అధ్యాత్మ 91-93) 2. చిన్మాత్రావృత్తి ప్రజ్ఞేతి కథ్యతే బ్రహ్మాత్మనోశ్శోధిత యోభావావగాహినీ. (అధ్యాత్మ ః5-34) ప్ర లచే రెండవ వైపుకు (ప్రత్యక్ వైపుకు) ప్రవహించి ప్రత్యగ్విషయాకారమున్ను పొందును. (ప్రత్యక్కే అగును) ఆ సమకాలములో బ్రహ్మగానే 1. మనోబ్రహ్మ" (ఛాం. 3-18-1.) (2)మన ఏవ...... "ముక్త్యై నిర్విషయగ్ం స్మృతం" (అమృతబిం1-2) ప్ర॥ల చేత మిగిలియుండును. అనగా అతి వ్యాప్తి దోషము లేకుండా స్వప్రకాశ జ్ఞానైకరసముగ ప్రదీప దీపికైక్యన్యాయమున అగును. ప్రచండదీపవర్తివెలుగులో చిన్న దీపవర్తి వెలుగు విలీనమై పోవునది అనుభవైకవేద్యమే. అటులనే ప్రత్యగాకారము లేక ఆనంద స్వరూపము అగు అఖండత్వము (ముక్తికోప. 2-102 అమృత బిం. 9) ప్ర॥ల చేత అగుచున్నదను విశేషము గమనీయము.

దీని విశేష వివరణ మాచేత విరచిత అద్వైతభాషణ్మీమాంసలోనున్ను 1 వర్ణకం 9 వర్ణకములోనున్ను చూడ నగును. ఇంద్రియ నియమమనగా బాహ్యవిషయముల నుంచి విరమించి ప్రత్యక్ వైపుకు అంతరముగా ప్రవహింప చేయుట యను సారాంశము గ్రహింపనగును. అటుల మనస్సు నూర్ధ్వముఖమును చేసిననే పై ప్ర॥ల చేత అది నిర్వృత్తి అగును.

అందుచేత వికర్మయనగా విశేషకర్మ యనియు, మనస్సంశుద్ధి చేయు కర్మయనియు చెప్పెడి కొందరి వాదము నిరాకృతమే.

ఇటులను నిర్వృత్త మనస్సును చిదాత్మ ఎక్క (అభిమానించి లేక విషయీకరించి లేక గ్రహించి) అనగా అహంకారావరణము నశించుటను ప్రత్యక్కే అనన్యముగ నగును. ఇటులను మనస్సును బ్రహ్మాకారమును పొందించుట ముఖ్యము. ఇటుల నాత్మ (మనస్సు) బ్రహ్మవైపుకు ప్రవహించినప్పుడు జీవునకు మిత్రుడున్ను, బంధువున్ను, బహిర్విషయాకారము నొందినప్పుడు జీవునికి శత్రువున్ను అగును. ఊర్ధ్వముఖముగా చిదాకాశమున్ను, సహస్రార పదమున్ను చేరిన, మనస్సు క్రమముగా బ్రహ్మమగును. అధోముఖముగ భ్రుకుటీ, హృదయస్థానములను చేరిన బాహ్యానామ రూపాకారములనొంది మనస్సు సంసారి యగునని "ప్రాజ్ఞోఽప్యజ్ఞో యాం వన్న భవోవిట్" (సి. సూ 3-3-6) ప్ర। చెప్పుచున్నది. ఈ మనస్సే బ్రహ్మయగుననిన్ని, అది స్వప్రకాశభారూప మగునననీన్ని " మనోబ్రహ్మ " (ఛాం. 3-18-1) 2. "భారూప" (ఛాం. 3-14-2) ప్ర॥ ల చేత సిద్ధాంతమగుచున్నది. మనస్సు—1. శుద్ధమనస్సు (శుద్ధసత్వము) 2. మలిన మనస్సు (కోటికలతో గూడిన మనస్సు) అని రెండు విధములు కాగా శుద్ధమనస్సే (నిర్వృత్తమనస్సు) బ్రహ్మనన్యమున్ను మలిన మనస్సే బద్ధజీవుడున్ను అగుచున్నదని పై అమృత బిందూపనిషత్ చెప్పుచున్నది. మనస్సును ప్రత్యక్ నందు స్థిరీకరించిన పరమాత్మగా శాంతిరూపము నొందును. దానికి ప్రత్యగ్విషయీకరణమే సాధనము. చలి, వేడి, సుఖ దుఃఖములు,

కీర్త్యపకీర్తులు, అను ద్వంద్వములు లేకుండ జ్ఞానస్వరూప
ముగ తృప్తియగు ఆత్మ (తృప్తాత్మ) కూటస్థము (కదలకుండ
అన్నిటిలోను వ్యాపించియున్న వస్తువు లేక కుటిలముగ
నుండు ఉపాధులయందు ఉపాధి చలించినతానే చలించినట్లు
కనపడే ఒకేవస్తువు లేక ప్రకాశస్వరూపముగ నున్నజీవుడున్ను
ఇంద్రియములను జయించినవాడున్ను, యుక్తితో (యోగ
యుక్తితో) కూడిన జీవుడున్ను, బంగారమున్ను, రాయిన్ని,
ఇనుమున్ను, మణులనున్న మట్టి ముద్దలనున్న సమముగ
చూచుచు వాటిని కోటని జీవుడున్ను శాంత స్వరూపుడే
అగుచున్నాడు. ఈ సమబుద్ధి మిత్రత్వము, ఊరికేనే పరో
పకార బుద్ధి(సుహృత్వము)ఉదాసీనము, అద్వేషము, బంధువు
లందును సాధువులందును పాపులందును బ్రహ్మ శేషమై
యున్నదను తలంపు కలవాడు ఉత్తమయోగియే. యోగి
ఎప్పుడును మనస్సను గుహలో దాగియుండు పరమాత్మ
(బ్రహ్మ) యందే దృష్టియుంచి కాకివలెనే ఏకాగ్ర్య మనో
వృత్తితో తపించు లేక శోధించు జీవాత్మగానుండి ఏ విషయ
ములను అనుభవింపక మనస్సాతోసివేయువాడుగ నుండును.
శుచి అనగా చీకటిని పారతోలునది లేక మలినమును
శుభ్రము చేయునది అగు ప్రకాశము అనుదేశము నందే
స్థిరముగ దృష్టిని (మనస్సు ఊహను) నిలిపి పైకి ఒక మెట్టు
లో దూక ప్రయత్నింపకుండ క్రిందికి అనగా వెలుపలి విష
యములను ఊహింపక దర్భమీాద జింకతోలున్ను, దానిపైన
తెల్లబట్టయున్న (అనగా చలనములేక తమోగుణము దాని
పైన ఉష్ణము లేక రజోగుణము దానిపైన తెలుపు లేక సత్వ

గుణము) ను మీద మనస్సును ఎక్కించి ఆ సత్వగుణ మన స్సులోనుండి ఏకాగ్రమగు మనస్సుతో తపించుచు లేక తలుచుచునుండు స్థితుడగుటచేతనే అట్టియోగము బహు శ్రేష్ఠము. అప్పుడు దేహము, శిరస్సు, కంఠము ఒకే కర్రవలె నుంచుటచేత అనగా సుషుమ్నానాడి సూటిగ తెరువ బడుటచేత ముక్కుసూటిన్యాయమున (నాసాగ్రదృష్టిని) అన గా సహస్రారపదము లేక దేహేంద్రియములలో ఎల్లప్పుడు మూడు క్రిందనుండు బ్రహ్మపదము వైపున తననే అనగా శుద్ధజీవుని లేక బ్రహ్మనేకనిపెట్టుచు ఆ బ్రహ్మత్వమును. అనుభవించుచుండువాడే యోగి. ఇటులను మనస్సను శక్తిని (అసంభావన, విపరీతభావన, సంశయభావనలను విడనాడిన దానిని) పరికాశాత్మయగు తనయందు (బ్రహ్మయందు) ఐక్య. ము చేసి అనగా తాను బ్రహ్మగా అప్రమస్థితియందుండి అనగా మనస్సును అట్టి నియమమునందుంచి శాంతిపొందుటే (అనగా శాంతస్వభావుడగుటే) నిర్వాణము లేక మోక్షము అగును. అందుచేత జీవుడు పరమాత్మకంటే వేఱను భావము భ్రమజ్ఞానమున్ను అదే బంధమున్ను అగుచున్నది. మోక్ష మనగా సంసారబంధ విడుపు. యోగి ఇటులనే ఆ శ్రేష్ఠమైన స్థితిని (పదమును) చేరును. అనగా అట్టియోగి బ్రహ్మయే అగును. ఈ యోగములో ఎక్కువతక్కువలు లేకుండ ధ్యాన యోగారూఢులగు జ్ఞానయోగులు అవలంబించుటయే సుగ్ర హింపబడుచున్నది. ఇటుల నెప్పుడున్ను ఆత్మ (బ్రహ్మ) తానే నను స్థితియందు మనస్సును నిలిపి ఫలాఫలములందు సమ బుద్ధితో యుండుటే యోగ నిర్వచనముగ భ. గీ. 2-48

శ్లో॥ లో చెప్పబడినది. ఇది యుత్తమయోగమార్గమని నాకు తట్టుటచేత దీనిని నీకుపదేశించుచున్నాను అని శ్రీకృష్ణుడు అర్జునునకు చెప్పెను. చలనస్వభావమైన మనస్సును నియమించుట కష్టమైనను అభ్యాసముచేత అది సాధ్యమేనని ముగించెను. దొంగపశువు దీనికి దృష్టాంతము. అందుపైన ఇట్టి యోగి యోగము పూర్తి కాకపూర్వమే చనిపోయినయెడల అయతియై చంచలస్వభావు డగుచున్నాడుకదా! దృష్టాంతముగ శరదృతుమేఘములు చెదిరిపోయినశించినటులనే అతడు భ్రష్టుడైపోవునే!! దీనికి కారణము బ్రహ్మత్వము పొందక పూర్వమే చనిపోవుటయే. అట్టిభ్రష్టునిగతి ఏమగునని అర్జును డడుగగా శ్రీకృష్ణపరమాత్మ తన ప్రత్యుత్తరమును భ. గీ. 6-40-42, 45, 47 శ్లో॥ లలో నట్టి కల్యాణకర్మి గతినిగురించి చెప్పెను. మహావాక్యవిచారణచేసిన జీవబ్రహ్మైక్యజ్ఞానికి బ్రహ్మత్వము జీవించియుండగానే ప్రాప్తించుటచే అట్టిజ్ఞానిని గురించి ప్రసక్తి ఇక్కడలేదు. రెండవవాడగు కల్యాణకర్మి యగు అనాసక్త కర్మయోగి బ్రహ్మత్వము పొందకుండానే చనిపోయిన యోగభ్రష్టుడగుట నతనినిగురించిన ప్రసక్తియే చెప్పబడుచున్నదని గ్రాహ్యము.

అట్టి కల్యాణకర్మి భ్రష్టుడుకాడు. ఆతడీ లోకమునగాని, పరలోకమునగాని ఎట్టి దుర్గతినిపొందక ఇంకను పుణ్యపాపములు నశింపనివాడే యగుటను(జ్ఞానైతేనో వాని సంకల్పబలముననే పుణ్యపాపములు నశింపచేసుకొనును) అవి నశింపనంతకాలము పుణ్యామెక్కువగా మిగిలియున్న శ్రీమంతుల గృహములలో పుట్టి ఐశ్వర్యముల ననుభవించుచు ఆజన్మలో

గాని అనేక జన్మలననంతగమునగాని మోక్షమును పొందున నిన్ని, పాపమెక్కువగా మిగిలియున్న దరిద్రయోగ కుటుంబ ములో పుట్టిపాపమును నశింపచేసుకొని పుణ్యమెక్కువ చేసు కొనుననిన్ని, ఆజన్మలోగాని, అనేక జన్మలననంతరమునసే గాని పూర్వజన్మాభ్యాస బలముననే పుణ్యపాపములను నశింపచేసుకొని యోగముచేయుచు సిద్ధిని (మోక్షమును) పొందుననిన్ని, అటులజన్మ దుఃఖమేననిన్ని, నాయందే యోగముచేయు తన శ్రద్ధచేత బ్రహ్మస్వర్శయుతుడుయో గయుక్తతముడనిన్ని,

శ్లో॥ యోగినామపిసర్వేషాం మద్గతేనాన్తరాత్మనా॥
శ్రద్ధావాన్లభతే యోమాం సమేయుక్తతమోమతః
(భ.గీ 6-47)

అను శ్లోకముతో యోగఫలబోధను ముగించెను. ఈశ్లోకవిశే షార్థము క్రింది పంచదశి శ్లోకములు నుడువుచున్నవి.

శ్లో॥ "యోగభ్రష్టస్యగీతాయా మతీతే బహునామితి।
ప్రతి బంధక్షయః ప్రోక్తోనవిచారో వ్యనర్థకః"
"ప్రాప్యపుణ్యకృతాంలోకా నాత్మతత్త్వవిచారతః।
శుచీనాం శ్రీమతాంగేహే సాభిలాషోభి జాయతే"
"అథవాయోగినామేవ కులేభవతి ధీమతాం।
నిః స్పృహో బ్రహ్మతత్త్వస్య విచారాత్తద్ధి దుర్లభమ్"
తత్రతంబుద్ధి సంయోగం లభతే పౌర్వదేహికం।
యతతేచ తతోభూయస్తస్మాదేతద్ధి దుర్లభం"
"పూర్వాభ్యాసేనతే నైవహ్రియతే హ్యవశోఽపిసః
అనేకజన్మసంసిద్ధిస్తతోయాతిపరాంగతిమ్ పంచ9-46-50

యోగభ్రష్టునకు పుణ్యాపాపములనెడి ప్రతిబంధక్షయానంత రమే మహావాక్య (బ్రహ్మ) విచార ఫలక అపరోక్ష సాక్షా త్కారమగుటవలనను, బ్రహ్మవిచార ఫలము అనర్థకమని చెప్పుట లేదు. పుణ్య పాప నాశనము కాకపోవుటయే అన ర్థకము ఈ యోగ భ్రష్టునికి పుణ్యమెక్కువైనయెడల స్వర్గ రూప మానసానందానుభవమును అతడు అనుభవించి ఆ పుణ్య స్వర్గాదిలోకములలో బ్రహ్మ విచార ఫలకముగానే అనురూప విశుద్ధ మాతృ పితృగర్భద్వారమున జన్మించి, ఆ ఐశ్వర్య కుటుంబములో ఐశ్వర్యమనుభవించుచు, తదుపరి ఒక్కటిగాని లేక అనేక జన్మలనంతరమునగాని తన సంకల్ప బలమున పుణ్యాపాపముల నశింపజేసుకొని మోక్ష మును పొందును. యోగమును తాత్కాలికముగ మఱచిన అతని పుణ్యము నశించి పాపము మిగిలియే యుండును. ఈ రెండున్ను నశింపచేసుకొన్న నే మోక్షమతనికి సిద్ధించును. అథవా అటియోగభ్రష్టుడు దరిద్రకుటుంబములో పుట్టి పాప ఫలమగు దరిద్రము ననుభవించి, నిఃస్పృహ (వైరాగ్యమును) పొంది పుణ్య పాపములను తన సంకల్పబలముననే నశింప చేసుకొని పూర్వ జన్మాభ్యాసబలముననే మహావాక్య విచార ఫలకముగా ఆ జన్మలో మోక్షమును పొందును.

అందుచేత ని రెంటిలోను దరిద్రయోగకుటుంబములో జన్మమే దుర్లభము. అనగా గొప్పది లేక దుస్సాధ్యమను విశేషార్థమును "శ్రద్ధావాఞ్ఛభతేయోగం సచే యుక్త తమోమతః" అను మాటలచేత తెలుసుకొననగును. అందు చేత దరిద్రుడుగ పుట్టి దరిద్రమనుభవించుచున్న యెడల తన

పాపము నశించుచున్నదనిన్ని. యోగాచరణవల్ల, పుణ్య మెక్కువగు చున్నదనిన్ని తెలుసుకొని, బ్రహ్మవిచారబల మున సంకల్పముచేతనే పుణ్యమునుకూడ త్యజించి అనాసక్త కర్మయోగి తద్వారా ధ్యానయోగారూఢుడై విశ్వరూప (బ్రహ్మ) స్పర్శ చేయుచు మోక్షమును పొందవలెను శ్రీమంతుడుగ పుట్టిన ఐశ్వర్యముచేత పుణ్యము నశించు చున్నదనిన్ని, . పాపము మిగిలియున్నదనిన్ని తెలుసుకొని పాపనాశము కొరకు అనాసక్త కర్మచేసి బ్రహ్మ స్పర్శ చేయుచు బ్రహ్మ విచార బలమున తన సంకల్పబలముననే అంతయు (పుణ్య పాపమును) బ్రహ్మార్పణముచేసి పుణ్య పాపములనుత్యజించి మోక్షమునుపొందవలెనని సారాంశము గ్రాహ్యము. ఇటుల ప్రతి జీవునకున్ను అనాసక్త కర్మయోగము ద్వారా బ్రహ్మవిచార బలమున పుణ్య పాప ఫలము లను బ్రహ్మయందు త్యాగముచేసిననే మోక్షము సాధ్య మగుననిన్ని, అట్టి కర్మియే పరమార్థ సన్న్యాస ఫలమగు మోక్షమును పొందుననిన్ని భ. గీ. 6-2-47 శ్లోకములలో అకర్మయోగ ప్రాశస్త్యములేక గౌణ సంన్యాసప్రాశస్త్యము స్తుతించి ఈ ఆఱు అఙ్గములగు "త్వం" పదార్థ జీవవాచియొక్క బ్రహ్మత్వ సాధ్యత్వోపదేశమును(అనాసక్తకర్మ యోగము ద్వారానే భగవద్గీత చోదిత పారిభాషిక గౌణ సంన్యాసి మోక్షమును పొందుననునది) ముగించెను. ఈ భగవద్గీత కర్మయోగమున కర్థము - 1. అనాసక్త కర్మయోగము 2. సంకల్ప సంన్యాసయోగము కాగా 1. కామ సంన్యస్త సంకల్ప కర్మఫలత్యాగ కర్మయోగము 2. ధ్యానయోగము

లుగ ప్రాచుర్యమగుటను వీటి కగు సాధనములను 1. గౌణ సంన్యాసము 2 ధ్యానయోగములుగ ప్రదర్శించెను. మోక్షమను మేడకు ఈ రెండు మెట్లుగ నిర్వచించెను. జీవపరామర్శచేత బ్రహ్మ ప్రాచుర్యమును "త్వం" పద వాచ్య లక్ష్యార్థముగ 1 "అన్యార్థశ్చపరామర్శః 2 దహార ఉత్తరేభ్యః అను బ్రహ్మసూత్రములలో చెప్పిన బ్రహ్మ లక్ష్యార్థమును దైనందిక జీవానుభవైక వేద్యమేనని ఈ ఆఱు అంగముల లోను సందర్భోచితముగ చెప్పుటయేగాక అధ్యాసనున్ను సందర్భోచితముగనే అ4 శ్లో18లో క్లుప్తముగ ప్రదర్శించెను. ఈ ప్రథమ షట్కములో త్వంపదార్థమువాచ్యార్థముగ దేహేంద్రియాది సంఘాతమున్ను, దానిలో నుండు శుద్ధ జీవుడు ప్రత్యక్కేయగుచు సాక్షిగా ప్రాచుర్యమగుచు బ్రహ్మయే యగును గనుక అదియే లక్ష్యార్థమున్ను కాగా ఆత్మ (శుద్ధ జీవుడు) నిష్క్రియమున్ను దేహాది సంఘాతి లేక పరిజ్ఞాతయే కర్మ చేయుటను ఈశుద్ధ జీవుడు (పరిజ్ఞాత) కాదు. సంన్యస్త కర్మఫల త్యాగముచే గౌణ సంన్యాసియగుచు మోక్షము నొందుననిన్ని ఉపదేశ సారాంశము. ఫలము జీవుడగు అర్జునుడు రాగద్వేషములచేత యుద్ధ విరమణచేయువాడు, తాను బ్రహ్మయే యనియు (ఆత్మ యనియు) తనకు యుద్ధ ఫలిత బంధు మరణ సంతాపమే లేదనియు తన మనస్సు శుద్ధపరచుకొని యుద్ధోన్ముఖుడగుచు అనాసక్త కర్మచేయుచు బ్రహ్మ స్పర్శ లేక ఉపాస్యమెట్లు చేయనగునని, శ్రీకృష్ణపరమాత్మని ప్రార్థించుటయే. ఈ షట్కోపదేశ ప్రయోజనము. ఈ త్వం పదము విశదీయుగా

"త్+వ్+అం" అని తేలుచున్నది. 'త్' తత్పదార్థము, వాయుబీజము, అధిదేవత: ధనదుడు, ఫలము: ధన దానాది లాభము. 'వ్' ఉదక బీజము, అధిదేవత వరుణుడు, ఫలము విషనిర్హాణము. 'అం' వాయుబీజము, వ్యాప్య వ్యాపకవస్తువు అధిదేవత పరమాత్మ. ఫలము హస్తివశ్యము (శక్తివశ్యము) ఇటుల వ్యాప్య వ్యాపకవస్తువును (విష్ణువు లేక విశిష్టాద్వైత వస్తువు) అద్వైత (ఒకే)వస్తువున్ను అనుస్యూతముగ నగుచు చతుర్విధ పురుషార్థములను కలుగజేసి జీవుని సర్వవికారము లను (రజో తమో గుణ రూప విషములను) హరింప చేయు వస్తువే యగు లక్ష్య మగు తత్పదార్థమే త్వం పదమున్ను అగు చున్నది. మాచేత రచిత అద్వైతభాలోని మహా వాక్య లక్ష్యార్థ శీర్షికలో బ్రహ్మైక్య నవాభ్యాసము క్రింద- తే. గీ. దేహమహమాది సద దె అగును త్వ। (మ్రీ) అను పద్యపాదమున్ను 8 వర్ణకములోని లింగ షట్కమున్ను చూడ నగును. (అద్వైతభా. శిభా 8 వ)

దేహము మొదలుకొని అహంకారవృత్తివఱకు గల దేహాది సంఘాతములో సాక్షిస్వరూపముగ 'సత్' పదార్థమే. 'త్వం' వాచిగా నున్నది. ఈ దేహాది సంఘాతమే ఆత్మ యను భ్రాంతిని కలుగుచుండుటను, విచారింపగా 'సత్' పదార్థము స్వరూప ఉనికిగానే (సాక్షి స్వరూపముగానే) ప్రకాశించుచు చేతనమగుటను, అహంకార గ్రాహకము అగుచున్నదనియు, త్వం పద లక్ష్యార్థమగుచున్నదనిన్ని, అహంకారాదియే ఆత్మ యనునది భ్రమ జ్ఞానమనిన్ని యుక్తి

చేతనే తేలుననిన్ని అహంకారము జడము నశ్వరమనిన్ని తేలుననియు సిద్ధాంతీకరింపబడుచున్నది. ఇటుల నీ ధ్యాన యోగాజ్ఞోపదేశము అర్జునుని విషాదము మోహినీకార్యమేనని ఋజువుచేయు ప్రయోజనకారియే అగుచున్నది.

ధ్యానయోగాజ్ఞోపదేశము సమాప్తము
త్వంపదార్థ నిష్టాప్రధాన కర్మసంన్యాసాత్మకసాధన
ప్రధానషడాధ్యాయి ప్రథమషట్కాజ్ఞను
సమాప్తము.

---

# ద్వితీయ షట్కము

## తత్పదార్థ ఉపాస్యనిష్టా విశ్వరూపోపాసన (బ్రహ్మస్పర్శ) ప్రధానమధ్యమషడాధ్యాయి (ద్వితీయషట్కాజ్ఞము) సప్తమాధ్యాయము:

ప్రథమ జ్ఞాననిష్టాయోగాజ్ఞము— అనాస్త కకర్మ యోగి బ్రహ్మనే (శ్రీకృష్ణునే) ఆశ్రయించి యున్నందున బ్రహ్మను పూర్తిగా ఎటులను తెలుసుకొనునో అట్టి బ్రహ్మజ్ఞానమును అర్జునునికి శ్రీకృష్ణపరమాత్మ ఉపదేశించెను. ఇదియే బ్రహ్మవిజ్ఞానము (విశేషజ్ఞానము) ఈ లోకములో అనేకులలో నొకడేజ్ఞాని. ఇటులను తన జ్ఞానబోధను వినుటకు అర్జునుని ప్రేరేపించి ఉపదేశమును ప్రారంభించెను. ఈ సృష్టిలో (1) పృథవి (భూతత్త్వము) (2) జలము (రసతత్త్వము) (3) అగ్ని (తేజస్తత్త్వము (4) చలనము(వాయు

తత్త్వము) (5) ఆకసము (శబ్దగుణక శూన్యతత్త్వము) (6) మనస్సు సంకల్పవికల్పాత్మక వృత్తితత్త్వము. (7) బుద్ధి (నిశ్చయాత్మక వృత్తితత్త్వము) (8) అహంకారము (నేను అని పలుకు తుచ్ఛాహంకార వృత్తితత్త్వము) అను నీ ఎనిమిది భిన్నతత్త్వములున్న (శక్తులున్నా) ఈశ్వరశక్తి లేక బ్రహ్మసత్త లేక శక్తియొక్క విభిన్నరూపములే. వీటన్నిటిలోను వాటికంటే పరముగా నేనే(బ్రహ్మ లేక శ్రీకృష్ణ పరమాత్మయే) జీవభూతముగ (శుద్ధజీవాత్మగ) అంతరముగ (ప్రతిలోమ్యముగ) సాక్షిగప్రకాశించుచున్నాను. (అనగా వ్యతిరేకముఖముగ భోక్తలగాయతు అహంకారముతో కూడినచిదాత్మవలకు చేతనవస్తువును యుక్తిచేత విడదీయుచు వచ్చిన స్వప్రకాశవస్తువు గోచరింపగలదని అర్థము.) నీవిటు లను నన్ను అంతరస్వప్రకాశ వస్తువుగ నీలోనున్న వానిని గానే తెలుసుకొనుము.

మనస్సు:— 1. శుద్ధమనస్సు 2. మలినమనస్సు అని రెండువిధములుగా వృత్తిరూపమున జీవునిలో నున్న దని అమృత బిందూపనిషత్ చెప్పుచున్నదని క్రిందటి అధ్యాయములోనె చెప్పబడినది. ఈ మనస్సే ప్రకృతి. ఈ ప్రకృతి నా అనన్యశక్తే. ఇది శుద్ధమాయగను ఈశ్వరునిలోనున్న మలినముగ అవిద్యగను జీవునిలోనున్న దున్నది. క్లుప్తముగ చెప్పవలెనంటే శుద్ధమాయసత్వ రజస్తమో గుణములపాళ్లు సమానముగ కలిగి ఈశ్వరుని వశ్యమై యున్నది. అవిద్య తమోగుణ పాలెక్కువై మలినమాయ యగుచు అవిద్యా కార్యమేయగు అహంకారము, దాని కార్యమగు బుద్ధి దాని

కార్యమగు మనస్సు అను వృత్తుల శక్త్యంశములచేత శుద్ధ జీవుని ఆవరించి జీవుని వశపర్చుకొనును. మఱియు సరస్వతీ రహస్యోపనిషత్ 11 ప్ర॥ చే సత్పదార్థమే చైతన్యమే ప్రతి బింబమువలె చిచ్ఛాయగా ప్రతిబింబించి పురుషుడు (ప్రకృతి అవచ్ఛిన్నుడు) 2 ప్రకృతి (సమిష్టివ్యష్టిగా రెండుగ(ప్రకృతి త్వమగుచుండగా అదియే (క్షేత్రక్షేత్రజ్ఞులుగ) జీవవ్యవహార మును చేయుచున్నవని చెప్పుచున్నది. ఇటుల క్షేత్రజ్ఞుడు మలినజీవుడే. ఇతడు శుద్ధమైనయెడల అనగ క్షేత్రము ప్రకృతి కార్యము అగు అహంకారావరణము నశించినయెడలపరమాత్మ లేక పురుషోత్తముడు లేక ప్రత్యక్ గానే మిగిలియుండి సాక్షి స్వప్రకాశవస్తువుగనే క్షేత్రజ్ఞుడు (లేక పురుషుడు) మిగులును. అందుచేత చైతన్యము, చిత్, స్వప్రకాశ జ్ఞానస్వరూపము, పురుషోత్తముడు, ఆనందము 'భా', తన్మాత్రము, చిన్మాత్రము, పరమాత్మ, ఈశ్వరాత్మ, ఆత్మ, బ్రహ్మ, గ్రాహకవస్తువు, నిర్గుణ బ్రహ్మ వాచకములున్ను, జగత్, చిత్తము, జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము, దృష్టి, పురుషుడు భాస్యము, చిదాత్మ కము, జీవాత్మ, క్షేత్రజ్ఞుడు, సగుణబ్రహ్మ వివర్తబ్రహ్మ అని సమిష్టి ప్రపంచ, వ్యష్టి జీవ పరవాచకములున్ను వాటివాటి వ్యవహారములనుబట్టి అగు వాచకములున్ను, సమానార్థకము లున్ను శాస్త్ర కల్పిత పదములున్ను అగుచున్నవి. ప్రకృతి, అవ్యయము, వికృతి, క్షేత్రము, దేహాది సంఘాతము మొద లగునవి చిచ్ఛక్తి లేక బ్రహ్మశక్తియు దానియొక్క కార్య ములుగ తర తమ భేద వ్యవహారవాచకములు. ఈ జగత్తు నామ రూప ప్రపంచము ప్రత్యేక (వ్యష్టి) జీవభూత సంపు

టియే. ఇటుల క్షేత్ర క్షేత్రజ్ఞులు లేక పురుష ప్రకృతులు అను ఈ స్థూలభూత సృష్టికి ప్రకృతిలేక బ్రహ్మసత్త (శక్తి) యే బహుళముగ కారణము. జీవునిబుద్ధివలనుపరమాత్మయే వివర్తమగుటను తదుపరియే ప్రకృతి స్థూలరచనను చేయు నను విశేషము గమనీయము. ఈ వివరము అద్వైతభా లో 10 వర్ణకములో చూడుడు. ఇటులనన్ని భూతములకు మూల కారణము మణిపూసలకు దారమువలె అగుచు, అన్ని ఉపా ధులలోను అనుస్యూతముగా నేను (బ్రహ్మను) ఉన్నాను. అనగా వాటి చేతనకారణికుడ నగుచున్నాను. ఇట్టి జగత్తుకు కారణమగు ప్రకృతియొక్క ద్వారములగు చావుపుట్టుకల ద్వారా అదంతయు తెలుసుకొనుచు సాక్షిగానే నిత్యసత్య వస్తువుగా మిగిలియుండి జగత్తుకు పరమ కారణికము నే నగుచున్నాను. అందుచేత నేను లేనిదే జగత్తే లేదనిన్ని ఆకాశమందు వాయువు వలెనే జగదాధారమగుదుననిన్ని తెలుసుకొనుము.

ఈ జగత్తులో భూతసముదాయమునకు బలము నేనే. ఇటులనే నీటియొక్క రసత్వము (ద్రవత్వము) న్ను, సర్వవేద ములున్ను, ఓంకారాత్మకమగుటనున్ను, ఓంకారమున్ను, అటులనే ఆకాశతత్త్వమగు శబ్దమున్ను, నరులందలి పౌరుషము లేక పుంసత్వమున్ను, పుణ్యమున్ను, భూమిలోని గంధ మున్ను, సూర్యుని తేజస్సున్ను, సర్వభూతముల జీవనమున్ను, తాపసుల తపస్సున్ను అగుచు భూతములకు కారణమగుచు, బుద్ధిమంతులలోని బుద్ధిన్ని, తేజోవంతులలోని తేజస్సున్ను, సత్వరజస్తమోగుణములకు మూలమగు శుద్ధ సత్వగుణమున్ను

ప్రకృతి త్రిగుణాత్మకమగుటను, దాని కార్యమగు రాగ ద్వేష మోహాదులచేత నొప్పుచున్న పదార్థముల నన్నింటిని లోనున్న నేను నిండియున్ను, వాటిగుణములచేత నేను కప్పబడక యుండుటచేత, అన్నిటిని ప్రకాశింపచేయు వాడనున్ను, (విషయాకారమునొందువాడనున్న), గ్రాహకుడనున్న, అగుచు యావత్తువ్యవహారమునున్న, నా అనన్య వైష్ణవ లేక మాయాశక్తిద్వారా చేయించుచు, చేతనుడను లేక వ్యవహర్తను నేనే అగుచున్నాను. ఈ వ్యవహారము చేయు వైష్ణవశక్తిని లేక మాయాశక్తిని దాట నే జీవునకున్ను నన్ను తెలుసుకొనునంతవఱకు అలవియేకాదు. అనగా ఎవరైతే నన్ను తెలుసుకొందురో, అంతటను నన్ను చూచుచు నన్నే (బ్రహ్మనే) అనన్యముగ శరణుచొచ్చి, నన్ను, పొందుదురో అట్టివారే నాశక్తిని దాటగలరు. దుర్మార్గులున్ను, కుత్సితమనస్కులున్ను, నరాధములగుటచేత నామాయాశక్తిచే మోహవశులై అజ్ఞానులై రాక్షసాంశభావులై పతితులగుదురు. అందుచే నన్నే (బ్రహ్మనే) 1. ఆర్తులు 2. అర్థార్థులు 3. జిజ్ఞాసువులు 4. జ్ఞానులు భజించుచుందురు. వీరిలో జ్ఞానియే సదా నా యోగయుక్తికలిగి(ఏకాంతబ్రహ్మ భక్తికలిగి) యుండుటచే అందఱిలోను అతడు నాకత్యంత ప్రియుడు (ప్రియతముడు). తక్కిన ముగ్గురు నాకు ప్రియులు మాత్రమే. వీరందఱు నుదారులేమైనను జ్ఞానియే ఆత్మయని మా. మతము ఇచట పై నాల్గు విధములగు మనుజుల సామాన్యవిశేషార్థములు చింత్యమే.

1. సాధారణార్థము:- మొదటి ముగ్గురున్ను అజ్ఞానులే అగుటను వారిజ్ఞానలవ తారతమ్యము వలన 1. ఆర్తుడు దుఃఖముపోగొట్టుటకై బ్రహ్మను దుఃఖనివృత్తికి ప్రార్థించును.

(2) అర్థార్థి:- దారాపుత్రాదుల కుటుంబపోషణకై ధనమును కోరి ధనప్రాప్తికి భగవంతుని ప్రార్థించును.

(3) జిజ్ఞాసువు:- బ్రహ్మజ్ఞాన విచారణచేయుచు బ్రహ్మసాయుజ్యముకోరుచుండును. ఇటులను వీరు తరతమ అజ్ఞానులే.

(4) జ్ఞానియన్నదో జీవబ్రహ్మైక్య జ్ఞానియగుటను ఆయన బ్రహ్మయే అగుటను తన ఆత్మయేయని పరమాత్మ అభిప్రాయము.

2. విశేషార్థము:- ఇచట ప్రకృతమగు అనాసక్త కర్మయోగి జీవబ్రహ్మైక్య జ్ఞానతారతమ్యముచేతనగు అపూర్ణజ్ఞానిలేక సత్వాపత్తి, అసంసక్తి, పదార్థాభావన భూమికుడు అగును. మొదటి ముగ్గురున్ను జీవన్ముక్తులే. విదేహిూయొక్క ఈ పూర్ణజ్ఞానియు తురీయాతీతుడున్ను, అగుచు నాల్గవభూమికుడగు జ్ఞానియగును. ముగ్గురు జీవన్ముక్తులు ఈ జన్మలోని స్థూలదేహపాతమునకు అజ్ఞానావరకశక్త్యంశము నశించినను, విక్షేపశక్త్యంశము వారికి తరతమముగా నుండు టచే వీరు అనిచ్ఛాప్రారబ్ధ మనుభవించుచు, ఆ అనుభవ కాలములో "విదాంత్వా ప్రారబ్ధాత్తిమిరవత్" (సి.సూ 3-3-8), భోగేనత్వితరే క్షపయిత్వా సంపద్యతే । (బ్ర. సూ.

4-1-19) ప్రగలచే 1. ఆర్తుడు 2. అర్థార్థి, 3. జిజ్ఞాసువులుగా నుందురు. ఈ విక్షేపము కాలినవిత్తువలె భోగముకాగానే నశించును– అను దృఢభావము వీరికుండును. 1. ఆర్తి అనగా రోగాది దుఃఖభాగుడైనప్పుడు ఆ బ్రహ్మ సమదర్శనుడగుట చేత ఆ బ్రహ్మను తాను శరణుచొచ్చియున్నందున ఎందుకు తనకీబాధ కలుగుచున్నదని బ్రహ్మశరణుచొచ్చి శాంతిభంగ రోగాదినివారణ్ని శీఘ్రప్రశాంతి లబ్ధికి (బ్రహ్మప్రాప్తికి) ప్రార్థించుచుండును. 2. ధనాభావము మొదలగు అర్థహీన ప్రారబ్ధము కలిగినప్పుడు అర్థార్థి తాను బ్రహ్మను శరణు చొచ్చి ఇట్టి విక్షేపముచేతను శాంతిభంగమగుటవలనను ఈ అడ్డము తీసివేయుమని బ్రహ్మశరణుచొచ్చుచు స్థిరశాంతి కోరుచు ప్రారబ్ధము అనుభవించిననే నశించునను జ్ఞానముతో నుండి బ్రహ్మస్పర్శ ద్విగుణీకృతముగ చేయుచుండును. అనగా అంతరమున శాంతివిడువకుండ నుండును.

3. జిజ్ఞాసువు : ఇతడు తానే బ్రహ్మ అగునుకదా! అది శాంతి రూపమేనే! దానిని చెడకొట్టు మాయాశక్తి బ్రహ్మనన్యమే గదా ! అందుచేత యిదంతయు బ్రహ్మప్రతి భాసయే యగుచున్నందున అది శాంతించుటకున్నూ బ్రహ్మ నన్యముగ దానిని తెలుసుకొనుచు ప్రారబ్ధనాశమున కెదురు చూచుచుండును. వరాహోపనిషత్తులో చెప్పినటులను ఆత్మ (మాయా) శక్తియొక్క నాశము క్రమముగ గనుచుండును. ఈ ఆత్మశక్తియొక్క క్రమనాశము ఈ గ్రంధము 18 అ.లో చెప్పబడినది.

4. జ్ఞాని : పూర్ణజ్ఞాని యగుటనున్ను, దేహాస్ఫురణ యే లేకందుననున్ను విదేహీ జీవించియుండగానే అగుచున్నం దుననున్ను అతడు బ్రహ్మయే (ఆత్మయే) అగుచున్నాడని శ్రీకృష్ణుని అభిప్రాయమని సారాంశము.

ఇటులను అనాసక్తకర్మయోగి చేయు మూడు పై విధములగు భావములున్ను జీవన్ముక్తుని (జ్ఞాని) దశాంతరాను భవములేయగుచు ప్రకృత స్థూలదేహ పాతానంతరమున అపునరావృత్తి ఫలము గాంచుటకు ద్వారములే యనునది విశేషార్థము అనుభవైకవేద్యమే. ఈ విశేషార్థమునే శ్రీకృష్ణ పరమాత్మయే ఈ క్రింది విధముగ నిగూఢముగ జ్ఞాని యొక్క స్తుతిచే చెప్పుచున్నారు. "అనాసక్తకర్మ నాయం దలి యోగములోనే యుండి దానిఫలముగా నన్నే (బ్రహ్మ పదమును) పొందుచున్నాడు. అనేక జన్మల ననంతరమే జ్ఞాని శుకమహర్షివలె విహంగమార్గమున ఆ జన్మలోనున్ను వామ దేవునివలె పిపీలికామార్గమున అనేకజన్మల ననంతరము చివర (ఒకేజన్మలోనున్ను)నా పదమును పొందును. దీని విశేష వివ రము అద్వైతభా 1, 9, 10 వర్ణకములలో చూడ నగును. వాసుదేవుడే (ఎల్లరియందు వసించువాడు) లేక బ్రహ్మయే. ఈ సర్వదృశ్య నామరూప ప్రపంచము నని తలంచుచుండు నట్టియతండే మహాత్ముడు. అట్టివాడు దుర్లభుడే. అనగా అట్టి జీవబ్రహ్మైక్యజ్ఞానము దుష్టసాధ్యమే. జ్ఞానికి జ్ఞానమే స్వరూ ప మగుచు జ్ఞానస్వరూపబ్రహ్మయే జ్ఞానియగును. కామదూషి తు లగుచు ఇతర దేవతలను భజించువారిని వారి స్వభావమును బట్టి నియమప్రకారమే వారు స్వనిరతులు లేక ప్రాప్తులు

అగునట్లు చేయుచుండును. ఎవరెవ రేయే శ్రద్ధలచేత, ఏయే దేహములను గోఱి భక్తిశ్రద్ధలతో పూజించు చున్నారో అవన్నియు నాకే చెందినను వారివారి కోఱికల ప్రకారము అగు ఫలములనే (సాపేక్షగనే) ఇచ్చుచుందును. ఆయా ఫలములు నశ్వరములే యగుటను ఆయా దేవతలను సేవించువారు అల్ప మనస్కులే. ఇటులను దేవతలను సేవించువారు దేవతల పదమునున్ను, నన్నే (బ్రహ్మనే) భజించువారు బ్రహ్మ పదమునున్ను పొందుదురు. నిరతిశయము అగునన్ను యీ కనపడు నామరూపముగ (వ్యక్తముగ) తలచి నా స్వభావమును తెలియని కారణముచేత పృథక్త్వముగ నజ్ఞానముచేత పూజించుచున్నారు. నిత్యసత్యమైన నేను నా యోగమాయ చేత సర్వమును కప్పివేయుచున్నాను. మూఢులై నన్ను తెలుసుకొనుటలేదు.

నన్ను భూత వర్తమాన భవిష్యత్కాలాతీతునిగా నున్ను, అట్టి భూతముల నన్నిటిని యెఱుగువానిగనున్ను ఆ భూతములచేత ఎఱుఁగబడని వానిగనున్ను తెలియుము. రాగద్వేషములచేత భూతములన్నియును మోహవశమగుచున్నవి. అందుచేతనే సృష్టిలో నుంచుచున్నవి. ఇట్టి వీరు పుణ్యులున్ను, సుఖ దుఃఖ ము లు శీతోష్ణములు అను ద్వంద్వములచేత మోహితులు అగుచు పుట్టుక చావు రూప సంసారములోపడి ప్రవాహ పతితపురుగువలె కొట్టుకొను చున్నారు. ఐతే నన్ను పుట్టుక చావు లేనివానిగను, నిత్యసత్యునిగను, భజించినవారు యావత్తుఅధ్యాత్మకర్మయందు బ్రహ్మజ్ఞానముతో బ్రహ్మకర్మ యావత్తుచేసి నన్ను అధిభూతము,

అధిదైవతము, అధియజ్ఞముగ నెఱింగిన వారున్ను, అథవా మరణకాలమునందైనను నన్ను అటులను భావించు వారున్ను, యోగయుక్తులనఁబడుదురు అని, భగీ॥ అ7-1-30 వ శ్లోకములలో అనాసక్త కర్మజజ్ఞాన విజ్ఞానయోగో పదేశమును ముగించెను. జ్ఞానవిజ్ఞాన నిష్టాయోగాజ్ఞోపదేశము

సమాప్తము.

---

# ఎనిమిదవ అధ్యాయము

## ద్వితీయబ్రహ్మాక్షర నిర్దేశయోగాజ్ఞము.

అంతట అర్జునుడు (1) అక్షరుఁడు (2) బ్రహ్మ. (3) అధ్యాత్మ. (4) కర్మ. (5) అధిభూతము (6) అధిదైవతము. (7) అధియజ్ఞమనగనేమి? ప్రయాణకాలములో ఈ దేహములో నియతాత్మలచేత నీవు (బ్రహ్మ) ఎటుల తెలియఁబడు చున్నావు? అని ప్రశ్నింపబడి శ్రీకృష్ణపరమాత్మ ఈక్రింది ప్రత్యుత్తరమిచ్చెను.

1. అక్షరమ్=న క్షరతీతి అక్షరమ్ అనుటచేత అవి నాశరహితమైన నిత్య సత్యవస్తువు (2) బ్రహ్మ=బృహత్ ఇతి ధాత్వర్థేన బృంహణత్వాత్ బ్రహ్మ, సర్వమున్నునిండి యుండుటచేత బ్రహ్మ. ఇచట కేవల వృద్ధికాక హస్తి వలె వృద్ధి యగు వస్తువులోనున్ను దోమవలె హ్రస్వ (కుఱుచ) వస్తువులో నున్ను నిండి యుండుటవలన వ్యాప్యవ్యాపకముగ సర్వమునందున్ను అన్ని జీవులలోనున్ను నిండి

ఉండుటచే, తనయందున్ను (నక్తయందున్ను) సర్వజ్ఞ జ్ఞాన స్వరూపముగా అనుస్యూతముగా నున్న ఒకే వస్తువుగను ఉన్నదని అర్థము.

3. అధ్యాత్మ=పరమాత్మ వస్తువునే భోక్తలగాయతు చిదాత్మ వఱకు దేహాది సంఘాతములో మనోవృత్తితో ఏకాగ్ర్యముగ తఱచగా చిదాత్మతో ప్రీతిలోమ్యముగ సాక్షిగ ప్రకాశించుచుండు 'చిత్' అను స్వప్రకాశవస్తువే (ప్రత్యక్) పరమాత్మస్వభావమగు వస్తువు. అథవా మనస్సను గుహలో అంతరాత్మగా ప్రకాశించు వస్తువు దానితోకూడి మనోరూపుడుగ నున్నవస్తువు భూతభావను జన్మకారణము, భవతి=అగును (4) కర్మ=విసర్గః అనగ దేవతలనుద్దేశించి యజ్ఞద్రవ్యమును వదలుట. అదిన్ని, కర్మయజ్ఞములో చేయ బడు కర్మయున్ను-అగును. ఈ కర్మ యజ్ఞ ఫలమే భూత ములు పుట్టుటకు వర్షాదులు నిమిత్త కారణములుగ కలిగిన ఉపాదాన కారణమున్ను అగుచున్నవి. 5. అధిభూతము= నశ్వరములే అగు భూతములనున్ను ప్రాణిజాతమునున్ను, పుట్టుక చావులు గలవగుటచే తాను అధిష్ఠించినదే అధి భూతము (6) అధిదైవతము=పురుషుడు అనగా పురి అన బడు దేహమందు పూర్ణముగ నిండియున్న అనగా బాహ్య మున ప్రకాశవే స్వరూపముగా కలుగు సూర్యపురుషుని కూడ నిండి హిరణ్యగర్భుడుండుటచేత అన్ని జీవులకు కారణ జీవుడగు నాతడే (ఆ పురుషుడే) అధిదైవతము.

7. అధియజ్ఞము=యజ్ఞ స్వరూపుడు, వ్యాప్యవ్యాపక రూపుడు అగు విష్ణునామకుడు. ఈ యజ్ఞ స్వరూప ఫలము

దేహమందే దేవత రూపముగానున్ను, నేనే (శ్రీకృష్ణ పరమాత్మ లేక బ్రహ్మయే) అధియజ్ఞముగ నగుదును. అందుచేతనే దేహభూతులందు శ్రేష్ఠుడను అందుచేతనే మరణకాలమందైనను నన్నిటులనే ఎవరు సంస్మరించెదరో వారు నా పదము నొందెదరు. ఇందుకు సందేహములేదు. అందుచేత సర్వకాలములందున్ను నన్నే ఇటులను భజించుచు యుద్ధముచేయుము. మనోబుద్ధి వృత్తులను నాయందుచేర్చిన (లయించిన) నాపదమునే పొందుదువు. ఇటుల నధ్యాత్మయోగయుక్తుడై అట్టి మనోవృత్తిలోనే ఉండి అట్టి పరమపురుషుడగు నా దివ్యపదము చింతించువాడు నా పదమునే పొందును నన్ను సనాతన(చిరంతన)పురుషునిగను, శాశించు బ్రహ్మగాను, అణుబ్రహ్మాండములో నంతకంటే పరమాణువుగను. మహా బ్రహ్మాండములో నంతకంటే మహాత్తగు వస్తువుగాను,ఆదిత్యవర్ణమగు"భా" రూపునిగను, చీకటికవతల నుండు స్వప్రకాశ రూపునిగను (అజ్ఞానమునపహరించుస్వప్రకాశజ్ఞాన స్వరూపునిగను,) స్మరించుచు మరణ కాలమందు మనోవృత్తిని నిశ్చలముచేసి భక్తియుక్తులచేత నగు యోగబలముచేతకూడ రెండు కనుబొమలమధ్య ప్రాణవాయువు నుంచి తదుపరి చిదాకాశమున ప్రాణమును నిలిపి సమ్యగ్ జ్ఞానముచేత(జీవ బ్రహ్మైక్య జ్ఞానముచేత)ఎవడు స్మరించుచు మరణించునో వాడు దివ్యవంతమగు బ్రహ్మను పొందును. వేదవిదులు (వేదాంతులు) ఏ అక్షరమును పొందుదురో (ఏ పదమును రాగ ద్వేష రహితులు పొందుదురో) ఏ బ్రహ్మ

త్వము కోటి ఆ బ్రహ్మచర్య ఫలముగ బ్రహ్మయగుదురో అది క్లుప్తముగ చెప్పెదను.

## బ్ర హ్మ ని ర్దే శ ము

ఓం=(అ+ఉ+మ+ం) సంధియే. ఓం అగుటను కేవల నిర్గుణబ్రహ్మ: సగుణ బ్రహ్మ, వాచి యగుచున్నది. అట్టి ఓం అను స్వరూపనుగల పరమాత్మను యోగయుక్తుడై స్మరించుచు మనస్సును ఆత్మయందు లయమునుచేసి యోగ ధారణలోనున్నవాడు అజ్ఞానియయ్యెను, జ్ఞానియయ్యెను మరణించినయెడల అట్టివాడు పరమపదమునుపొందును. అనగా సగుణ నిర్గుణ బ్రహ్మపదములను వారి భావ వివృతి ఫలముగ పొందును. నన్నెప్పుడున్ను స్మరించు వానికి నా పదము సులభమే. బ్రహ్మలోకముతో అంత్యమగు లోకము లన్నిటికిన్ని అందులోని జీవులకును అనగా అచట బ్రహ్మచేత మహావాక్యోపదేశము పొందనివారందరికిన్ని పునర్జన్మ ప్రాప్తి కలుగును. అందుచేత నన్ను చేరినవారికి పునర్జన్మయేలేదు. ఈ లోకములన్నియు సృష్టి (జన్మ) స్థితి (ఉనికి) లయము (చావు) అను లోనై యున్నవి. ఎటులననగా, పగలు రాత్రివలె చక్రభ్రమణములే అవ్యక్తముకంటె పైనయుండు నన్ను సర్వభూతములందు సనాతనునిగ నెఱిఁగి సేవించిన (తెలుసుకొని భజించిన) అట్టి వాడు నశింపడు. అవ్యక్తమనగా అక్షరము. ఎందుచేత ననగ అవ్యక్త పదము నొందినవాడు వ్యక్తమేకాడు. అనగా తిఱిగి పుట్టడు. పురుషుఁడనగ ఏకాన్త భక్తిచేతనున్ను, అన్నిభూతములకు నంతరస్థునిగ

నున్ను అంతయున్ను నిండినవానిగానున్న నన్ను తలంచు వాడు నా పదుడే. అట్టి యోగి కానివాడే కాలము నతి క్రమించి ఎటులను గతి, ఆ గతులనే పొందునో ఈ క్రింద వివరింపబడుచున్నది.

—:ఇష్ట్యాది పుణ్య కర్మకులకు పితృయాన (దక్షిణాయణ) మార్గమున గత్యాగతి ఫలము:—

తే. గీ॥ పాప్రణగతి ఇష్టియను కర్మ పరులకు పితృ ।
యానమును, ధూమ, రాత్రి, కృష్ణార్థపక్ష ।
దక్షిణాయనము లింకవత్సర, పితృ గగ ।
నంబుC, జంద్రలోకగతియు నాగతికమొ;

—:పాపులకు యమలోక నరకాద్యధోగత్యాగతి ఫలము:—

తే. గీ॥ పాపులకు నుత్క్రమణము నా ♦ పథియొయండు ।
చంద్రలోకాంతరితమగు ♦ సంయమపురి ।
కి నతివాహ్యులుగ నరక ♦ మనుభవించి।
యహియుC బాషాణ జన్మల ♦ నంతCగందు॥

—:బ్రహ్మ కర్మ సమాధిగ, సగుణోపాసక, జ్ఞానయోగుల, గ త్యా గ తి ఫ ల ము:—

కం॥ జ్ఞానికి యోగికి, నగునా
యానము, నగ్నియును జ్యోతి యహ్నము శుక్లం ।
బైన ముదజ్సంవత్సర
మానుత దేవ, మరుదర్క మానిత చంద్రల్·

కం॥ అంతను విద్యుల్లోకం
బంతవరుణు, డింద్రు డింకC బ్రజలపతి పదం।

బంతను బ్రహ్మనెలవునకు
నంత నతి వహులై; అనావృతదితజ్ఞులకే॥
అ. భా. 3-భా. 3-9వర్ణకము సంసార రూపానువాదము

ఇష్టి మొదలగు పుణ్యకర్మలను చేయువాడు పితృయానము లేక దక్షిణాయనమార్గమున మరణానంతరమున మనో సూక్ష్మ ప్రాణభూతములతోకూడి సూక్ష్మజీవుడు 1. ధూమాభిమాన దేవత 2. రాత్రిలోకాధి దేవత 3. కృష్ణపక్షలోకాధిదేవత 4. దక్షిణాయన లోకాధిదేవత 5. సంవత్సర లోకాధిదేవత 6. పితృలోకాధిదేవత 7. ఆకాశ లోకాధిదేవత 8. చంద్ర లోకాధిదేవత (సూర్యలోకమునకు దిగువనుండు చంద్రలోకము అనగా భూలోకవాసుల స్థూలముగ కండ్లకు గోచరించు లేక భూమిచుట్టుతిరుగుచుండు చంద్రగోళము) అధిదేవతలచేత ఆయాలోకములకు తీసుకొనిపోబడి అచట జీవులుచేసిన పుణ్యఫలమును కించిదవశిష్టముగ మానసికానంద రూపముగ ననుభవించి శేషకర్మ ఫలము ననుభవించుటకు మనుష్యయోనియందు తిరిగి జీవులు పుట్టుదురు. ఇటులనే పైకి క్రిందికి పోవుచు అనగా చావు పుట్టుకలు నొందుచు మనుజ జీవులు నీటి ప్రవాహములో కొట్టుకొని పోవునట్టిన్ని, దరికిచేరవలెనను ఊహయే లేక కొట్టుకొని పోవునట్టి పురుగువలె జననమరణప్రవాహములో కొట్టుకొని పోవుచు మోక్షేచ్ఛయే లేక సంసార బద్ధులై యుందురు. అటులనే పాప జీవులున్ను పై పితృయానముననే చంద్రలోకములో దక్షిణ దిశనున్న యమలోకములో నరక బాధ

ననుభవించి తిరిగి శేష పాప ఫలము అనుభవించుటకుగాను పాము, తాయి జన్మలెత్తి అధోగతి నంతకంతకుపొందుదురు. ఇంక జ్ఞానయోగికిన్ని (1. శుభేచ్ఛ, 2. విచారణ, 3. తను మానసి భూమికలకున్ను) అనగా తను మానసి భూమికారు రుక్షునకున్ను 2. సగుణోపాసకునకున్ను 3 దహరోపాసకున కున్ను 4. అపూర్ణ జ్ఞానికిన్ని (నిరవగ్రహేశ్వరాల్లబ్ధాత్మ జ్ఞానికిన్ని) దేవయానముననే ఊర్ధ్వలోక గమనమగుచున్నది. పై యోగులలో బ్రహ్మార్పిత ఫలయోగి, బ్రహ్మకర్మ సమాధిగుడు అనాసక్త కర్మయోగి)ఓం ప్రతీకోపాసకుడున్ను చేరుదురు. దేవయానమున ఈ సూక్ష్మజీవులు 1. అగ్ని 2. జ్యోతి 3. పగటి లోకము, 4. శుక్లపక్ష 5 ఉత్తరాయణ 6. సంవత్సర 7. దేవలోకములు 8. వాయులోకము 9. సూర్య ల్లోకములు 10. సూర్యునిపైనున్న చంద్రలోకము 11. విద్యు ల్లోకము 12. వరుణలోకము 13. ఇంద్రలోకము 14. ప్రజా పతిలోకము 15. బ్రహ్మలోకములు వీటి అధిదేవతలచేత క్రమ నియమముగ వారి నారి పుణ్యఫలానుసారమే ఆయా లోకములకు మోసుకొనిపోబడుదురు. ఆయాలోకములలో పుణ్య ఫలమును పై విధముగ కించిదవశిష్టముగ మానసికా నందముగ ననుభవించి శేషకర్మ ఫలమును భౌతిక శరీరముతో ననుభవించుటకు వ్యతిరేకముఖముగ క్రమనియమముగా నవరోహణమగుచు క్రొత్తమనుజజన్మ నెత్తుదురు. ఐతే నిర్గుణోపాసకులగు పూర్ణ జ్ఞానులకు బ్రహ్మత్వమను మోక్షము జీవించియుండగానే ఈ లోకములోనే ప్రకాశించును. మరణా నంతరము పంచభూతములున్ను పంచప్రాణములున్ను మహా

భూతములలో లయమగుటచేత ఘటాకాశము మహాకాశములో లీనమగునటులను శుద్ధ జీవాత్మ బ్రహ్మాత్మలో లీనమగును. అందుచే అట్టిజ్ఞానులకు పునరావృత్తిలేదు. అపూర్ణ జ్ఞానులగు నిర్గుణోపాసకులకు బ్రహ్మలోకములో సగుణ బ్రహ్మచేత మహావాక్యోపదేశము చేయబడి, వారు సగుణ బ్రహ్మతోనేనిర్గుణబ్రహ్మలో విలీనమగుదురు అను విశేషము గమనీయము. అద్వైత భా 9. వర్ణనము చూడుడు. అందుచేత అనాసక్త కర్మయోగ రహస్యము నెఱిగిన యోగి మోహవశుఁడు ఎప్పుడును గాక సర్వభూతములందును పైన ఉదహరించినటులను బ్రహ్మస్పర్శచేయు ఆత్మభూతుడుగ యోగయుక్తుడై యుండును. యజ్ఞతపస్సు, దాన, పుణ్యఫలములకంటే ఎక్కువ పుణ్య ఫలమిచ్చు నీయోగ రహస్యము యావత్తు తెలుసుకొనియోగి(అనాసక్త కర్మయోగి లేక గౌణసంన్యాసి) పరమాత్మ పదమును పరమార్థ సన్యాసి జ్ఞాని వలెనే పొందును అని భ. గీ. అ8-శ్లో1-28లలో అనాసక్త కర్మయోగాఙ్గ బ్రహ్మాక్షర నిర్దేశోపదేశమును ముగించెను.

బ్రహ్మాక్షర నిర్దేశయోగాఙ్గము సమాప్తము

---

## తొమ్మిదవ అధ్యాయము

## తృతీయ రాజవిద్యా రాజ గుహ్యయోగాఙ్గము

శ్రీకృష్ణపరమాత్మ అర్జునుడు ప్రియుఁడును తన యందు (బ్రహ్మయందు) అద్వేషియు నగుటనున్న రహస్యముగు దైవీ సంపద కలిగియున్నందుననున్న రాజ విద్యా

రాజగుహ్యయోగము నుపదేశించి సందియములను తీర్చెను. చెప్పబోవు ధర్మమును తెలుసుకొను శ్రద్ధలేనివాడు రాక్ష సాంశమును పొందుచున్నాడు. కాగా నా (బ్రహ్మ) పదము నెప్పుడును పొందడని ఖండితముగా చెప్పెను. ఈ జగత్తు యావత్తు నా చేతనే పూర్ణమైయున్నది. అనగా నాచేత పూరింపబడినది. నా యందే సర్వభూతము లను నిల్చి యున్నవి. కాని నేను వానియందు లేను. మఱియు నా యొక్క యథార్థరూపమేమనగా భూత రాశియందు లేనే లేను. అదియే నా ఆశ్చర్యకరమైన యోగము లేక యుక్తి. భూత ములనుభవించునదిన్ని, భూతములందున్నదిన్ని యగు భూత భావన యున్నను, నీ ఆత్మ లేక శక్తి లేక సత్త (బ్రహ్మ సత్త లేక బ్రహ్మ శక్తి) యే అగుచు ఆకసమువలె సంతయు నిండియున్నది. ఆకసములో సర్వగత వాయువు ఎటులను నిండియున్నదో అటులనే సర్వభూతములున్ను నాయందు న్నవి. (అనగా మణిపూసలలోని దారమువలెనే) బ్రహ్మశక్తి లోనే నుండుటచేత సర్వభూతములలోను నేనునిండియున్నాను. అనగా బ్రహ్మసత్త ద్వారా అన్ని భూతములలోనున్న అనుస్యూతముగానే ఆకాశములో వాయువువలెనున్నాను. సర్వభూతములున్ను, నా అనన్యశక్తియగు ప్రకృతి లేక మాయాశక్తిలో కల్పప్రళయకాలములో నశించుచున్నవి. తిరిగి క్రొత్తకల్పములో మొట్టమొదట వాటిని (వాటివాస నల ననుసరించియే) సృష్టించుచున్నాను. నా యనన్యశక్తి యగు ప్రకృతిని నేను వశపర్చుకొని సృష్టిచేయుచున్నాను. ఈ భూతసముదాయము మఱియు అవిద్యాదోషముతో కర్మాది

ప్రకృతిశక్తి వశమైనందున వారివారి స్వభావముల ననుసరించి తిఱిగి తిఱిగి జీవులు సృష్టింపబడుచున్నారు. వారుచేయు కర్మలను అసక్తితో వారుచేయనంతవఱకు నేనెప్పుడూ ఉదాసీనముగ నుండుటచేతనున్ను, వారి కర్మలు నన్ను బంధింపలేనందుననున్ను, నేను అధిష్ఠానముగ వాటినంటుకోకుండనుండుట చేతనున్ను, అధిష్టితమగు ప్రకృతియే ఈ చరాచర లోకభూతములను సృష్టించుటచేతనున్ను, సూదంటుఱాయి, ఇనుము న్యాయమున నా సన్నిధిని ప్రకృతి చేతనమగుచు వ్యక్తావ్యక్త చరాచరభూతములను సృష్టించుచున్నది.

ఇచట "దృశి"మాత్ర కర్మత్వమే నిమిత్తముగ సర్వావస్థలయందు జగత్తుయొక్క సర్వ ప్రవృత్తిని అనుభవించుచున్నానని, 'జీవేశౌ తయోపి జీవః ఫలం భుజ్త్కే కర్మణో న మహేశ్వరః । కేవలం సాక్షిరూపేణ వినాభోగేనవర్తతే'॥ (అన్నపూర్ణ ఉప 3–63) అను ప్ర॥ చెప్పునటులను దృశిరూప కర్మలున్ను, వాటి కోఱికలున్ను, వాటి ఫలములున్ను జీవుడనుభవించుచు మహేశ్వరుడు కేవల సాక్షిరూపమూపు స్వరూపకర్మకర్తగయున్నాడు. అందుచేత దీనిని చూచుచున్నానను కర్మ కలుగుచున్నది. దీనికి కారణము పరమాత్మ చిదాకాశ మగుటయే. ప్ర॥ 'పరమేవ్యోమన్' అను తై–బ్రహ్మవల్లి–1–1) చూడుడు. అది నా స్వభావమని "చిద్వ్యోమైవ కిలాస్తీహ పరాపర వివర్జితః । సర్వతాత్ర సంభవాచ్చైవ చైత్యం యత్కల్పాం తేవశిష్యతే॥ (అన్నపూర్ణ 5–69–70) ప్ర॥ చే తెలుసుకొనుము. ఇటుల నాకే చైతన్యము అంతకు అధిష్ఠానముకాగా ఇంకొక చైతన్యము భోక్తకాదు. అందు

రాజగుహ్యయోగము నుపదేశించి సందియములను తీర్చెను. చెప్పబోవు ధర్మమును తెలుసుకొను శ్రద్ధలేనివాడు రాక్ష సాంశమును పొందుచున్నాడు. కాగా నా (బ్రహ్మ) పదము నెప్పుడును పొందడని ఖండితముగా చెప్పెను. ఈ జగత్తు యావత్తు నా చేతనే పూర్ణమైయున్నది. అనగా నాచేత పూరింపబడినది. నా యందే సర్వభూతములును నిల్చి యున్నవి. కాని నేను వానియందు లేను. మఱియు నా యొక్క యథార్థరూపమేమనగా భూతరాశియందు లేనే లేను. అదియే నా ఆశ్చర్యకరమైన యోగము లేక యుక్తి. భూత ములనుభవించునదిన్ని, భూతములందున్నదిన్ని యగు భూత భావన యున్ను, నీ ఆత్మ లేక శక్తి లేక సత్త (బ్రహ్మ సత్త లేక బ్రహ్మ శక్తి) యే అగుచు ఆకసమువలె సంతయు నిండియున్నది. ఆకసములో సర్వగత వాయువు ఎటులను నిండియున్నదో అటులనే సర్వభూతములున్ను నాయందు న్నవి. (అనగా మణిపూసలలోని దారమువలెనే) బ్రహ్మశక్తి లోనే నుండుటచేత సర్వభూతములలోను నేనునిండియున్నాను. అనగా బ్రహ్మసత్త ద్వారా అన్ని భూతములలోనున్ను అనుస్యూతముగానే ఆకాశములో వాయువువలెనున్నాను. సర్వభూతములున్ను, నా అనన్యశక్తియగు ప్రకృతి లేక మాయాశక్తిలో కల్పప్రళయకాలములో నశించుచున్నవి. తిరిగి క్రొత్తకల్పములో మొట్టమొదట వాటిని (వాటివాస నల ననుసరించియే) సృష్టించుచున్నాను. నా యనన్యశక్తి యగు ప్రకృతిని నేను వశపర్చుకొని సృష్టిచేయుచున్నాను. ఈ భూతసముదాయమంతయు అవిద్యాదోషములో క్షుద్ర

ప్రకృతిశక్తి వశమైనందున వారివారి స్వభావముల ననుసరించి తిరిగి తిరిగి జీవులు సృష్టింపబడుచున్నారు. వారుచేయు కర్మలను ఆసక్తితో వారుచేయనంతవఱకు నేనెప్పుడూ ఉదాసీనముగ నుండుటచేతనున్ను, వారి కర్మలు నన్ను బంధింపలేనందుననున్ను, నేను అధిష్ఠానముగ వాటినంటుకోకుండనుండుట చేతనున్ను, అధిష్ఠితమగు ప్రకృతియే ఈ చరాచర లోకభూతములను సృష్టించుటచేతనున్ను, సూదంటుఱాయి, ఇనుము న్యాయమున నా సన్నిధిని ప్రకృతి చేతనమగుచు వ్యక్తావ్యక్త చరాచరభూతములను సృష్టించుచున్నది.

ఇచట "దృశి"మాత్ర కర్మత్వమే నిమిత్తముగ సర్వావస్థలయందు జగత్తుయొక్క సర్వ ప్రవృత్తిని అనుభవించుచున్నానని, 'జీవేశౌ తయోాపి జీవః ఫలం భుజ్క్తే కర్మణో న మహేశ్వరః । కేవలం సాక్షిరూపేణ వినాభోగేనవర్తతే'॥ (అన్నపూర్ణ ఉప 3–63) అను ప్ర॥ చెప్పినటులను దృశిరూప కర్మలున్ను, వాటి కోరికలున్ను, వాటి ఫలములున్ను జీవుడనుభవించుచు మహేశ్వరుడు కేవల సాక్షిరూపమూపు స్వరూపకర్మకర్తగయున్నాడు. అందుచేత దీనిని చూచుచున్నానను కర్మ కలుగుచున్నది. దీనికి కారణము పరమాత్మ చిదాకాశ మగుటయే. ప్ర॥ 'పరమేవ్యోమన్' అను తై–బ్రహ్మవల్లి–1–1) చూడుడు. అది నా స్వభావమని "చిద్వ్యోమైవ కిలాస్తీహ పరాపర వివర్జితః । సర్వత్ర సంభవాచ్చైవ చైత్యం యత్కల్పాం తేవశిష్యతే॥ (అన్నపూర్ణ 5–69–70) ప్ర॥ చే తెలుసుకొనుము. ఇటుల నొకే చైతన్యము అంతకు అధిష్ఠానముకాగా ఇంకొక చైతన్యము భోక్త కాదు. అందు

చేత ఎందుకీ సృష్టియను ప్రశ్నకు భగవద్గీత శంకరభాష్యము లోని జవాబు 'కో అద్ధావేద క ఇహ ప్రవోచత్కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః॥ (తై॥ ఆ 2–8–9) అనునది కాగా శ్రీ వ్యాసమహర్షి చే విజ్ఞప్తయేహి సర్గం జగాజగా। (సి.సూ 1–4–30) ప్ర॥ చే ఈ నామరూప ప్రపంచసృష్టికి మూలకారణము స్వప్రకాశ జ్ఞానస్వరూప బ్రహ్మను ప్రకాశన మగు ద్వైతనామరూపజగత్తుద్వారానే (వివర్త బ్రహ్మద్వారానే) తెలుసుకొను ప్రయోజనమునకేనని చెప్పబడుచున్నది. ఎటులననగా ఈ జగత్తగు నామరూపములను నిషేధించి అందులో మిగిలియున్న, అస్తి, భాతి, ప్రియం, అను మూడు విధములుగనున్న బ్రహ్మను, మనోవృత్తి బ్రహ్మవైపుకుప్రత్యక్షమగు ప్రకాశన స్వరూపముగుండానే ఊర్ధ్వముఖముచేసి యుక్తి చేతను స్వప్రకాశ మూలవస్తువును తెలుసుకొన నగును. మఱొక మార్గమే లేదు. అనగా జడపరివర్తన భావము (వివర్తము నొందిన నామరూప జగత్తుద్వారానే ఒకే స్వప్రకాశ జ్ఞానస్వరూప నిర్గుణబ్రహ్మను ఏకం సత్ విప్రా బహుధా వదంతి (ఋ. 10–82–3) ప్ర॥ చే తెలుసుకొననగును. విప్రా = ప్రా–పూరణే దేశతః కాలతః వస్తుతోఽపి పూర్ణం ప్రాచుర్యస్యనా – వి – విపశ్చితః బ్రహ్మ వివర్తితః బ్రహ్మయేకం సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యం సత్ పదార్థః అనుస్యూతః ప్రకాశజ్ఞాన స్వరూపః బహుధా = ఉపాధిబహుత్వే అనేకధా వదంతి = భ్రమత్వేన పృథక్త్వం వదంతి అజ్ఞానినః ఇతి వాక్యశేషః ॥

అనగా దేశకాలవస్తుతః కూడ పూర్ణము లేక పాృచు ర్యమగు విపశ్చితుని లేక బృహ్మాము లేక వివర్తపాృచుర్యమగు స్వజాతీయ, విజాతీయ స్వగతభేద శూన్యమగు సత్పదార్ధ మొక్కటే అన్ని ఉపాధులలోను అనుస్యూతముగ ప్రకాశించు వస్తు వగుచుండగా అది తెలుసుకొనలేని అజ్ఞానులు అనేకముగా నున్నదని పృథక్త్వముగ ఉపాధికులను చెప్పుచున్నారు. ఇటులను విశిష్టాద్వైతముగ అనుస్యూతముగ ఒకే నిత్య సత్య వస్తువగు బృహ్మ అన్ని జడపదార్ధములను చేతనములనుచేయుచున్నది.

ఇవన్నియు ఒకే బృహ్మగానే సత్యమనియు, నామరూపోపాధికములుగ నశ్వరములు అనృతములు ననియు సిద్ధాంతమగుచున్నది. మఱియు విసృష్టి (పృళయ) కాలములో నామరూపములు నశించి అంతయు ఒకే బృహ్మ (నిర్గుణబృహ్మ)గ మిగిలియుండును అందుచేత సృష్టికి పూర్వాపరములలో మిగిలియుండు నిర్గుణ బృహ్మయందు కల్పిత నామరూప జగత్తు నిర్గుణ బృహ్మగా మాతృమే సత్యమని, గోడమీద చిత్రము గోడగానే సత్యమైనటులను తెలియునగును. గోడయందు చిత్రమువలె ఆత్మ గందు నామరూపపృపంచము కల్పితమగుటను స్వప్నపృపంచమువలె అనృతమే

తే. గీ. జ్ఞానమాత్మ నిర్గుణ సగుణమగు బృహ్మ
సృష్టి పూర్వాపరాత్మె విహీనగుణియుఁ
కించిదంశ వివర్త సర్గె సగుణియగుఁ
జ్ఞముగ సర్వమున్ వ్యాప్తత నాత్మకు నతి॥

తే. గీ. ఈ జగద్బ్రహ్మ చిత్తేచ్ఛయే; కలనది
బంధమిక౯ జాగ్రదాదిప్రపంచమిదియు౯
మిథ్య; చిన్మయి జలరసమె; అదె బ్రహ్మ:
జగము౯, జిద్వివర్తిత బ్రహ్మ, జైవిమునగు౯॥
అ. భా. 1 వర్ణ—

ఆత్మయనగ స్వప్రకాశ జ్ఞాన స్వరూపమే. అది సగుణ నిర్గుణ బ్రహ్మగానున్నది ఈ సృష్టి పూర్వాపరములలోనున్న నిర్గుణ బ్రహ్మగానున్న, సృష్టిచేయు కాలములో అనంత నిర్గుణ బ్రహ్మలోని అతి సూక్ష్మాంశయే నామ రూప జడ పదార్థమగు ప్రపంచముగానున్న వివర్తమగుచు సగుణ బ్రహ్మ యని ఈ జగత్తు చెప్పబడుచున్నది. కేవల స్వప్రకాశ జ్ఞాన స్వరూపముగ సర్వాంతర్యామిగ అంతటను వ్యాప్య వ్యాపకరూపముగ వ్యావృతి నొందుటచేత ఆత్మయనఁ బడుచున్నది. ఆత్మకు (అటతీతి ఆత్మ అను వ్యుత్పత్త్యర్థము కలిగియున్న వస్తువునకు) నమస్కారము. ఇటులను ఈ బ్రహ్మ కోరికయే చిత్తమను శరీరము అగుచు కలరూపనామ రూప ప్రపంచమగుచున్నది. అందుచేత నీ జగత్తు సత్యసంకల్పుడగు బ్రహ్మ కల్పనయే అటులనే జీవాత్మయున్ను. ఆ బ్రహ్మచిత్త కల్పనయే. జాగ్రత్త, కల, సుషుప్తి (గాఢనిద్ర) అనుభవ ప్రపంచములు జీవికి కలుగుచున్నవి. ఇవి నిజ మను భ్రాంతిని జీవుడు అవిద్యాకార్యమగు అహంకార బుద్ధి, మనోవృత్తులతో తలచుచుంటచేత కలుగుచున్నవి. అది కేవలభ్రమ జ్ఞానవృత్తియే. దృష్టాంతముగ కలలో జీవుడు తాను మర

ణించినటులను శోకించి, తిఱిగిమేలుకొని తర్వాత అది కేవల భ్రమజ్ఞానమే నని భావించుచుండును. జలమునకు మయముగ రసము ఎటుల నున్నదో అటులనే చిత్తముమయముగ బ్రహ్మ లేక చిత్ ఉన్నాడు. ఈ చిత్ స్వరూప ఆత్మలేక జ్ఞానము లేక నిర్గుణ బ్రహ్మ తనలోపమును విడువకుండగ నామరూప జడ పరివర్తన భావముగ జగత్తున్ను జీవుడున్ను అగును. ఐతే మూఢు లిట్టి విచక్షణ చేయకుండ తనను (శ్రీకృష్ణుని) మానుష శరీర మాశ్రయించిన పరమాత్మయనియు, సర్వ భూత మహేశ్వరుడనియు తెలుసుకొనలేరు. తెలుసుకొనుటకు శ్రవణమే (విచారమే) శరణ్యము. విచారము చేయని మూఢులు (రాక్షసాంశజులు) మోహిని లేక దేహాత్మవాదిని యగు ప్రకృతి నాశ్రయింతురు. మహాత్ములు దైవీ ప్రకృతి నాశ్రయింతురు. భక్తులు ఏకాంత భక్తిచేతనున్ను జ్ఞానులు జీవబ్రహ్మైక్యజ్ఞానముచేతనున్ను నన్ను ఒక్కనిగా నేనున్న బహుముఖము (విశ్వరూపము) గనున్ను ఏకంసత్ విప్రా బహుధావదంతి ఋ 1-82-3) అను ఋగ్వేద ప్ర॥ ననుసరించి ఒకే బ్రహ్మ అనేకోపాధికముగ నున్నదని తెలుసుకొనలేక అజ్ఞానులు పృథక్త్వముగ ఉపాసింతురు. ఇటులను జ్ఞానులు జ్ఞానయజ్ఞమును చేయుదురు. యజ్ఞ సామగ్రియంతయు నేనే. యాజులు యజ్ఞకర్మ ఫలముగ మరణానంతరమున సూక్ష్మ శరీరముతో స్వర్గలోకముచేరి అక్కడ పుణ్యఫలమును కించి దవశిష్టముగ మానసికానంద రూపముగననుభవించి శేష కర్మఫలమునుభౌతిక దేహముతో ననుభవింతురని చెప్పబడియే యున్నది. అటులను వారు గ తాగతికులే. ఏకాంతముగనన్ను

సేవించువారి యోగక్షేమము నే నెల్లప్పుడు విచారించుచునే యుందును. నా ఏకాంతభక్తుడు పూవుగాని, పండుగాని, నీరుగాని, భక్తిచేత అర్పించినందున దానిచే నేనే ప్రీతి చెందుదును. అందుచేత నీవేమి చేసినను అదంతయు నాకే అర్పింపుము. అటులను శుభాశుభములను విడిచికర్మ బంధము లేక సంన్యాసయోగయుక్తాత్మ (అనాసక్త కర్మయోగి) నన్నే పొందును. నన్నెవరైతే బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రులలో అటులను ఆశ్రయింతురో వారు ఈ లోకమనిత్యమనే నన్ను సేవింతురు. గనుక నీవున్ను నా మనోవృత్తియే కలిగి నన్నే (పరమాత్మనే) సేవించుచు ఐకాంతిక భక్తుడవున్ను నా యజ్ఞను చేయువాడవున్ను కమ్ము. నన్నే (పరమాత్మనే) నమస్కరింపుము. నా యోగమునే చేయుము. నన్నే పొందుమని రాజవిద్యా రాజగుహ్యయోగాజ్ఞోపదేశమును భగీ.9అ 2-34 శ్లోకములలో అనాసక్త కర్మయోగాజ్ఞఫలము మోక్షమని స్తుతించి ఉపదేశమును ముగించెను

రాజ విద్యా రాజగుహ్యయోగాజ్ఞము సమాప్తము.

---

## పదియవ అధ్యాయము

## చతుర్థ విభూతియోగాజ్ఞము

శ్రీకృష్ణపరమాత్మముందు చెప్పబోవు ఉపదేశమును దేవతలకుకూడ తెలియదని ప్రస్తుతించి ప్రారంభించెను. ఎవరైతే నన్ను మహేశ్వరునిగ నెఱుగుదురో వారిసర్వపాపములున్ను నశించును. 1. బుద్ధి 2. జ్ఞానము 3 అసమ్మోహము

4. క్షమా 5 సత్యము 6 దమము (బాహ్యేంద్రియ నిగ్రహము) 7. శమము (అంతరింద్రియ నిగ్రహము) 8. సుఖము 9. దుఃఖము 10 భావము 11. అభావము 12. భయము 13. అభయము 14. అహింస 15. సమత్వము 16. తుష్టి 17. తపస్సు 18. దానము 19. యశస్సు (కీర్తి) 20. అయశస్సు (అపకీర్తి) ఇవన్నియు వారివారి కర్మానుసారముగ ప్రాణులకు నావల్లనే కల్గుచున్నవి. అందుచేత నేను సాధారణ కర్తయు, దేశకాలకర్మాది ప్రతినియతములు అసాధారణ కర్తృకమున్ను, "వైషమ్య నైర్ఘృణ్యే, న, సాపేక్షత్వాత్" (బ్ర. సూ. 2-3-8) ప్ర॥ చెప్పుచున్నది. ఈ యర్థమే క్రింది పద్యములో చూడుడు.

ఆ॥ వె॥ దైవమర్థ్యవరము లీవిశొన్నింటికి
మాత్ర మరయ వారి పాత్రతనిడుఁ
బరిణతనియతములన్ బ్రాకృతులాన్సధార
ణేశుకర్తృకంబు నెఱుగలేరు;॥ వర్ణక్యం అ. భా.

ఋష్యాదులు, మన్వాదులు, నాభావముచే పుట్టువారందఱున్ను, వారిలోకములు, వారి విభూతి (ఐశ్వర్యము) యోగమునాదిగా నెవరు ఎఱుగుదురో వారు అచలయోగులే. అంతయు నా (పరమాత్మ) వలననే జరుగుచున్నదని భక్తులు భజింతురు. (నాభావమును పొందుదురు) అట్టివారికి బ్రహ్మజ్ఞానమును (జీవబ్రహ్మైక్య జ్ఞానమును) నేనుకలుగ జేయుదును. ఇటులను ఋషులలో నారదుడు మొదలగువారి విభూతి నాదియని చెప్పగా విని, ఇంకను చెప్పుమని యడుగబడి ఈలోక

ములో ఉన్నివస్తువులలో ప్రత్యేకముగా ఏది ప్రశస్తమో అది తనవిభూతియే యని ప్రత్యుత్తరము నిచ్చెను. భ. గీ. అ 10-1-42 శ్లో॥ లలో జగత్తంతయు తనయొక్క పీసపాలు అంశ అనగా తాను పూర్ణబ్రహ్మగా అనంతముగా (సముద్ర స్థానముగ) నున్నాననియు, తనయొక్క పీసపాలు అంశయగు యావత్తుజగత్తున్ను సముద్రనీటి బిందుస్థానముగనున్నదనియు సముద్రములోని నీటికిన్ని, అలలయొక్క నీటిబిందువులకున్ను వాటి కూడికయగు నురగ, అలలు, సముద్రజలముయొక్క యున్ను, అవినాభావ రసత్వముగా నేను (పరమాత్మ) ఉన్నాను. అనగా రసగుణమే ఆధారముగ నీ జల బిందువులు వాటి కూడిక అగు నురగ, అలలు సముద్రమున్ను కలుపగా అగుచున్నవనియు, సముద్రములో నలలు తీసివేసిన మిగిలిన నీరున్ను అందులో నురగ తీసివేసి మిగిలిన నీరున్ను నీటి పర మాణు బిందువుల కూడిక యగుటచేత ఈ అన్ని పరమాణు వుల లోపలనే ప్రకాశ స్వరూపముగానే వానిని చేతనముగ చేయుచున్నాననిన్ని, అను భావము చెప్పి ఆ పరమాణువు లను నేనే ఉనికిగాగల బ్రహ్మసత్త లేక బీజశక్తి చేతనము చేయుచున్నదని, "బీజశక్తిర్విస్ఫురన్తి త్రివృత్కృత్యాచినో త్యణీయసః ॥ [సి. సూ. 1-4-8) ప్ర। చెప్పుచున్నది. ఆ బీజ శక్తి (బ్రహ్మశక్తి) ని నేనే చేతనము చేయుచున్నాను. దీని నే బహుళముగ అనంత నిర్గుణబ్రహ్మను దృష్టాంతముగ 4 అంశములు చేసి అందులో ఒక అంశము జగత్తుగా నున్నానని ఉపనిషత్ప్రమాణమున్నది. "భాగాది సింధు వత్ (సి. సూ. 3-1-9) కూడ యిదియే చెప్పుచున్నది. పర

మాణువులను కూడికచేయు వాయువు బుద్ధిపూర్వకముగ ఆ పని చేయదు. అది చలింపని జడమేననిన్ని దీని చలింపచేయు శక్తి బ్రహ్మసత్తయనిన్ని, ఆ శక్తియే బీజముగానుండి వాయువును చలింపజేయుచున్నదనిన్ని సూత్రప్రాయముగ పై సిద్ధాంత సూత్రము చెప్పుచున్నది, అని ఈ క్రింది పద్యము లో చూడనగును.

తే. గీ. వాయువు జడమె, బుద్ధిపూర్వకపు చేష్టి।
లేదు; పరమాణుసంగ్రహణేది ? లేదె!।
పరుడు సర్వజ్ఞుడితర జైవాళి ద్వైహి।
కులు, నకర్తలు, నద్వైహికులు(విలయులె॥ (అ.భా. వ5)

అద్వైతభాలో ఈ వివరణ చూడనగును. ఇటులను అంతయు తన విభూతియేనను విభూతి యోగాజ్ఞోపదేశము ముగించెను.

విభూతి యోగాంగము సమాప్తము.

---

## పదునొకండవ అధ్యాయము

## పంచమ విశ్వరూపసందర్శన యోగాజ్ఞము

తద్వాత అర్జునుని కోటికపై శ్రీకృష్ణుడు అతిరహస్యమైన అధ్యాత్మతత్వము – బ్రహ్మయే సంతయు నగునను యధార్థము – మాటల మూలముగా చెప్పగా అర్జునుడు తాను మాటల మూలముగా కనపర్చిన రాగద్వేషములు తనకు నశించినవి. మీరు యోగేశ్వరులగు బ్రహ్మయే. నేను యోగి నగు జీవాత్మనే, తా మంతట నిండియే యున్నారు. అందు

చేత ఈ నామరూపజగత్తు అంతయు మీరే. ఐతే ఈ దృశ్య మంతయు మీయం దెటుల నున్నదో, దాని నెటులను ధరించుచు, లయించుచు ప్రకాశింప చేయుచున్నారో నా కాశ్చర్యముగ నున్నది.

అట్టి తమ విశ్వరూపమును నా యెదుటచూపి నాకు మీ యెడల బ్రహ్మభావము విడువకుండునటులను చేయుమని ప్రార్థితుడై అర్జునునకు తన విశ్వరూపము చూపగ అచ్చెరువు నొంది విశ్వరూపప్రదర్శనములో నిటులతాను చూచినది క్లుప్తముగ వర్ణించెను. మీ దేవేశ్వర దేహమందు లేని వస్తువే నాకు కనబడుటలేదు భూతజాలమంతయు చరాచరాత్మకము మీయందున్నదే! త్రిమూర్తులను చూచుచున్నానే! అవయవములకు అంతులేదే! మీరు కిరీటముతో చక్రిగా నున్నారే! మిమ్ములను నాశరహిత నిత్యసత్యవస్తు స్వరూపముగ చూచుచున్నానే! మీ మొదలు, చివరలు కనపడుట లేదే! మీ తేజము చేతనే ఈ ప్రపంచమంతయుప్రకాశించుచున్నదే! అన్ని లోకములు మీలోనే కనపడు చున్నవే దేవతలు, మనుష్యులు, భయపడువారు, సంతసించువారు, చచ్చువారు, పుట్టువారు మీలోనే కనపడుచున్నారే! వారి! పుట్టుకలు మీ యందే నే! ఈ యుద్ధభటులు, వ్యూహములు, కౌరవ పాండవానీకమంతయు మీ దేహములో నున్నవే ! నేనున్ను, మీరున్ను అందున్నామే! భీష్మాదులప్పుడే చచ్చినటుల కనపడుచున్నారే! ఘోరరూపమున లయకారిగ మీరు కనపడుచున్నారే! అందుచే నా దేహము వణకిపోవు చున్నది. అతిభయము చెందుచున్నానే ! నేనిక నీ రూపమును

చూడలేను. దయచేసి మామూలు శ్రీకృష్ణమూర్తి రూపము చూపి యనుగ్రహింపుడు. నన్ను లాలించి స్వస్థునిచేయుడు. ఆలసించిన ఓర్చుకొనలేను. అని చెప్పగా అర్జునుని కిదివఱ కిచ్చిన దివ్యదృష్టిని తీసివేసి ఆయన యెదుటను మామూలు కృష్ణమూర్తియొక్క చతుర్భుజమానుషాకారమును ప్రదర్శించెను. అపుడు శ్రీకృష్ణుడు తన విశ్వరూపము తెలిసికొనుశక్తి నిచ్చు దివ్యదృష్టి జీవునికి వేదజ్ఞానముచేతగాని, తపస్సు చేతగాని, దానము చేతగాని, యజ్ఞముచేతగాని కలుగదు. ఇదియే నా యదార్థ విశ్వరూపము. అది చూచుట అనన్య భక్తి చేతనే (ఏకాంత బ్రహ్మ భక్తి చేతనే) శక్యమగుచు తత్త్వజ్ఞానముచేతనే(అనగా బ్రహ్మశాస్త్రజ్ఞానవృత్తిలేక జీవ బ్రహ్మైక జ్ఞానవృత్తి నిండియున్ననే) చూడగలుగును. అట్టి యోగియే మోక్షమును బ్రహ్మత్వమును జీవించి యుండగనే పొందును అందుచేత నా (బ్రహ్మ) కర్మచేయువాడున్ను, నా పరుడున్ను. నా ఏకాంతభక్తుడున్ను ఆసక్తిని (సఙ్గము లేక అనురక్తిని) పొందక బ్రహ్మేతరమెందును చూడని వీడున్ను (అనాసక్త కర్మయోగి) సర్వభూతములను నన్నేగా తెలుసుకొనునట్టివాడున్ను అగుచు నా పదమును పొందును. అనగా బ్రహ్మపదగుడగునని శ్రీకృష్ణపరమాత్మ తన విశ్వ రూప సందర్శన యోగాజ్ఞోపదేశమును, అట్టి సందర్శనము అనాసక్త కర్మయోగఫలమే నగునని భ. గీ॥ 11-5-55 శ్లోకములలో ముగించెను. చివర శ్లోకములో అర్జునుని సఙ్గ వర్జితుడగు అనాసక్త బ్రహ్మ కర్మి కిమ్మనమని చెప్పుటయే గాక అట్టివానికేగాని బ్రహ్మ పదము కలుగదనిన్ని (బ్రహ్మ

త్వము కలుగదనిన్ని) సిద్ధాంతము చేసెను. అట్టివాడు కాని వానికి అట్టి ప్రాప్తి లేదనియే సిద్ధాంతమగుచున్నది. దృష్టాంతముగ శ్రీకృష్ణుడు సంధిరాయబారిగ వెళ్ళినప్పుడు దుర్యోధనాదులు శ్రీకృష్ణుని బంధింపచూచినప్పుడున్ను విశ్వరూపమును కౌరవులకు చూపెను. ఇదంతయు మాయగారడీ యని చెప్పి దానివలన ఎట్టి లాభమును దుర్యోధనాదులు పొందలేదు. ధృతరాష్ట్రునికి దివ్యదృష్టి ప్రసాదింపబడినది. ఋష్యాదులు చూచి సంతసించిరి. భీష్ముడొక్కడే దానివలన లాభమును పొంది తన మరణకాలముగ శ్రీకృష్ణుని పరమాత్మగ తలంచుచు ప్రత్యక్షముగ చూచుచు స్వచ్ఛందమరణము నొందెను. అర్జునుడు మాత్రమే జీవించియుండగనే ఉపదేశఫలక అవగతబ్రహ్మాత్మభావుడు కాగలిగెను. ఈ రెండు వ్యూహములలోనున్న పాండవులు భీష్ముడు తప్ప తక్కిన యుద్ధభటులున్ను తక్కిన వారున్ను భగవద్గీత విషయచోదనా లాభము నొందలేకపోయిరనిభారతము చదువగా తెయుననిన్ని వేరే చెప్పనక్కరలేదు

విశ్వరూపసందర్శనయోగాజ్ఞము సమాప్తము

---

పన్నెండవ అధ్యాయము

భక్త్యైకాన్తిక భక్తి యోగాజ్ఞము

అంతట అర్జునుడు ఎవరైతే అనాసక్తకర్మయోగులో వారున్ను, భక్తియోగులున్ను, యోగవిత్తములగు మిమ్ము నన్ని విధములనున్ను ఉపాసింతురు. అందుచే బ్రహ్మాత్వము నొందుదురు. ఎవరైతే మిమ్ము నాశరహిత నిత్య సత్యవస్తు

వగు అక్షరవాచ్యునిగా నున్న నామరూప ప్రపంచములో నవ్యక్తముగ (ఇంద్రియాతీత అవ్యక్త స్వరూపునిగను) ఉపాసింతురో వారికేమి గతియని ప్రశ్నింపగా శ్రీకృష్ణపరమాత్మ ఈ క్రింది ప్రత్యుత్తర మిచ్చెను.

నా యందే ఆవేశించి (నా తత్త్వము నవలంబించిన) మనోవృత్తిని కలిగినవాడున్న అట్టివృత్తిలో నెప్పుడునుండు వాడున్న అటులనే ఉపాసించును. అట్టివారు ఆ శ్రద్ధచేతను యావత్తుయందు అట్టి పరులగుటవలన యుక్తతములే అనగా యోగోత్తములని మా మతము. ఇక నెవరైతే అక్షరశబ్ద లక్ష్యమగుమనోవాగగమ్యమైన వస్తువును లెస్సగా ఉపాసించు చుందురో అట్టి వస్తువు సర్వవ్యాప్యవ్యాపక వస్తువుగా నున్న అచింత్య వస్తువుగానున్న నశ్వర పదార్థములలోనుండి (నిత్యముగ నవస్థితముగ నుండి) అంతట నిండియుండుటచేతనున్న అచలముగ నొకేవస్తువనిన్ని, అంతను ధరించుననిన్ని అగు నని తలంచును. అన్ని ఇంద్రియముల సమూహమునున్న నియమించి అన్నిటియందు సమబుద్ధితో (అనగా ఒకేబ్రహ్మభూత బుద్ధితో, సర్వభూతహితములను రమించుచుండి నా పదమునే అట్టివాడున్న పొందును. ఐతే ఇది పై యోగ యుక్తముల యత్నముకంటె దుఃఖకరమే వీరవ్యక్తమందలి ఆసక్తి గలవారగుటను అవ్యక్త గతియగు దుఃఖమును పొంది దేహము కలవారివలెనే నన్నుగురించిన అధిక దుఃఖము పొందుదురు. ఎవరైతే సర్వకర్మలను నా యందే అర్పించి (త్యాగముచేసి) నా పరాయణులగు చున్నారో, మఱియు నవన్యమగు యోగము చేత(అనగా తాను బ్రహ్మనే యనుబుద్ధి

నను యుక్తి లేక యోగముచేత) ధ్యానమున్ను, ఉపాసన యున్ను చేయుదురో అట్టివారిని మార్జాల కిశోరన్యాయమున (పిల్లి తన పిల్లలను తానే కాపాడునటులను) జననమరణ రూప ప్రవాహ సంసార సముద్రమునుండి అతి శీఘ్రముగ దాటించెదను. అందుచేత నాయందే (బ్రహ్మయందే) ఏకాన్తిక భక్తిచేత మనోవృత్తిని ఉంచుము. దాని ఫల ముగ నా పదమును(మోక్షము)పొందుదువు. దీనికి సందియమే లేదు. చిత్తవృత్తి చంచలమగుటచేత నా యందలి గుణిని అభ్యాసముచేత నిలుపుము.

ఈ అభ్యాసయోగముచేత నా యెడల ఇచ్ఛను స్థిరీ భూత మొనర్చుకొనుము. అందుకు శక్తి లేనియెడల బ్రహ్మ కర్మపరుడవు కమ్ము. నా యర్థమే కర్మలుచేసిననుకూడ సిద్ధి పొందుదువు.అదియు శక్తియు కానియెడల కర్మ ఫలత్యాగము చేయుము. ఇటు లనాత్మను గుణించిన ప్రయత్నముచేయుము. అవివేకముచేత చేయుటకంటే జ్ఞానముతో కూడిన యోగ ముచే జ్ఞానసిద్ధియున్ను, దానికంటే ధ్యానమున్ను, ధ్యానము కంటె కర్మఫల త్యాగమున్ను శక్తికొలత బద్ధ వ్యతిరేక ముఖము ననుసరించి శ్రేయస్కరము. త్యాగమువలన చివ రకు జ్ఞానము ద్వారా శాంతి కలుగును. అందుచేత బ్రాహ్మ ణులకు (బ్రహ్మజ్ఞానులకు) సామాన్యముగ కర్మఫలత్యాగము కంటే కర్మయోగమే శ్రేష్ఠమని స్తుతింపఁబడినది. ఇది జ్ఞాన యుత కర్మే. అక్షరోపాసకులకు ఉపదేశ మేమనగా సర్వ భూతములందు ద్వేషము లేకనే స్నేహాభావమున్ను, దయ యున్ను కలిగియుండి క్షమత్వము (నాది అనుభావము)

Rg 1159 24-5-72 PAK

అహంకారము (నేను అనుభావము) లేక అభిమానముతో కూడుకొనిన భావ రూప కార్యమగు పలుకగుటచే వాటి నన్నిటిని విడిచి (రజస్తమోగుణవృత్తులను వాటి కార్యములను విడిచి) సుఖ దుఃఖానుభవములను సహించి, (వాటిని సమభావముతో ఆగమాపాయినులని తలచి శాంతమవలంబించి ఎల్లప్పుడు తృప్తి కలిగినవాడగుచు యోగియు, ఆత్మను గురించి మనోవృత్తితో తలుచు చుండువాడు నగుచు, నిశ్చయ (దృఢ) బ్రహ్మభావము కలవాడై, నాయందే వాని బుద్ధి మనోవృత్తులను అర్పించి (నిలిపి లేక లయము చేసి) నా ఐకాన్తిక భక్తుడే ఐనయెడల నా ప్రియుడే అగును. అట్టి యోగి లోకమునకు ఉద్రేకము కలుగచేయువాడు కాడు. లోకము వానికి ఉద్రేకమును కలుగచేయదు. అతడు సుఖ దుఃఖమయుడుగాక ఉద్రేకములేనివాడగుటను నా ప్రియుడే. ఏమియు నపేక్షింపక శుచిర్భూతుఁడు (శుద్ధ సత్వ గుణి) దుఃఖము లేనివాడు సర్వకర్మ ఫలత్యాగి, నా ఏకాంత భక్తుడున్ను అగునో అతడు నాకు ప్రియుడు. ఎవడైతే హర్షామర్షములు లేక, దుఃఖితుడుగాక, ఏ కోరికలను కోరక, శుభాశుభములందనురక్తి వాటిభావము పొందక నుండునట్టి నా భక్తుడగునో అట్టివాడు నా ప్రియుడే. శుభాశుభములు, తుల్యాతుల్యములు, నిందాస్తుతులు, అగు ద్వంద్వములందు మౌనియై, సంతుష్టుడై, ఎక్కడను స్థిరముగనుండక నా ఏకాంతభక్తియందు సుస్థిరుడైన అతఁడు నా ప్రియుఁడే. ఎవడైతే ఈ ధర్మమును అమృతమును (మోక్షమును లేక బ్రహ్మను) పైన చెప్పినటుల యథార్థముగ శ్రద్ధతో (అనగా

అంతటను బ్రహ్మను (స్పృశించుచు) నా పరుడగునో అట్టి వాడు అతిశయమైన నా ప్రియుడు లేక ప్రియతముడు అని ఐకాన్తిక భక్తియోగస్తుతిని భ. గీ. 12అ 1-20 శ్లో॥లలో చేసి అనాసక్తకర్మాఙ్గ ఏకాన్త భక్తియోగాఙ్గోపదేశమును ముగించెను. ఇటులననాసక్త కర్మయోగాఙ్గములగు 1. జ్ఞాన విజ్ఞాన యోగము, 2. బ్రహ్మాక్షర నిర్దేశయోగము, 3. రాజవిద్యా రాజగుహ్యయోగము, 4. విభూతియోగము, 5. విశ్వరూప సందర్శనము, 6. భక్తియోగమునను ఆఱు అఙ్గములు అనాసక్తిచేత ఎటుల విశ్వరూపోపాసన బ్రహ్మకర్మకులకు కర్తవ్యమో ప్రదర్శించెను.

ఈ విశ్వరూపోపాసన హృదయమును ఈ 28వ మహా యుగములోనే త్రేతాయుగములో, రానున్న ద్వాపర యుగములో 16వ అవతారమగు శ్రీకృష్ణపరమాత్మ అర్జునునికి చెప్పనని, శ్రీవశిష్టమహర్షి శ్రీరామునకు యో.వా.ముముక్షు ప్ర. సర్గ 53-శ్లో. 37, 38, 40,-43, 45, 47.53లలో తన దివ్యదృష్టితో (భేద దృష్టిచేత) తెలుసుకొని బోధించెను. రానున్న శ్రీకృష్ణబోధవివరము శ్రీవశిష్ఠమహర్షి ప్రోక్తము:-

చతుర్భుజాకారమగు నన్నే పూజించి మనస్సు శుద్ధమైన పిమ్మట విజ్ఞానైక స్వభావమగు బ్రహ్మము శుద్ధమని తలంచుచో జీవేశ్వరుల తత్త్వము తత్త్వం పదార్థములలో శోధించి ఏకరసమగు నఖండపరిపూర్ణాత్మను గ్రహించి నాశ్రయింపుము. ఇటుల నేను 'అహం' అని నా విభూతిని చెప్పియే యుంటిని. చెప్పునప్పుడు నే నామాయావస్తువుల అధిష్ఠానము అగు ఆత్మ తత్త్వమునే సూచించితిని అని తెలియుము' మఱియు

నీవు నేను పైన చెప్పిన ఉపదేశ ప్రభావమున పరమ పద మున సంపూర్ణ విశ్రాంతి నొందితినని తలంచుచుచో ఈ కలలన్నియు తొలఁగినచో సత్యముగు నేకాత్మయందు వెలయు దువు. ఇటులనే నీవు వెలయుము. నీవు యోగయుక్తుడవును, సర్వసమత్వ బ్రహ్మలేక ఆత్మసన్నుడవును కమ్ము. అనగా సర్వభూతములందున్న నన్ను, (ఆత్మను) నాయందు (ఆత్మ యందు) సర్వభూతములనున్ను గాంచుము. ఇటుల, నేకత్వ దృష్టితో సర్వభూతములందు నాత్మను గాంచుచున్నటు లైన పునర్జన్మరహితుఁడవే నీ వగుదువు. సర్వశబ్దార్థము ఏక త్వము. ఏకత్వమన ఆత్మే అని ఏకత్వం సర్వ. శబ్దార్థ: ఏకశబ్దార్థ ఆత్మనః । ఆత్మోపిచ నసన్నాసద్గతో యస్యాశు తస్య తత్॥ (సర్గ58-శ్లో 45) ప్ర॥ చెప్పుచున్నది. మఱియు అది సత్తనబడు స్థూలభూతములున్ను అసత్తనబడు సూక్ష్మ భూతములున్నూ కాదు.

అది అనుభవ ముహూర్తమున నే పొందబడుచున్నది. ముల్లో కము లందు(స్థూల,సూక్ష్మకారణములందు)ప్రకాశించు'నేను' అనునది వాటిని ప్రకాశింపచేయుచు 'నేను' అని తోచునటుల చేయునదే ఆత్మ యగును. ఏ సూక్ష్మానుభూతి అంతరమున సర్వ శరీరములలోను వెలయుచున్నదో, ఎయ్యది విషయముల కూడికలనుండి ప్రకాశింప అత్యంత సూక్ష్మమై వెలయు చున్నదో ఆ యాత్మయే సర్వవ్యాపియై తనయందున్న ఉన్నది. బ్రహ్మాది స్తంబపర్యంతము (బ్రహ్మమొదలు గడ్డిపోచవఱకు) వెలయుపదార్థములన్నియున్ను, ఏ నిర్వికారాత్మయందు కల్పితములో అద్దానినిజ్ఞాను లై కాంతిక భక్తిచే జన్మరాహిత్య

మునకై (పరిణామ రాహిత్యమునకై) ఉపాసించుచున్నారని ఎఱుగుము. అటతీతి ఆత్మా అని వ్యుత్పత్త్యర్థము. ఇదియే అహమునకు (అనగా అహంకారవృత్తి లేక దేహాది సంఘాతమే ఆత్మయను తుచ్ఛాహంభావమునకు) అహము లేక దాని మూలమగు సర్వాహంభావము అగుచున్నదని అర్థము

తే. గీ. స్వప్రకాశ చైతన్యమె సంవిదాత్మ
సాధనాధికృతునకు వాసనయు దేహ
మాద్యహాముమయ చైతన్య మదియునహము
నకహముఁ దప్ట లక్ష్యమానాత్మ బ్రహ్మ॥

కం॥ జ్ఞానాత్మయెనిత్య దృ
ష్టానాత్మత్రిపుటె; బ్రహ్మ ననెడి వృతినె ఆ
త్మానన్య శేషి బ్రహ్మ యు
నే నిర్వచియించు జీవుని ఉపనిషదులున్.

అ. భా. 1 వర్ణకం కృతినిర్ణయము

ఇటుల నహమాత్మ అహంకారమే; అనగా అధ్యాస వృత్తియే. ఇంక దాని కహమన్నయెడల అనగా అహంకార వృత్తి కహమన్నయెడల దానికి సాక్షియగు అహమగును. అహంభావము మూడు విధములు—1. దేహేంద్రియాది సంఘాతమే ఆత్మలేక అహమనుతుచ్ఛాహంభావము. ఇదియే అధ్యాసవృత్తి లేక అహంకారవృత్తి. దీనికంటె శ్రేష్ఠమగు నది 2. శుభాహంభావము. అనగా దేహాది సంఘాతములో ఒక వెండ్రుకయొక్క నూఱవభాగముకంటె సూక్ష్మతరముగ నున్న జీవుడు లేక స్వప్రకాశ జ్ఞానస్వరూపుడగు చిత్ లేక

ఆత్మ అహమను శుభాహంభావము రెండవది. 3. ఈజీవుడు సర్వాత్మయను అహంభావము లేక సర్వాహంభావము మూడవది. ఇటులనహామునకు (అహంకారవృత్తికి)మూలము అహము సర్వాహంభావము లక్ష్యమగును. ఇటుల నీ అహమును సాధన చతుష్టయసంపన్నుడు తెలుసుకొనును. ఇదియే లక్ష్యప్రమాణమగు నిత్యసత్య దృష్టయు,ఆత్మయు,బ్రహ్మయు నగుచున్నది. ఇదియే 'చిత్' లేక స్వప్రకాశ జ్ఞానస్వరూపమగుచు వ్యవహారావస్థలో అహంకార విషయ భాసమాన వ్యవహర్త లేక చిదాత్మ (ప్రత్యగాత్మ) యగుచు శోధించి తెలుసుకొన్నవానికి సాక్షిగా ప్రకాశించుచున్న స్వప్రకాశ జ్ఞాన స్వరూపాత్మయే అగుచున్నది.

ఇటుల పైమూడు అహంభావములున్ను వృత్తులే అగుచు 1వ అహంకారము దానికిమూలమగు అవిద్యతో నశించిన సమకాలములో 3వ సర్వాహంభావముస్ఫురించి తురీయస్థితిలో అప్రమ లేక బ్రహ్మలేక ఆత్మగ అఖండైక రసమగుచున్నదని మహోపనిషత్ చెప్పుచున్నది. మఱియు "ఆత్మైవేదంబ్రహ్మ' 'అయమాత్మాబ్రహ్మ' ఉపనిషత్ ప్ర॥ చూడుడు. "న దృష్టేర్ద్రష్టారం పశ్యేః"నవిజ్ఞాతే ర్విజ్ఞాతారం విజానీయా (బృ 5-4-8) అను ప్ర॥ స్వప్రకాశ జ్ఞానస్వరూపాత్మయే దృష్టయనిన్ని జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అను త్రిపుటి సుషుప్తిలో సంస్కారముగనుండి తురీయములో నశించుటచేత అనాత్మలేసనిన్ని జ్ఞాత ఆపేక్షిక దృష్ట మాత్రమేనని న్ని, ఆత్మయేబ్రహ్మయను వృత్తిమనోవృత్తిఅయిన సమకాలములో బ్రహ్మ ఆత్మగానే అనన్యశేషిగ మిగులును అనిన్ని చెప్పు

చున్నది. యోవా ముముక్షు స. 53-55,60,62-66 లు. శరీర ములన్నిటియందు అహమహమికతోచు చిదంశమేనేను. జడ ములగు సుఖదుఃఖములు, అందుచేత ఎవరినిలేక దేనిని మోహపెట్టును లేక బంధించును? దేహేంద్రియాది విషయములు నేనుకాదు అని నేను నుడువునదిగూడ అద్దమున ప్రతిఫలించు పదార్థములను నిషేధించి అద్దమునే నిరూపించుచువిభావో క్తి వంటివి అని గ్రహింపుము. అన్నియు నశించినను వాటినాశ మునకు నేను సాక్షినే. అద్దమువలె స్వచ్ఛస్వభావుడను. అవ్య యుడను. సర్వాత్మకుడను అని నన్నెరుగుము. మరియు సర్వ భూతములందు ఎవడేకాత్మను చూచుచుండునో తరంగము లందలి జలరసమే, స్వర్ణాభరణములందు బంగారమే ఎవడు చూచుచుండునో అట్టివానివలెనే నీవును ఈద్వైతముగా నుండు జగత్తునందు ఒకే ఆత్మను జ్ఞానయుక్తైకాంతిక భక్తి తో గాంచుము. ఈనామరూపపృథక్కరణమునుచూచి మోహపడకుము. ఇటులనీవేరువేరు వస్తువులలో (పృథక్కరణము లో) ఏకత్వము (ఒకేబ్రహ్మ) అనుస్యూతముగనుండి అన్ని టినిన్ని చేతనము చేయుచున్నదని తెలుసుకొని సమరసభావ ముచేత జీవన్ముక్తుడు చరించుచుండును. అట్టివాడే విశ్వరూ పోపాసన ఫలకి పరమాత్మ లబ్ధిని పొందుచున్నాడు. ఇదియే 1. భావాద్వైతము. 2. ద్రవ్యాద్వైతము. 3 క్రియాద్వైతము గా నెరుగుము అను బోధయగుచున్నది. ఈక్రింది "తత్త్వ మసి" మహావాక్యములోని తత్పదార్థ ఉపాస్యనిష్ఠా నిర్వచ నము జగత్తంతయు బ్రహ్మమేయని చెప్పుచున్నది.

తే॥ శ్రీ॥ దృశ్యజగము పూర్వాపరా దృగది దృశ్య।

తాద్వైతయు సదానందమె తత్పదమగుఁ;

అ. భా. 1. వర్ణ- కృతిపతి నిర్ణయం.

మనకు కనబడు నీ నామరూపప్రపంచము కలుగక పూర్వమున్ను, ప్రళయానంతరమ్మున్ను 'దృక్' స్వరూపమే (అనగా నిర్గుణబ్రహ్మ లేక దృశి) దృశ్య నామ రూప ప్రపంచాకారముగ (ప్రకాశనముగ) వివర్తమగు సత్ (వునికి) యగు వస్తువున్ను ఆనందస్వరూప వస్తువున్ను సకారణికమున్ను లేక చేతనము కలుగచేయు వస్తువుగనున్ను అగుచున్నది అది తత్ పదార్థమని పారిభాషికముగ బ్రహ్మశాస్త్రములో చెప్పబడుచున్నది.

అందుచేత తత్పద లక్ష్యార్థము సత్ పదార్థమున్ను, ఆనందస్వరూప వస్తువున్ను అగుచున్నది. ఇటుల నీ తత్పదార్థమే వ్యాప్య వ్యాపకరూప బ్రహ్మయని చెప్పబడుచున్నది. అందుచేత అనాసక్త కర్మయోగి ఈ తత్పదమే (సమిష్టి జగత్తు లేక వివర్తబ్రహ్మ మనియు, వ్యష్టి జీవగత త్వం పదమున్ను నిరుపాధిగను, ఔపాధికముగ నగునని) ఈ క్రింది రెండు పద్యములలో చెప్పబడినటులను తలంచుచుండును.

తే.గీ. ఈ జగత్కార్య చిహ్ననుమితిగఁ గారణావసాయి తటస్థమునైన లక్షణమును, ఆనందరూపము నైన రాముఁ బ్రహ్మఁ జిన్మాత్రుఁ బ్రజ్ఞనుఁ బ్రస్తుతింతు॥

కం. పురుషాంత ర్బహిరాత్మయె
నిరుపాధ్యౌపధిక జీవని తెలియగనగుఙ్ ।

-పురిశాయిగ సర్వానుభ
వరుచియుఁజ్ఞమె భా! చిదాత్మవాచ్యా! రామా॥
( అ. భా. వర్ణ 1 – కృతినిర్ణయం

ఓ శ్రీరామా! ఈ జగత్తుకు పరము కారణికమున్న తటస్థముగ నుండి ఆనందమే స్వరూపముగనైన బ్రహ్మన (తత్పదార్థమైన) వానిని ధ్యానించెదను. తత్పద నిర్వచనము పైన చెప్పబడియే యున్నది. త్వం పదము అనగ వ్యష్టి జీవ నిలో అంతరముగ నిరుపాధిబ్రహ్మగనున్న, ఔపాధికముగ జీవుడుగనున్న దృశిమాత్రి కర్మానుభవము పొందుచు జ్ఞాన రూపముగనున్న త్వం పదార్థమై వ్యష్టిగతముగనున్న ఉన్న దని చెప్పబడుచున్నది. తత్ =(త్ +అ+త్ ) దీనిలత్యార్థము పైన చూడనగును. ఈ అక్షరములో "త్" వాయు బీజము అధిదేవత ధనదుడు. ఫలము ధనధాన్యాది లాభము. "అ" వాయుబీజము. అధిదేవత బ్రహ్మ. ఫలము మృత్యుంజయము (మోక్షము) ఇటులను తత్పద ఉపాస్య నిష్ఠాదేవత బ్రహ్మ ఫలము మోక్షమే. అందుచేత ఈ ఉపాస్య షడాధ్యాయి సగుణము ద్వారా నిర్గుణపరమే యగుచున్నది.

అనాసక్త కర్మయోగైకాంతిక భక్తియోగాజ్ఞోపదేశము
సమాప్తము.

తత్పదార్థ ఉపాస్యనిష్ఠావిశ్వరూపోపాసన (బ్రహ్మస్పర్శ)
ప్రధాన మధ్యమ షడాధ్యాయి (ద్వితీయ షట్కాఙ్గము)
సమాప్తము.

# తృతీయ షట్కము

త త్త్వం పదార్థైక్య రూప వాక్యార్థనిష్ఠా అసిపదార్థ
సమ్యగ్ధీ ప్రధాన షడధ్యాయి
చరమ షట్కాఙ్గము
పదమూడవ అధ్యాయము
ప్రథమ ప్రకృతి పురుష లేక క్షేత్ర క్షేత్రజ్ఞ
విభాగయోగాఙ్గము

1. శీర్యతే ఇదం, శరీరమ్=నశించునదే శరీరము. దేహం=దహ్యతే ఇతి దేహం; దహింపబడునదే దేహము. క్షేత్రః = క్షతత్రాణాత్ క్షయాత్ క్షరణాత్ క్షేత్రవత్, అస్మిన్కర్మ ఫల నిర్వృత్తేః క్షేత్రం శరీర మిత్యర్థః; అనగా క్షేత్రమనగా శరీరమే. 3. క్షేత్రజ్ఞానిరేవ క్షేత్రస్యజ్ఞః, క్షేత్రజ్ఞః రెండవ భాగములోని మొదటి అఙ్గములో (7వ అధ్యాయములో) ప్రకృతి పురుషులు లేక ప్రకృతి ఈశ్వరులు నిరూపింపబడిరి. మఱియు సత్త్వ రజస్తమో గుణాత్మక భిన్నమనిన్ని. అది అపరము అనగా పరమాత్మగాని ఇతరమనిన్ని, సంసార కారణమగుటను జీవాత్మ భూతమున్ను, క్షేత్రక్షేత్రజ్ఞేశ్వర లక్షణమున్ను అగు నీశ్వరాత్మికయనిన్ని, సరస్వతీ రహస్యోప 11 ప॥ చే తెలియవలెను. ఈ అధ్యాయములో 1. క్షేత్రము. 2. క్షేత్రజ్ఞుడు, 3. ఈశ్వరుడు. 4. సంన్యాసి, 5. జ్ఞానము అను ః దార్థములలో 1. ప్రకృతిపురుష శథ క్షేత్రజ్ఞ క్షేత్రములను గురించియే అగుచున్నది. అని నిరూపింపబడుటవలనను ప్రకృతి పురుషులు సత్పదార్థము లేక

'చిత్' యొక్క ఛాయ చిచ్ఛాయ ప్రతిబింబిత కార్యములగు ప్రకృతి క్షేత్రము పురుషుడు లేక క్షేత్రజ్ఞుడు(ఈశ్వరజీవులు) అగుటను, రెండును సరస్వతీ రహస్యోప॥ 11.ప్రమాణముచేత ప్రకృతిత్వమే నని నిరూపింపబడుచున్నది. 2. ఇదం అనగా ప్రత్యక్షాది ప్రమాణములలోనుండు యావత్తు స్థావరజంగమ ప్రపంచము. ఇదియే దృశ్య నామ రూపమని చెప్పుదురు. 3. పైనచెప్పబడినటులను నశించునదే శరీరము.అది (1)స్థూల సూక్ష్మ (2,3)కారణములుగా నున్నది. 4. ప్రకృతి సహాయ భూతములు—1. అహంకారము, 2. బుద్ధిఅగును. వికృతులు మహదహంకార పంచతన్మాత్రలు. ఇవి ప్రకృతి సహాయ లగుచు ప్రకృతికార్యమను శబ్దముచేత చెప్పఁబడుచున్నవి. జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియపంచకము మొత్తము దశేంద్రియములున్ను, మనస్సున్ను కరణములని చెప్పఁబడు చున్నవి. ఇంద్రియ గోచరములు శబ్దస్పర్శ రూప రస గంధ ములు, 5. విషయములు కలిపిసాంఖ్య శాస్త్రజ్ఞులు వివిధ ములుగ 24 తత్త్వములు స్వకార్యకరణములగుచున్నవని చెప్పుదురు. మఱియు శరీరములు 3+అహంకారము 1+బుద్ధి 1+వికృతులు 7+ప్రకృతి 1+జ్ఞానకర్మేంద్రియములు 10+ మనస్సు 1+ఇంద్రియ గోచరములు 5+విషయములు 5+ పంచప్రాణములు 5 అనియు విభజించి చెప్పిరి. ఇటులను క్లుప్తముగ సాంఖ్య శాస్త్రములో 24, జీవునితో 25, ఈశ్వరు నితో 26, ఇకను 32, 96 తత్త్వములుగను దేహాది సంఘా తమును విడదీసి చెప్పిరి. ఈ 90 తత్త్వములు పైంగల వరాహ ఉపనిషత్తులలోనున్ను, చెప్పబడుచున్నవి. వీటిని 96న్ను

మాచేత రచిత అద్వైతభా కృతి నిర్ణయములోనున్న చూడ నగును. సరస్వతీ రహస్యోప 11 ప్రి॥ చిచ్ఛాయా ప్రతిబింబిత ప్రకృతిత్వమే. 1 పురుషుడు(ప్రకృత్యవచ్ఛిన్నుడు) 2. ప్రకృతి అగునని చెప్పబడి యున్నది. 7వ అధ్యాయములోనున్న చూడనగును. ఈ ప్రకృతి లేక మాయాశక్తి క్రింద వివ రింపబడుచున్నది.

తే.గీ. పద విజృంభియు త్రైగుణ్య పర యిరు వృతు।
లేడు వికృతులు నేకాదశేంద్రియములా।
నరగ షణ్ణవతియు జవ్వనయ్యు మాయ।
చతుర భూషితకబ్బ మీశ్వరుని వాక్కు॥
(అ.భా. 1 వర్ణకం కృతినిర్ణయము)

పదముల స్వరూపముగ తన విజృంభణమును, సమాసముల యొక్కయు వానియర్థములయొక్కయు, స్వరూపమగు వాక్యలు గ్రంధములు వీటి మూలముగనే బయలుపడుచుచుండు బ్రహ్మశక్తి(సత్త) యే మాయలేక అవిద్యాశక్తిగ పారిభాషి కముగ "గుణా" అను శబ్దితమగుచు అనగా ప్రకృతియు లేక త్రిగుణాత్మకయు దాని కార్యమగు మహదాది విరచిత రూ పకార్యకరణ సంఘాతము లేకదేహేంద్రియ సంఘాతమున్న అగుచు రెండువృత్తులు-ప్రమాణము, ప్రమేయము లేక ప్రవృ త్తి,నివృత్తి అను వృత్తులున్న,సత్వరజస్తమోగుణములున్న, పంచ జ్ఞానేంద్రియములున్న, పంచ కర్మేంద్రియములున్న, అన్తఃకరణము లేక మనస్సు,అను పదకొండు సూక్ష్మతత్వము లున్న,వేడు వికృతులున్న(మహదహంకార పంచతన్మాత్రలు)

తమోగుణమువారె లెక్కవగనున్నందున బుద్ధివలెను పరమాత్మ వివర్తములేక జడపరివర్తనభావము నొందిన తత్త్వాత ప్రకృతి సూక్ష్మ స్థూలరచన త్రివృత్కృతాది ఫలముగ మొత్తము 96 అవయవములతో నొప్పు అవయవి(మాయాశక్తి)ధర్మార్థ కామమోక్షములనుఆశ్రితులకుప్రసాదించుచు అట్టిభూషితురాలగు నీకబ్బముకూడ ఈశ్వరునివాక్కగు గ్రంథమగుటను ఈశ్వరుని (పరమాత్మయొక్క) అనన్యశక్తియేఅగుటను ఈశ్వరుని వాక్కు లేక ఈశ్వరుని లేక పరమాత్మను తెలుసుకొనినదే లీనమగునని అర్థము. ఇటుల నీశ్వరానన్యశక్తియే అద్వైత భారూప కన్యకాగా విచారించిన (అనగా తరచిన) క్షేత్రము లోనుండి సాక్షిగ దానిని తెలుసుకొనుచుండువాడు క్షేత్రజ్ఞుడు లేక క్షేత్రవిషయాకారిగ వ్యవహర్త (కర్తయు భోక్తయు) అగుచున్నాడు. వీనికే పరిజ్ఞాత లేక జీవుడు అనిపేరు. ఐతే యుక్తిచేత క్షేత్రమగు దేహాది సంఘాతమును విడదీసిన క్షేత్రజ్ఞుడు బ్రహ్మగానే సాక్షిగ మిగులుచున్నాడు. లేక అసఙ్గుడుగా స్వప్రకాశ జ్ఞానస్వరూపుడుగ నున్నాడు. అనిన్ని (ఆత్మానాత్మవిచారము చేయనిదే ఈ బ్రహ్మజ్ఞానము కలుగదు.)అటుల విచారింపక సంసారమను నూతిలో జీవుడు పడుచున్నాడని శ్లో॥ సర్వాన్ కుశాగ్రిణి తథోదపానం జ్ఞాత్వా మనుష్యా పరివర్జ్యన్తి। అజానతస్తత్ర పతన్తి కేచి జ్ఞానేఫలం పస్య యథావిశిష్టం॥ భా. శాం. మోక్ష 201-16 అనుప్రమాణముచే నూయి దర్భలుచేత కప్పబడినందున అందులోని పాములు మొదలగువాటిని తెలియక దృగ్భలనేనమ్మి

వెళ్ళి అందులోపడి మనుజుడు చచ్చునటుల నేత్రమన్ను(ఆత్మను) కప్పియున్న విషయములాకారము లను పొంది దేహాది సంఘాత మను నూతిలోని జననమరణ ప్రవాహరూప సంసారములో అజ్ఞానియగు జీవుడు ఆత్మానాత్మ విచారకుశలుడుగానందున పడిపోయి ఆత్మహత్యా ప్రాప్తిని పొందుచున్నాడు. ఇటుల నతఁడు ధర్మాధర్మానుష్ఠానుడై, ఇచ్ఛాద్వేష మనోవృత్తి రూపుడై, భ్రష్టుడగుచున్నాడు. క్షేత్ర క్షేత్రజ్ఞ విశిష్ట జ్ఞాని బ్రహ్మైక్యము నొందుచున్నాడు. ఇచట విశిష్టజ్ఞత్వ మనగా అన్నిటిలోను కూడియుండి తెలుసుకొను చుండుట అని అర్థము. ఇఁకను ప్రకృతి (క్షేత్ర), పురుష (క్షేత్రజ్ఞ) విచక్షణ జ్ఞానవృత్తి ఈశ్వర తత్త్వ నిర్ధారణమేకాగా ఈ క్షేత్రక్షేత్రజ్ఞవిభాగములేక ప్రకృతి పురుష విభాగము అను అధ్యాయము ప్రాధాన్యము నొందుచున్నది. 12 అధ్యాయ ములో సంకల్ప సంన్యాసము (త్యాగ యోగము ఎటులను చేయనగునో చెప్పబడినదిగాని,ఏతత్త్వజ్ఞానముచేత అనాసక్త కర్మయోగి ధర్మాధర్మకర్మములచే కొట్టుబడక భగవంతు నికి ప్రియుడగునో చెప్పబడలేదు. అది ఈ యజ్ఞములో వివ రింపబడుచున్నది. ఇటుల నజ్ఞానియగు యోగి ఆత్మానాత్మ విచార ఫలముగ క్షేత్రక్షేత్రజ్ఞతత్వ జ్ఞానము తెలుసుకొన్న వాడున్ను, బ్రహ్మ పదగుడున్ను అగుచున్నాడని పై ప్రమా ణముచేతనే సిద్ధించు చున్నది. మఱియు ప్రకృతియొక్క ఘటనాఘటన శక్తియున్ను తెలియబడుచున్నది. ఇట్టి విచక్షు కత్వ బ్రహ్మజ్ఞానమే ఋష్యాదులచేత వేదాంతములలోనున్ను పణ్డితులచేత బ్రహ్మ సూత్రములలోనున్ను, వాటి భాష్య

వ్యాఖ్యానములలోనున్న తర్కమూలముగ చర్చింపబడినది అని "ఋషిభిర్బహుధాగీతం ఛందోభిర్వివిధైః పృథక్ ॥ బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతు మద్భిర్వినిశ్చితైః॥ భ. గీ. 13-4 ప్రి. ఉన్నది. అనాసక్త కర్మయోగ ఫలముగ చిత్తశుద్ధ మున్ముఖముకాగానే యుక్తిచేత సంసార మర్మమెరిగి, ఇంద్రియార్థములందు ఇంద్రియములు చరించుచున్నవనుమతితో (గుణా గుణేషు వర్తన్త ఇతి మత్వా) అది ప్రకృతి కార్యమే నని యున్న పరిజ్ఞాత గుణముల వశ్యుడై ప్రాకృతిక కార్యములను చేయుచున్నాడనియున్న న్యాయముగ శుద్ధజీవుడు సాక్షీభూతముగనే సర్వేంద్రియములలో ప్రకాశించుటచేత, సన్నిధిని చేతనమగు దేహాది సంఘాతమే కర్మచేయుచు, నది నశ్వరమగుటను క్షేత్రమనబడును అనిన్ని, క్షేత్రమును తెలుసుకొనుచున్న వాడు క్షేత్రజ్ఞుడనిన్ని అతిసూక్ష్మముగ బుద్ధిలో నంతరముగ నీ క్షేత్రజ్ఞుడున్నాడనిన్ని క్షేత్రజ్ఞుని ప్రకృతియే నిగూఢముగ కప్పియున్నదనిన్ని, విభక్తములేకపృథక్త్వమగునన్నిటిలోను ఏకముగానేఈ క్షేత్రజ్ఞ స్వరూపపరమాత్మ యున్నాడనిన్ని ఆ భూతముల ధర్మాధర్మ చరణ ఫలముల ననుసరించి వారికి సాపేక్షముగనే జననమరణ ప్రాప్తి కలుగ చేయుచు ఈశనశీలుడై యున్నాడనిన్ని, ఇటులను జ్ఞేయ వస్తువును తెలుసుకొను తెలివియే జ్ఞానమనిన్ని అగు జీవ బ్రహ్మ విశేషజ్ఞానము (విజ్ఞానము) చేతనే నా(బ్రహ్మ)భావ మెఱుగువాడు బ్రహ్మభావుడే అగును. ఇటులను ప్రకృతి పురుషులు అనాదులే. అందుచేత యావత్తు వికారములు (గుణములు) ప్రకృతి కార్యములే, ఈ ప్రకృతియే కార్య

కారణ సంఘాతమును సృష్టించి జీవుడు సుఖదుఃఖభోక్తయగుటకు కారణమగుచున్నది. పురుషుడు (క్షేత్రజ్ఞుడు) ప్రకృతి (క్షేత్ర) వశుడై గుణసక్తి (అనురక్తుడు) అగుటచేత సుఖదుఃఖములనుభవించుచుండి తిరిగివాడు సాక్షిగ ఉపద్రష్ట లేక అనుమంత అయిన భర్తయు భోక్తయు, మహేశ్వరుడున్ను, పరమాత్మయున్ను, దేహములో (పురిలో) నున్న, పురుషుడున్ను అగునని యుక్తి చేతనే తెలుసుకొనఁ బడుచున్నాడు. అట్టి జ్ఞాని యగు పురుషుడుగుణములలో నున్నను తిరిగి జన్మ ఎత్తడు. కొందఱు ధ్యానము చేతను కొందఱు కామ సంన్యస్తసంకల్ప ,కర్మఫల త్యాగముచేతను ఇతరులు కర్మయోగముచేతనునూ్న నన్ను(పరమాత్మను)పొందుదురు.

ఇతరులు ఇతర దేవతలను సేవించి చచ్చుచు, పుట్టుచు నుందురు. ఈ పుట్టు స్థావరజంగ మాత్మకమంతయు క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగము చేతనేనని తెలుసుకొనుము. ఈ రెంటియొక్క బీజమునుపరమాత్మనైన నేనే ప్రసాదించుచున్నాను అని సరస్వతీ రహస్యోప 11 ప్ర. తెలుసుకొనుము. సర్వభూతములందును సమత్వముగ నున్నట్టిన్ని జనన మరణాత్మకమగు వాటిలో నిత్యసత్యముగ నున్నట్టిన్ని వస్తువు నెవడు ఇటుల తెలుసుకొనునో వాడే (అనగా ఆత్మను అనవస్థితము (నశ్వరము) అగు శరీరములో అవస్థితమని (నిత్యముగ మిగిలియుండు సత్యవస్తు వున్నదని) తెలుసుకొని అసక్తము లేక సముత్థానము (ఆత్మా నాత్మ జ్ఞానము) కలిగినవాడు జ్ఞానియగును. అని కఠోపనిషత్తు మైత్రాయిణ్యుపనిషత్ చెప్పు చున్నది. అ. భా. 9లో

చూడుడు. అటుల చూచుచున్న (తెలుసుకొనుచున్న జ్ఞాని) మనస్సుచే తనంతట తానే చూచుచు పరమాత్మ పదమును (కపి కిశోర న్యాయమున) పొందును. ప్రకృతియే ఈ కర్మ లన్నియు దేహాది సంఘాతము ద్వారా చేయునని ఎఱుగుము. అటుల తెలుసుకొన్నవాడే జ్ఞాని.

పురుషుడు క్షేత్రజ్ఞుడు, అనాదియు నిర్గుణుడును, పర మాత్మయును అవ్యయుడున్ను అగుటచేత అతడు శరీరములో నున్నను,కర్మచేసినట్లున్నను అకర్మియే(కర్మబద్ధుడు కానివాడే). 1. అమానిత్వము, 2. అదంభిత్వము, 3 అహింస 4. క్షాన్తి (క్షమ) 5 ఆర్జవము (ఋజువర్తన,) 6. ఆచార్యోపాసన, 7. శౌచము, 8. స్థైర్యము, 9.ఆత్మవినిగ్రహము, 10. ఇంద్రి యార్థములందు (విషయములందు) విరక్తి, 11. అహంకార కార్యవేగ రాహిత్యము, 12. జన్మ, 13. మృతి, 14. వార్ధ క్యము, 15. రోగము, 16. దుఃఖము. (12-16 ల యందు దోషత్వము కనుగొనుట. 17. అసక్తి, అననురక్తి, (అనగా కామసన్న్యాసకర్మ సంకల్పఫలములను బ్రహ్మయందుఅర్పించి ఒకే బ్రహ్మస్పర్శసేత) 18. పుత్రదారాదులందు అనభిష్వం గము (నిరభిమానము), 19 ఎల్లప్పుడున్ను సమచిత్తత్వము, 20. ఇష్టానిష్టములందు సమభావము, 21. నాయందు అచ లమయిన (ఏకాంత) భక్తి, 22 తన మనస్సు అనుగుహాలో నున్న ఆత్మభూతముయొక్క ఏకాంతసేవ (వివిక్తతలసేవ) 23. ప్రాకృతుల స్వభావముచే అనుసరించువారి సమూహా సంగమం దనురక్తి, 24. అధ్యాత్మజ్ఞానము ఎప్పుడు కలిగి యుండుట. 25. యథార్థ జ్ఞానార్థ దర్శనము ఇవన్నియు

జ్ఞానమని చెప్పబడుచున్నవి. అందుచేత ఇది జ్ఞానేతరులకు జ్ఞానాంగములనిన్ని చెప్పబడుచున్నవి. ఈ బ్రహ్మ సత్తుకాదు. అసత్తుకాదు. అంతయునున్న సింపి కబిడీకృతమైనదే. అది అన్ని జ్యోతులను వెలిగించు జ్యోతి. (ప్రచండజ్యోతి లేక ప్రదీపము) క్షేత్రమును ప్రకాశింపచేయుచున్న సూక్ష్మాతిసూక్ష్మ స్వప్రకాశవస్తువే. సర్వత్ర వ్యాపకము అగుటచేత ఆత్మయనబడుచున్నది. ఇటులను క్షేత్ర క్షేత్రజ్ఞ జ్ఞానము తెలిసిన జ్ఞాని ప్రకృతియందగు భూత సూక్ష్మగతిని ఆ జ్ఞాననేత్రముచేత తెలుసుకొని నా (బ్రహ్మపదమును) పొందును అని శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునికి ప్రకృతిపురుష విభాగ(క్షేత్ర క్షేత్రజ్ఞ) యోగాజ్ఞను చెప్పుచు 27 వ శ్లోకములో విశ్వగగ్రష్ఠ పరమాత్మోపదేశమునున్న చెప్పి భ. గీ. అ 13-12-34లలో ఈ అజ్ఞోపదేశమును ముగించెను.

విశేషాంశములు:—ఈ అజ్ఞములో (1) వివిక్తతలసేవ, 2. అననురక్తి అనువాటియొక్క విశేషవివరణ అ భా.9-10 వర్ణకములలో చూడనగును. అమానిత్వాదులు "స్వతఃప్రోద్భవా దమా నాద్యం సాధన మితరేషాం" (సి. సూ 4-4-9) "నాన్తరుత్ప్రవణమనానుశ్రవికాణామ్ (సి. సూ 4-2-21) అను ప్రలచే కర్మయోగము (అనాసక్త కర్మయోగ) ఫలము గానే చిత్తశుద్ధ్యున్ముఖముకాగానే అమానిత్వాది 25 గుణములున్న అంతరమున వాటంతటవి పొడసూపునని, అవి పొడసూపుచుండగానే మహావాక్య విచారప్రారంభము చేసి జ్ఞానవృద్ధి చేసుకొనవలయుననిన్ని, అటుల పొడసూపనివారికి అవి కలుగుటకు అనాసక్త కర్మయోగమే శర

ణ్యముకాగా నవి జ్ఞాన సాధనములగుచున్నవనిన్ని, సిద్ధాంత మగుచున్నది. ఈ జ్ఞాన సాధనలవలననే ఈశ్వరుని(పరమాత్మ) లేక (బ్రహ్మ) తత్త్వము శోధింపవలయును· ఈశ్వర తత్త్వ మవాఙ్మనోగోచరమగుటను వ్యతిరేకముఖముగ- శ్లో.సర్వే న్ద్రియ గుణాభాసం, సర్వేంద్రియ వివర్జితం అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ॥ (భ. గీ. 13-14) లో అన్నిటినిన్ని భోగించుచు అసక్తమున్న, నిర్గుణముగ నీ బ్రహ్మయున్నదనిన్ని ఈఅధ్యాయ 12 శ్లో.లో "న సత్త న్నాసదుచ్యతే" సత్తుగాని అసత్తుగాని బ్రహ్మ కాదనిన్ని, విదితావిదితములకు సాక్షియే బ్రహ్మయగుననిన్ని చెప్పబడు చున్నది. అద్వైతములో ఈశ్వరుడు పరమాత్మవాచియేకాని మాయావికాదు. విశిష్టాద్వైతములో మాయావియే (ప్రకృతి విశిష్టుడే) ఈశ్వరుడు.అద్వైతభాలో బ్రహ్మనిర్వచనముక్రింది పద్యములలో చూడుడు.

కం॥ విదితా విదితాములకు సా
ష్యుద విషయత్వము, న వేద్య మమనస్కంబా
త్మదె, బ్రహ్మెయుఁగు, ముపాస్యం
బది, దేవత, వేద్యము నిదమర్థమనా త్మే॥

కం॥ వేదాంత మవిద్యాకృత
భేదముఁ బ్రహ్మాత్మలకుఁ విభిత్తిని జేయున్
వేదితృవేదన, వేదం
బాదియుపనయూఽ విషయక బ్రహ్మమునఁదువ్వున్॥

కం॥ మనసా విషయింగ నజ్ఞుడె
మనసాఽవిషయియగు బ్రహ్మమదికన్ ముక్తే
మనమాది జడకరణములు
గనఁగను లేవవియుఁ దృష్టిగా నెఱుఁగనగున్
అ. భా. 9 వర్ణకము

తే. గీ. నిరవయవ బృంహి, షడ్వికిృయరహితము న
దియగుఁ; నిత్యత్వ ప్తం జ్యోతిదిటుల బార
మార్థికముగ గూటస్థ నిత్యార్థబ్రహ్మ
పంచధావిశేషణభూత భవ్యమధియె.
అ. భా. వర్ణకం 9

అంత శరదభ్రరహిత యహర్పతి స్వ
రుక్ప్రచురముచే దమము విలుప్తరవరె
కలిత సత్యజగన్మ్రాల, కామమాత్మ
కావృతి విలీనతా బ్రహ్మ యగును జీవి;
అ. భా. 10 వర్ణకం

బ్రహ్మవృత్తిలో 'భా' రూప బ్రహ్మయె ఫల
నమగుటను చిదాభాసయు ననుపయోగ
మగుచుఁ లీనమె; ఆభాస మదిగననగు
నన నది ప్రదీపము దీపికైక్యమె యగుఁ.
అ. భా. 10 వర్ణకం

"యస్యామతం తస్యమతం, మతం యస్యనవేదసః
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతాం॥ (కేన 2-11)

ప్రి॥ చే తెలివి మఱుపులకు (జ్ఞానాऽజ్ఞానములకు) సాక్షియు, అవిషయత్వము (దేనిన్ని అభిమానించి ఆ యాకారమును పొందనిది.) అనగా మనో విషయాకారముగ తెలుసుకొన బడనిది. మనస్సు (మలిన మనస్సు) చేత పొందబడనిది ఆత్మయు నగునదియె బ్రహ్మమగునని ఎఱుగుము. ఉపాస్య మగు వస్తువు, దేవతయు మనస్సుచేత తెలుసుకొన బడినది లేక మనస్సే ఆ ఆకారమును పొందుటచేత అంతఃకరణ సాహిత్యమగు వస్తురూపాకారముపొంది మనస్సను అద్దము లోని ప్రతిబింబమగుచు 'ఇదంత' మగు అర్థమగునదియగుచు అందుచేత అట్టిది అనాత్మయే అగును. దేహాన్తము అవిద్యా కార్యమగు జీవుడు వేఱు. బ్రహ్మ వేఱు, జగత్తు వేఱు, ఈశ్వరుడు వేఱు అను బ్రహ్మాత్మల భేదవృత్తిని పోగొట్టును. తెలుసుకొనువాడును, తెలివి, తెలియబడునది మొదలగు భ్రమవృత్తులు పోగొట్టునట్టిన్ని, అవిషయమగు నట్టిన్ని బ్రహ్మను చెప్పను. మనస్సుయొక్క విషయి అనగా మనోరూ పుడుగ తెలుసుకొనువాడు అజ్ఞానియే. మనస్సు చేత విషయా కారముపొందనివాడు అనగా శుద్ధ మనస్సే అప్రియయగు వాడు(అనగ నంతఃకరణ రాహిత్యము అగుటను అది మనస్సు బ్రహ్మయే అగును.) అనగా అట్టి స్థితిలో శుద్ధ జీవుడే అప్రి మగ బ్రహ్మయగును. అందుచేత అహంకారము, బుద్ధి, మనస్సులు జడములగుటను ఆ బ్రహ్మను అవి తెలుసుకొన లేవు. అవికరణములున్ను (పరికరములున్ను) దృష్టియే అని అనగా జ్ఞానవృత్తులే నదిన్ని అని సుషుప్తిలో సంస్కార

మాత్రముగనుండి తురీయావస్థలో నశించుటచేత దృష్ట నష్ట స్వభావము కలవేనవిన్ని తెలియనగును.

ఈబ్రహ్మ నిరవయవమున్ను. సర్వవ్యాప్య వ్యాపక బ్రహ్మ; 2. అస్తి, భాతి, ఉత్పద్యతే, పరిణమతే, అపక్షీయతే, నశ్యతే అను ఆరువిధములగు వికార (పరిణామ) రహితమున్ను అంతకు నధిష్ఠానమున్ను, 3. సదాత్మస్ఫూర్తిరూప స్వప్రకాశజ్ఞాన స్వరూపమున్ను 4. యథార్థముగ కూటస్థమైనట్టిదిన్ని అచలమగుచు అంతయునిండి అన్నిటితోను కూడియున్నట్టిదిన్ని నిత్యసత్యవస్తువుయై యున్నది. 5. ప్రచండజ్యోతి ప్రజ్ఞానముగ ఇది అధిష్ఠాన భూతముగ 5 విశేషముల నొప్పుచున్నది. ఈ దేహాది సంఘాతములోనున్ను (వ్యక్తిజీవ పిండాడములోనున్ను) సమిష్టి నామరూప జగత్తగు బ్రహ్మాండములోనున్ను "స్వయమావిర్భవేదాత్మా మేఘాపాయేంశుమానివ" నా. బిం. 55. ప్ర. చే శరత్కాల మేఘములు నశింపగానే సూర్యుడు తనంతట తానే ప్రకాశించుచు చీకటిని పోగొట్టు సూర్యునివలెనే బ్రహ్మయందే కల్పితమైన జగత్తు యొక్క సత్యభ్రాంతికి మూలకారణమైన అహంకార వృత్తియొక్క ఆవరణశక్త్యంశము మేఘము నశింపగానే అంతవఱకుజీవిగాయున్న (ప్రమాతగానున్న) వున్నవస్తువేబ్రహ్మగా తనంతటనే స్ఫురించును. అనగా తన స్వప్రకాశ జ్ఞానైకరసముగా ప్రకాశించునని అర్థము. ఎట్లులనగా ఆత్మయే బ్రహ్మయగునను బ్రహ్మజ్ఞానవృత్తి శాస్త్రాచార్యోపదేశ ఫలితముగా కలుగగానే బ్రహ్మ ఎప్పుడున్న మనోవృత్తిలో ప్రకాశించుచుండుటచేత మనోమలినవృత్తులు (రజస్తమోవృత్తులు) నశిం

చి శుద్ధసత్వమే ఆ మనస్సుకాగా అది బ్రహ్మవృత్తియేఅగు చున్నది ఇట్టి మనోబ్రహ్మవృత్తిలో అతివ్యాప్తిదోషము లేకుండ 1. భారూపః 2. మనోబ్రహ్మ (ఛాం 3-14-2;-3, 18-1 ప్ర. చే బ్రహ్మయే అనన్యముగ నాశుద్ధమనస్సు అగు చున్నది ఆ సమకాలములో అజ్ఞానావరణ మేఘమునశించుట చేత బ్రహ్మ తనస్వప్రకాశ జ్ఞానస్వరూపముచే స్వతంత్ర ముగ తానే మేఘమువిడిచిన సూర్యునివలెనే ప్రకాశించును. ఆ సమకాలములో చిదాభాస అనుపయోగమగుచు నశించును. అథవా చిదాభాస (చిత్తుయొక్క ప్రతిఫలనము) యున్నద న్నను సూర్యప్రచండ దీపవర్తి వెలుగురాగానే అదివరకున్న ట్టి దీపవర్తివెలుగు సూర్యునివెల్తురులో నైక్యమగునట్లు ఈచిదాభాస చిత్స్వరూప బ్రహ్మప్రకాశములో నైక్య మగునని తాత్పర్యము. పంచదశి అ 9-7, 9 శ్లో॥ లు చూడుడు. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగముచేత ఈశ్వర లేక బ్రహ్మతత్త్వము, అంతటను అసజ్జముగను; వ్యావృతిగ నున్నదని యథార్థము తెలుసుకొను బ్రహ్మజ్ఞానము కలుగగా ఆ బ్రహ్మజ్ఞానానన్యమే బ్రహ్మలేక మోక్షము అగునను విశే షాంశము ముఖ్యముగ నీ అజ్జములో గమనార్హము.

ప్రకృతి పురుష (క్షేత్ర క్షేత్రజ్ఞ) యోగాజ్జము సమాప్తము.

---

## పదునాల్గవ అధ్యాయము
## ద్వితీయ గుణత్రయ విభాగయోగాజ్జము.

ఈ అజ్జములో అనాసక్త కర్మయోగిని నిమిత్తీకృత

ము చేసుకొని ఎటుల కర్మసంగియగునో, ఎటులనతఁడు అసంగియగు పరమాత్మకాగలడో సిద్ధాంతము చేయఁబడు చున్నది. క్రిందటి అధ్యాయములో జనిస్వభావముగల యావత్తున్ను క్షేత్ర క్షేత్రజ్ఞుల సంయోగము లేక మిధునీ కృతముగ ఏకమేయగుటవలనని చెప్పఁబడియున్నది.

ఇచ్చట నదెటులనో అనగా సత్వరజస్తమో గుణముల అనురక్తిని కలిగి ఆరూపాకారుడు జీవుడగుట వలన మిధున మగునని అనగా అధ్యాస దాని కార్యములు అగునని నిరూపింపఁబడుచున్నది. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగకార్యము, ఈశ్వరకార్యమేగాని, సాంఖ్యమతనిష్ఠ స్వతన్త్రకార్యము కాదు.

సాంఖ్యము రెండువిధములు:_1 అద్వైతజ్ఞాన సాంఖ్యము 2. నిరీశ్వర సాంఖ్యము, సేశ్వరసాంఖ్యము, నిరీశ్వర సేశ్వర సాంఖ్యములు, అద్వైత సాంఖ్యములో నేక దేశములే అగు చున్నవి. ఈ మతములన్నియు అద్వైత భా. 1 వర్ణకములో చూడనగును.

అద్వైత జ్ఞాన సాంఖ్యము:—జ్ఞాని స్వతన్త్రముగ తన ప్రియత్నముచేతనే కపి కిశోర న్యాయమున లోగడ నుదహరించిన 24 తత్త్వములు మొదలుకొని 96 తత్త్వముల వఱకు గల దేహాది సంఘాతము జడమనియు నందులోనున్న స్వప్రకాశ చిత్స్వరూపుడే బ్రహ్మయనియు తెలుసుకొని జ్ఞానానన్యముగ జ్ఞానైక రసము లేక బ్రహ్మయగుచున్నాడు అన్నదున్న తత్వమే.

2. నిరీశ్వర సాంఖ్యులు లోగడనుదహరించిన 24 తత్త్వములు గల దేహాది సంఘాతములేక ప్రకృతి కార్యములో ప్రకృతియే వ్యవహరించుననియు వేరే బ్రహ్మ లేదనియు చెప్పుదురు.

సేశ్వర సాంఖ్యులు కొందఱు ప్రకృతియే ఈజగత్కారణముగ నిత్యమనియు, పురుష ప్రకృతులు అన్యోన్య సహాయముగ జగత్సృష్టి చేయుదురనియు మఱికొందఱు ఈశ్వరుడే జగత్కారణుడనియు, మఱికొందఱు నిమిత్త కారణుడనియున్ను చెప్పుదురు. ఈ తత్త్వములన్నియు జడమే యగుటను అందులో ఆత్మలేని యెడల చలింపవని గ్రహింపవలెను. అందుచేత వీరి వాదములు నిరాకరణీయములే. ఆ స్థితుడగు కర్మయోగి ఎటుల బద్ధుడు గుణసంగియగుచున్నాడో అను మొదలగు సంగతుల జ్ఞానమావశ్యకమగుటను అవి చెప్పబడుచున్నవి. ఫలము లత్యావశ్యములనుటయే. ఈ ఉత్తమ మార్గమగు అనాసక్తినవలంబించినయెడల, అట్టిజీవుడు ముందు సృష్టిలోకూడ జన్మనెత్తడు. అనగా బ్రహ్మమయే యైపోవును. శ్రీకృష్ణపరమాత్మ క్లుప్తముగ చెప్పినప్పుడేమనగ తనఅనన్య శక్తి యగు ప్రకృతియే (మాయాశక్తియే) జగత్కారణమగుచు అన్నిటికంటే గొప్పదే. అన్నిటిని భరించును. అది మహద్యోనియే, జీవులందఱిని పుట్టించు . హిరణ్యగర్భునకున్ను అదియే కారణము. ఈ మహాత్తు అగుశక్తి బీజము నేనుంచుచున్నాను. అనగా సరస్వతీ రహస్యోప11ప్రచేత క్షేత్ర క్షేత్రజ్ఞులుగ నా శక్తి (ప్రకృతి) రెండు విధములు. అందుచేత శక్తివంతుడుగనే ఈశ్వరుడున్నాను అని

అర్థము. ఈశ్వరుడే అహమును అవిద్యా(తమోగుణ పాలెక్కు-వగు కామ్యకర్మలే కాగా అవిద్యోపాధి స్వరూపమగుటను) దాని తాదాత్మ్యమునొందు నట్టి స్వభావుడే క్షేత్రజ్ఞుడగును. అనగా ఈశ్వరుడేసాపేక్షగా జీవరూపుడగునని అర్థము. ఐతే ఈశ్వరుని పారతంత్ర్యమే ప్రకృతియున్ను, ప్రకృతి పారతంత్ర్యమే జీవుడున్ను అగుదురు. ప్రళయములో క్షేత్రక్షేత్రజ్ఞులు నాశనమయ్యును, వాటి వాసనలుంచుటవలనను తిరిగి జరుగు సృష్టిలో క్రమ నియమముగ వాటి సంయోగ మూలకజన్మ హిరణ్యగర్భుని ద్వారా సర్వసృష్టి కలుగుచున్నది. అందుచే ఆ హిరణ్యగర్భుని గర్భములో ధరించుగర్భమును పరమాత్మయేఉంచుచున్నాడు అని పూర్వాధ్యాయ సారము.' సరస్వతీ రహస్యోప 11 ప్ర.భ. గీ. 7, 12 అధ్యాయములు చూడుడు.

ఆ కార్యమంతయు ఈ అధ్యాయములో గుణ సఙ్గము ద్వారానేనని వివరింపబడుచున్నది. గుణసఙ్గియే జీవుడగుటనున్ను ఈ ప్రకృతి సత్త్వరజస్తమోగుణాత్మికయగుటనున్ను ఈ గుణములు కలవాడు (గుణవాన్) గుణాత్మికకంటే అభేదమే. గుణవాన్ అనగా ఆ యా గుణములపాలు ఎక్కు-వ గలవాడని అర్థము. ఇటుల మూడుగుణములలోను సత్వ గుణాధిక్యుడు (సత్వప్రధానుడు) శుద్ధ సత్వుడున్ను, సుఖరూపబద్ధుడున్ను, జ్ఞానసఙ్గియున్ను అగుచు నిర్మలత్వగుణముచే బంధితుడు. అటులనే రజోసఙ్గిని ఇచ్ఛాద్వేష యుతకర్మసఙ్గిగనున్ను, తమోసఙ్గిని ఆలస్యనిద్రాయుత కర్మసఙ్గి అనిన్ని తెలియనగును. ఇటులను సత్వరజములను తమమాచరించిన, మొదటివి రెండున్ను వెలుగవు. ఇటులనే రజో తమముల

నావరించిన సత్వము, సత్వమునిన్ని, రజస్సత్వము తమములు కూడినతమ స్సత్వమునిన్ని పరిణమించును అ_న్తఃకరణవృత్తు లగు సర్వద్వారములనుంచి వెలువడు ప్రకాశము లేక జ్ఞానము ఆత్మఅగుచు జ్ఞానప్రకాశ చిహ్నముచేత జ్ఞానవృద్ధి కొలత బద్ధ యగుచున్నది. ఇటులను సత్వవృద్ధియైన యెడల లోక ములో అమల గుణమెక్కువయై అందులో న_త్తముడు శుద్ధ సత్వగుణానన్య బ్రహ్మమగుటను బ్రహ్మయేయగును. తక్కిన గుణములు కలవాడు ఆ యా గుణ ప్రాబల్యములుగల మనుజ, రాక్షస, సర్ప, పాషాణ జన్మలెత్తును. అట్టి వివృద్ధి పొందించు ఆహారములనే తినును. ఇటులనే వారి యాచారములున్ను ఉండును. శుద్ధ సత్వప్రధానుడు మానాభిమానములందును, సుఖ దుఃఖములందును సమభావముకలిగి సహించుచుండును. ఇటులను స్నేహితులందును, క్రోధులందును, మానావమాన ములందును, సమభావియు, సర్వారంభపరిత్యాగియు, అనగా దేహమాత్ర నిమి_త్తముగు భిక్షాటనాది మాత్రము చేయు వాడు మాత్రమగుచున్నవాడున్ను, త్రిగుణములకు (సత్వ రజ_స్తమములకు) అతీతుడున్ను అగుచు, సాక్షీభూతుడు ఎటుల క_ర్తకంటే అన్యముగుదునని తాను చూచుచుండునో అటులనే పరమాత్మయగు తాను గుణములచేత పరిణామముగు త్రిగుణాత్మక యగు ప్రకృతియే కార్యకరణ సంఘాతాత్మక విషయాకారముగ పరిణామ మొందుచున్నదనిన్ని, అటులనే ఈ గుణముల పరిణామముద్వారానే (గుణ సర్గమునవే) జగత్తు కలుగుచున్నదనిన్ని, భావించుచు సాక్షిగనే యుండును. అట్టి వాడు ప్రకాశమును, ప్రవృ_త్తి నివృ_త్తిని మోహమును,

ద్వేషమును, గోఅదు. అటుల నెవడు విషయ రాగములను త్యజించి నా యందే అవ్యభిచారముగ నన్నె నా (బ్రహ్మ) ఏకాంత భక్తితోనే సేవించుచు గుణాతీతుడున్ను, బ్రహ్మ సమర్థుడున్ను, అగుచు బ్రహ్మజ్ఞానియే యగునో అట్టివాడు నిర్విషయుడగుటనున్ను, అట్టి వానికి రాగద్వేషాదులున్ను వాని కారణమగు మాయాశక్తిన్ని నివర్తించునని

శ్లో॥ "విషయావినివర్తన్తేనిరాహారస్య దేహినః
రసవర్జ్యంరసోప్యస్యపరం దృష్ట్వానివర్తతే॥భ. గీ. 2-59

శ్లో. చెప్పుచున్నది. నేనే బ్రహ్మను, అమృతుడను, అవ్యయుడను, శాశ్వతుడను, ధర్మము, ఏకాన్త సుఖమూ, అగు నేను నీ దేహములో ప్రితిలోమ్యముగ(ప్రత్యగాత్మగ) ప్రకాశించుచున్నానని నిశ్చయముగ నీవు తెలుసుకొన్న నీవు నిర్గుణ బ్రహ్మమగు నా పదవిని పొందగలవని భ గీ. అ 14-1-27 శ్లోకములలో గుణత్రియ విభాగయోగాజ్ఞోప దేశమును ముగించెను. ఈ విషయమే క్లుప్తముగ అద్వైత భాలో ఈ క్రింది పద్యము వివరించుచున్నది.

తే॥ గీ॥ ఇటుల సత్వగుణానన్యమె యగు బ్రహ్మ
సత్త సాకార జీవాధి సదె,తిగవపు
పరముఁ జిన్మాత్రి మను తలంపదెద గూర్తు
తత్త దిటు దారువంతరితమగు నగ్నిృ॥ అ,భా. 1 వ

ఈ ప్రకారమే సత్వగుణము అనన్యముగ బ్రహ్మ యగుటను, (శుద్ధ సత్వగుణమే) బ్రహ్మ (స్వప్రకాశజ్ఞాన

స్వరూపముగ ప్రాచుర్యము లేక జ్ఞానైక రసము) అగును. బ్రహ్మసత్తలేక శక్తి (ప్రకృతి)సాకారజీవోపాధి కాగా దాని అధిష్ఠానము 'సత్' పదార్థమే. జాగ్రత్స్వప్న సుషుప్తులకు కారణమగు స్థూల, సూక్ష్మ కారణశరీరములులేక స్వరూపములకు పరముగ అనగా అతీతముగ (సాక్షిగ) పరమాత్మ చిన్మాత్రమనియే నా మనస్సులో తలంచి అట్టి స్థితిలో నుందును. తత్పదార్థములేక తన్మాత్రవస్తువు అన్నిటిలోను ఉనికిగా నుండుటచే అంతయు నదియగుట. నా తత్పదార్థము రెండుకొయ్య లొక్కదానిపై నొక్కటియుంచి మధించిననే బయటికి కనబడునట్టి అగ్ని అంతవఱకు బయల్పడక కొయ్య లోనే అంతరముగనుండునటులనే అన్ని ఉపాధులలోనున్న అంతరముగ పరమాత్మయున్నది. అనగా నిటుల నిగూఢముగ అంతను నిండి విశిష్టముగానే యుండి ప్రకృతి కార్యమగు కార్యకరణ సంఘాతములో వ్యష్టిగతముగను, నామ రూప ప్రపంచములో సమిష్టిగతముగను, అసఙ్గముగకూటస్థబ్రహ్మగ అంతరముగనుండి ప్రకృతిశక్తిచేత నిగూఢముగ కప్పబడి పరమాత్మయున్నది. ఈ నిగూఢత్వ కార్యము ప్రకృతి కార్యమేగాని స్వప్రకాశజ్ఞాన స్వరూపమగు 'చిత్' లేక పరమాత్మ కార్యముకాదు. అను విశేషము గమనీయము. తత్త అనగ వ్యాప్యవ్యాపక రూపముగ అన్నిటిలో నుండు సత్యవస్తువు. అంతయుబ్రహ్మమయమగుటనంతయుబ్రహ్మయే ఆ పదార్థము అని అర్థము. ఇచటకొయ్యలాపిడిని పోలినదే మనోవృత్తి చేతనగు యుక్తి మూలకమగు శోధన భోక్తలగాయున్న చిదాత్మవఱకు వ్యతిరేక ముఖముగ నగు

చున్నది. అని సత్వాదిగుణములలో దాగియున్నదనెడి గుణ త్రియ విభాగయోగాఖ్య బ్రహ్మోపదేశమును ముగించెను.

గుణత్రియ విభాగ యోగాఖ్యముసమాప్తము.

---

### 3. పదునేనవ అధ్యాయము
### తృతీయ పురుషోత్తమప్రాప్తి
### (క్షరాక్షర విభాగ) యోగాఖ్యము

ఈబోధ అనాసక్త కర్మయోగిని గూర్చియేగాని పర మార్థ సంన్యాసినిగూర్చికాదు. అట్లు అజ్ఞాని లేక పురుషుడు (జీవుడు) పురుషోత్తము డెటుల నగునో ఉపదేశింపబడుచు న్నది. మొదటి 12 శ్లోకములలోను బ్రహ్మమూలముగకలిగి మాయాశబలిత ఈశ్వరాఖ్యయగు సంసారమునకు మూలమగు నట్టిన్ని దాని కార్యమేయగునట్టిన్ని సంసారమనబడు సనా తన వృక్షమనియున్ను, కొమ్మలన్నియు పైకి క్రిందికి వ్యా పించియున్నవనిన్ని (అనగా పుణ్యఫలములచేత దేవాదిలోక ములున్ను మిశ్రమఫలముచేత మనుష్యలోకమున్ను పాపవిశే ష ఫలముచేత సర్పపాషాణాది అధోలోకాదియున్ను కలు గుచున్నందున) అవి శాఖలుగ వర్ణింపబడినవి. ఈ వృక్ష మూలమగు బ్రహ్మపైన ఉన్నదనిన్ని, చెట్టు శాశ్వతమనిన్ని ఛందోబద్ధముగ పద్యములు చెప్పబడుటచేత గాయత్ర్యాది అన్ని ఛందోశాస్త్రములు వాటి ఆకులనిన్ని అట్టి బ్రహ్మ వృక్షము తెలుసుకొన్నవాడే వేదములో చెప్పబడిన బ్రహ్మ వస్తువును తెలుసుకొన్నవాడనిన్ని చెప్పబడుచున్నాడు.

ఇదియే ధర్మపూగమగు చెట్టగుటవలన ఇందులో స్థావర జంగమ రూపమగు కొమ్మలున్ను, సత్వరజ_స్తమోగుణముల చేత వృద్ధిపొందుచు పైనున్న ధర్మవృక్షమును పెఱుగ చేయుచున్నవి. దీనికి విషయములే మొగ్గలుగానున్నవి. అందు చేతనే ఈ సంసారవృక్షము వృద్ధియై బయటికి కనబడు చున్నది. దాని మూలము వృద్ధికి కారణభూతము అగు పూర్వజన్మ కృత ధర్మాధర్మములగు ఆస_క్త కర్మలయొక్క ఫలమే. ఈ ఫలమే వాసన (స్మృతిరూపము)గనుండి సంసార బంధ కారణమగుచున్నది. ఇటులను సూక్ష్మ జీవము పూర్వ జన్మ కర్మ ఫలాను భవదీక్ష భావనయే స్మృతి రూపవాసన యగుచు ఉపాదానము కాగా అది మూలమున్ను దాని కార్య మగు క్రొ_త్త దేహాది సంఘాతము నిమి_త్తమున్ను కాగా పునర్జన్మలో భౌతికముగ శేష కర్మ ఫలరూప సుఖదుఃఖాను భవము జీవుడు పొందుచున్నాడు. దీని విశేషవివరణ అద్వైత భా 9 వర్ణకములో చూడనగును. ఈ మాయా సనాతన సంసారవృక్షమునకు రూపము,ఆది, అంతము,ఉనికిగాని, లేకనే ఎండమావిలోని నీరువలె కనపడుచుండును. దీనినే అవిద్య యందురు. అందుచేతనే బ్రహ్మజ్ఞానము కలుగునంత వరకు నాశములేని అనాదియు (అశ్వద్ధము)న్ను సుఖ దుఃఖ ఫలము లున్ను వాటి కార్యములున్ను అగు పుత్రదారాది ధనముల కోటికలున్ను వాటి కార్యములగు కామ క్రోధాది శత్రువు లున్ను కలుగుటను వాటికి కారణ భూతములగు మనుజుని రాగద్వేషములయందు నిరభిమానముచేత అనుర_క్తి అనుక_త్తి చేత లెస్సగా దాని మూలమును కూకటి వేళ్ళతో సహా

నటికి (రాగ ద్వేషములను విడిచి) తర్వాత ఈ చెట్టు నంతటను సారభూతముగ వ్యాప్య వ్యాపక రూప విష్ణువనుసార్థక నామకముగ నుండు వస్తువు ప్రేరేపించుచు, అనుభవించు చుండు భోగరూపమగు బ్రహ్మ యొక్క పదమును వెదక తగియున్నది. ఆ పదమును పొందిన జీవుడు తిరిగి జన్మలేనట్టి వాడున్ను బ్రహ్మభావియునగుచుబ్రహ్మగానే మిగిలియుండును. ఆ పదమును పొందినయెడల నీవున్ను(అర్జునుడవగు నీవున్ను) విశ్వరూపుడవున్ను, బ్రహ్మవున్ను అగుదువు.అది (బ్రహ్మ) సంసార వృక్షముయొక్క నిజమైన విత్తనము, (బీజము) అగుటచేత ఆ భావుడవుగ ఆ పురుషుడవే నీ వగుచున్నావు.

అక్కడనుంచే ఈ సంసారరూప (ప్రకృతిరూప) వృక్షము ఇంద్రజాల మాయాకార్యమగు మామిడిచెట్టు దాని ఫలపర్యంతము మాయావిచేత విస్తరింప చేయబడి నటులనే ఈశ్వరునిచేత కల్పితమగుచు చిరంతనము అనగా ఎల్లప్పుడు (అనగా బ్రహ్మజ్ఞానము కలుగునంతవరకు) నుండునదే కాగా అది పురాణి అనబడుచున్నది. అనగా అనాదియు, క్రొత్తదియు నగుచుండును. ఇట్టి సంసారవృక్షమునకు, బ్రహ్మనీవ య్యేవరకు, నాశము లేదు. ఇట్టి శాశ్వతబ్రహ్మపదము సంసారియగు జీవుడు (అనాసక్తకర్మి) మానమోహాములను అభిమానకార్య అను దోషములను వదలినవాడై ఆత్మ లేక పరమాత్మను తెలుసుకొనుటయందు ( విచారించుటయందు లేక జ్ఞానవిద్యయందు) అనగా అధ్యాత్మవిద్యయందు ఎల్లప్పుడు నిమగ్నుడైయుండి ప్రాపంచిక కోరికల నన్నింటిని వదలిన వాడై (అనగ కర్మఫలములను బ్రహ్మయందు త్యాగమొన

ర్చినవాడై అజ్ఞానకార్యమైనట్టి మోహము లేనట్టివాడై) మిగిలియున్న నే పరమాత్మ పదమును (వ్యాప్యవ్యాపక వైష్ణవ పదమును) పొందును. ఆపదమెట్టిదనగా స్వప్రకాశవస్తువే. అందుచేత అచట సూర్యచంద్రాగ్నులు ప్రకాశింపవు. అదియే సూర్యచంద్రాగ్నులను ప్రకాశింపచేయును. అందుచేతవాటి కదియే మూలము. ఆపదమునొందినవాడు తిరిగి ఈలోకము లో జన్మనొందడు. అది నా (శ్రీకృష్ణ లేక బ్రహ్మ) పదమే. నాయంశభూతుడే జీవభూతుఁడగు సనాతనుఁడు (చిరంతనుఁడు లేక నిత్యసత్యవస్తువు) ఈవిషయము త్వం పదార్థ నిష్టా షట్కములోని రెండవ అధ్యాయములో వివరింపబడియే యున్నది. జలసూర్యుడు, జలమగు ఉపాధిలో ప్రతిబింబముగ నుండి బురదతో ఆవరింపబడిన చంద్రుడుగనుండి, సాక్షియే యగుటను, జలోపాధి ఇంకిపోగానే దాని మూల బింబమగు చంద్రునిలో ఐక్యమైపోయినటులను( ఇచట జీవోపాధి యగు మలిన అహంకార బుద్ధి మనోవృత్తులచేత ఆవరింపబడిన చిత్స్వరూపుడు ఆ వృత్తులతో కూడి కర్తృ భోక్తృత్వము లను భోగములననుభవించు చున్నటులనుండి ఉపాధినాశానంతరమున కుండాకాశము కుండ పగిలిపోగానే మహాకాశము ములో కలిసిపోవునటులను జీవభూతము పరమాత్మలో కలిసి పోవును. ఐతే ప్రకృతిలోనున్న ఈ తేజోరూప పరమాత్మ యుండుటచేత సూదంటుఱాయి సన్నిధినున్న ఇనుమునకు చేతనమును సూదంటుఱాయికలుగ జేయునటులను పరమాత్మ సన్నిధినున్న ప్రకృతికిన్ని చేతనమున్ను పరమాత్మయే కలుగ చేయుచున్నాడు. అందుచేత నా బలముచేతనే కార్యము

లన్నియు ప్రకృతి చేయుచున్నది. ఈ ప్రకృతి నా యనన్య శక్తియే జ్ఞాన కర్మేంద్రియ గోళకములనుసృష్టించుచున్నది. ఇటుల నాతోకూడియున్న శక్తియే సృష్టికార్యమగు పంచీ కరణత్రివృత్కృతములు చేయుచున్నది. ఇటుల సమష్టి నామరూప సృష్టియు, వ్యష్టిజీవగోళములగు,మనస్సు,ముక్కు నోరు, కండ్లు, చెవులు, కరచరణాదులను చేయుచున్నదని పామర భాషలో చెప్పబడుచున్నది. పండితభాషలో సూక్ష్మ మగు అంతఃకరణ చతుష్టయము, ప్రాణపంచకమున్ను, పంచ తన్మాత్రలు, జ్ఞాన కర్మేంద్రియములనున్ను త్రివృత్కృత స్థూలావయవములనున్ను చేయుచున్నదని చెప్పబడుచున్నది. ఈ సూక్ష్మ ప్రాణపంచకము భూత పంచకము, మహా పంచ భూతములలో కలసిపోయియు, మనస్సుయొక్క కోరికలు మరణకాలమందు జీవుని (తేజో మాత్ర జీవుని) విడువకుండుటను మనోసూక్ష్మ లేక లిఙ్గ శరీ రము జీవుని కర్మఫల వాసన ఫలముగ కలిగి మనస్సుచేకల్పింప బడిన ద్రావావృత (అప్పరివేష్టిత) దేహ మేర్పడుచున్నది. వెంటనే సూక్ష్మప్రాణ భూతపంచకములు ఆ సూక్ష్మ శరీర ములో చేరిపోవుచుండుటచేత లిఙ్గ శరీరము లేక సూక్ష్మ శరీ రముతో జీవి తన సుకృత దుష్కృతములను ఊర్ధ్వలోకము లలో మానసానంద, సుఖ దుఃఖ రూపములు కించిదవశిష్ట ముగ ననుభవించి శేషకర్మ ఫలానుభవముకొఱకై పునర్జన్మ జీవుడెత్తుచున్నాడు అని లోగడనే చెప్పబడియున్నది. ఈ శుద్ధ జీవుని స్వరూపము ఆతివాహికమగుట వలనను చిదాకస మని బ్రహ్మశాస్త్రములలో చెప్పబడుచున్నది. క్రిందటి

జన్మమరణ కాలములో జీవుడే యే కోటికలు కోరుకొనెనో ఆ యా రూప జీవుడుగ మరుజన్మలో పుట్టుచుండును. చిదాకస మగుటనది దాని స్వభావమే. ఇటుల లిఙ్గశరీరము ఆ యా భౌతికాకారముకూడ పొందుచున్నది. ఇది ప్రకృతికార్యమే అనగా ఈ ప్రకృతి శక్తి ఆ యా విషయాకారము నొందు చున్నదని అర్థము. ఐతే పూవులోని పుష్పాదివాసనను గాలి (వాయువు) తనతో తీసుకొనిపోవునటులను, ఈ జీవభూతమగు ఈశ్వరుడే (పరమాత్మయే) క్రొత్త శరీరములో క్రొత్తబట్ట లోని దారమువలె ప్రవేశించి సాపేక్షగా ప్రేరేపించుచు భౌతికాకారమగు దేహము నిమిత్తముకాగా ధర్మాధర్మకర్మ లను పూర్వ జన్మకృత కర్మఫలవాసనలు ఉపాదానముకాగా ఇంద్రియముల ఆ యా గోళకములను ఎక్కి (ఆరోహించి లేక అభిమానించి) అనగా అధ్యాసచేత వాక్, రస, వినికి, వాసన, స్పర్శ, ఇంద్రియగోళకములగు కండ్లు, నాలుక ముక్కు. చెవులు, చర్మగోళకములలో మనోరూపుడుగ నారోహించి ఆ యా ఇంద్రియవ్యవహర్త యగుచున్నాడు. అనగా ఆ ఇంద్రియార్థముల భోక్తయగుచున్నాడు. అపి కౌషీతకీ బ్రాహ్మణోపనిషత్తు చెప్పుచున్నది· అద్వైత భా 1 వర్ణకం చూడ నగును. ఇటుల దృశి (చూపుమాత్ర) కర్మఫలాను భవియే దేహి అనగా ఈశ్వరుడగుచున్నాడు. న్యాయముగ ఆయన శక్తి ప్రకృతియే అనుభవములనుపొందుచున్నదనియు క్షేత్రజ్ఞుడగు పురుషుడు ప్రకృతి (క్షేత్రం) సత్పదార్థము యొక్క ఛాయా ప్రతిబింబిత కార్యములు లేక అంశలే యనియు, ఇది వరకే 7, 13 అ॥లలో చెప్పబడినది. ఈ విచ

క్షణ జ్ఞానమువలన తెలుసుకొనిన క్షేత్రజ్ఞుడే (పురుషుడే) బ్రహ్మ ఎటులనగు చున్నదిన్ని 13,14 అధ్యాయములలో చెప్ప బడియున్నది. ఇటులను జీవుడు లేక పురుషుడు లిఙ్గశరీరి యయియే అవిద్యాశక్తి వశ్యుడగుచున్నాడు. అది బ్రహ్మజ్ఞానముననే గాని నశింపదు. అందుచేతనే ఈ ప్రకృతి అవిద్యయు దాని కార్యమగు అధ్యాసయు, సాదియునగును. పైన ఉదహరించిన లిఙ్గశరీర నిర్వచనము ఈక్రిందిపద్యములో చెప్ప బడుచున్నది.

తే॥ గీ॥ లైఙ్గికాధారచిత్తది· యైఙ్గిత చితి।
కల్పితపు లిఙ్గదేహము గాఁగనంద।
లి ప్రకృతచిదాభాస లీత్రితయుస।
మూహె జీవు; డవిద్యచే మోహవశుడె॥ అ. భా. 1వ

ప్రకృతి, జీవుడు, చిచ్ఛాయాప్రతిబింబ ప్రకృతిత్వ కార్యములే. జీవునికి బ్రహ్మైక్య జ్ఞానము కలుగువఱకు అనాదులే. జ్ఞానప్రాప్తి కలిగిన సమకాలములో కారణికమగు అవిద్యతో పరమాత్మలో లయమగుటను పైనచెప్పినటులను సాది (ఆది కలదియే) అని అ. భా. 1, 9, వర్ణకములలో మిథ్యాధ్యాసశీర్షికక్రింద వివరణ చూడనగును. చిత్తు లేక చైతన్యము లేక పరమాత్మ లేక ఈశ్వరుడే జీవభూతుడై ప్రకృతివశ్యుడగుచున్నాడు. ప్రకృతియన్నను అవిద్యయన్నను ఒక్కటే చిత్ లేక పరమాత్మ ప్రకృతిత్వ ఈశ్వరభూతుడై (మాయావియై) ప్రకృతిని వశముచేసుకొనుచున్నాడు. మాయోపాధిని విడిచిన నిర్గుణబ్రహ్మ (స్వప్రకాశ జ్ఞానస్వ

రూపు)డగుచున్నాడు. పరమాత్మను చైతన్యమున్ను, చిత్తున్ను అందురు. ప్రకృతములో లిఙ్గదేహమున కాధారమగు చిత్ స్వరూపుడున్ను, ఆ చిత్ సర్వజ్ఞుడగుటచేత దానియందే కల్పితమైనట్టి లిఙ్గదేహము అనగా మనస్సు సూక్ష్మ భూత పంచకము, సూక్ష్మప్రాణపంచకమున్ను కూటస్థబ్రహ్మ (చిత్తు)కలిగిన చిదాత్మ (ప్రత్యగాత్మ) సూక్ష్మదేహమును కాగా ఆ లిఙ్గదేహమునందలి ప్రకృతజన్మలోని చిదాభాసుడున్ను (అనగా అవిద్యాకార్యమగు అహంకారములో ప్రతిఫలించిన చిత్ చిదాభాసుడు అగుచున్నాడు) అనగా అహంకారము జడమగుటను విషయాకరించుటచే చిత్ అహంకారమును గ్రహించుటచే చిదాత్మ యనబడువాడే చిదాభాసుడు. బహుశముగ నీ మూటియొక్క సమూహమేజీవుడనబడుచున్నాడు. ఇటులను జీవుడు ప్రకృతిస్థుడగుచు ప్రకృతియే తమోగుణాధిక్యావస్థలో అవిద్యయనబడుటను అట్టి యవిద్యయే ఈజీవుని మోహపర్చుటచేత అనగా బాహ్యపదార్థరూపాకారములను విషయాకరింపచేయుచు జీవుని మోహపెట్టుచుండుట చేత ఆ మోహినీవశ్యుడే జీవుడనబడుచున్నాడు. ఈజీవుడు కోరికలతో కూడుకొన్నవాడగుటను మలినజీవుడు లేక మలినమనోరూపుడు యగుచున్నాడు. ఈ మనస్సులోని కోరికలు నశించిన శుద్ధమనస్సగుటను దానిని విషయాకరించిన చిత్ శుద్ధజీవుడున్ను చిదనన్యమున్ను మనోబ్రహ్మ ( ఛాం 3-18-1) ప్ర, చే నగుచున్నాడను విశేషము గమనీయము. వాస్తవముగ నిర్గుణ బ్రహ్మయే అగు జీవ భూతమును పంచ జ్ఞానేంద్రియ గోళకములు మనస్సులనున్ను (అన్తఃకరణమునున్ను)

ప్రకృతి ఆకర్షించుచున్నది. అద్వైతభా. 1, 9, 10 వర్ణకములు చూడుడు. ఇటులను మలినజీవుడు ప్రాకృతుడున్ను అవిద్యావశ్యుడున్ను, శుద్ధజీవుడు బ్రహ్మయున్ను అగునని సారాంశము. ఈ బ్రహ్మత్వము బ్రహ్మశాస్త్రాచార్యోప దేశ ఫలమే. అనాసక్త బ్రహ్మకర్మియగుటను ఆత్మ లేక పరమాత్మ లేక పురుషోత్తముడు అగుననునది అధ్యాహ్రుతమేనని ఈ అధ్యాయములో స్ఫురించుచున్నదని గమనీయము. ఇటులగుటకు ప్రయత్నింపనివాడున్ను, అనాసక్త కర్మయోగయుక్తుడు కానివాడున్ను, జీవాత్మ పరమాత్మ భేదము తెలుసుకొనలేడు. అందుచేతనే విశేషముగ నా విషయమును ఈ అధ్యాయము నుడువుచున్నది. జీవుని తరింపజేయు అధ్యాయమున్ను, శ్రీభగవద్గీత రహస్యోపదేశమున్ను అగుచు మకుటాయమానమని చెప్పనగును. సూర్య చందులు, పంచభూతములు, జీవభూతను ఈ ఎనిమిదింటిలో మూల స్వప్రకాశ వస్తువుగా నుండి వీటి తేజస్సు (ప్రకాశనము) ద్వారానే మణిపూసలలోని దారమువలెనే నా బ్రహ్మ తేజస్సుద్వారానే ఈ చరాచరాత్మకమంతను ప్రకాశింప చేయుచున్నాను ప్ర॥ దక్షిణామూర్త్యష్టక 11 శ్లోకము చూడనగును. మఱియు నేనే వృక్షాదులలోని రసాత్మకమున్ను, ఓషధులలో సోమరసమున్ను, వైశ్వానరరూపమున్ను (అనగా నాకములనబడు ఇంద్రియములందే స్థానము కలిగి) వ్యాప్య వ్యాపకరూప విష్ణువుగ ఇంద్రియములలో జఠరాగ్ని రూపముగ ధాత్వగ్నిగ నుండి వృద్ధి స్థితి లయములను, దేహమూలము అగు పరమాణువుల సమవాయములగు

టను వాటి సంఘాతమగు దేహములోనుండి ప్రాణాపానాది పంచవాయువులతో కూడినవాడనై జీవుడు తిన్న భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య రూపమగు నాల్గువిధముల అన్న పచనము చేయువాడనున్ను అగుచున్నాను. జీవుడు ఈ వైశ్వానర రూపపరమాత్మకే ఈ అన్నము చెందుచున్నది గాని, జీవునకు కాదని అనుకొను అనాసక్త కర్మభావనతో నుండి అన్నము తిను కర్మచేయుచున్నయెడల వైశ్వానర కర్మ యగుననియు, వైశ్వానరుడే బ్రహ్మమునిభావించినచో నది బ్రహ్మకర్మ యగుననియు భావనలో జీవుడున్నయెడల అది అనః=ముఖ్యప్రాణము లేక బ్రహ్మయొక్క అన్నము లేక అనుభవము లేక భోగముఅగుచున్నదనియున్ను అప్పుడు జీవుడు శుద్ధ జీవుడున్ను, అకర్తయే అగుననిన్ని, (అనాసక్త కర్మియే అగుననిన్ని) బ్రహ్మ భావనచే బ్రహ్మఅగుననిన్ని, ఛాందోగ్య శ్రుతి చెప్పుచున్నది. అట్టి భావములోనున్న జీవునికి అతడు పూర్ణజ్ఞాని కాకున్నను, అతనికి పంచసూన దోషములంటవనియు, వైశ్వదేవము చేయని దోషమే లేదనియు, ఈ అధ్యాయములో 14వ శ్లోకమునకు శ్రీ శంకర భాష్యమున్ను చెప్పుచున్నది. ఇది అకర్మయగుచు ఆ జీవుడు అకర్మియే అగుచున్నందున, ఆ కర్మచేసినయెడల అది లోక సంగ్రహార్థమే అగుచున్నదను విశేషము గమనీయము. ఇటులు వతడు బ్రహ్మకర్మ సమాధిగుడును, అకర్మియునగుచున్నాడు. ఈ భావ ప్రధానమే ఉపనిషత్తులు చెప్పుచున్నవి. దీనివిశేష వివరణ అద్వైత భా 1వర్ణకం లోనున్ను ముందు చెప్పబడు 18 అధ్యాయములోనున్ను చూడనగును. మఱియును శ్రీకృష్ణ

పరమాత్మ సర్వప్రాణుల ఆత్మ నేనే. (వారి మనస్సను గుహ యందుండి నేనే, వారికి స్మృతియు, జ్ఞానము అజ్ఞానముసాపేక్షగ వారివారి పరిణత నియతములను అనుసరించే) వారికి కలుగ జేయుచున్నాను. 'సత్' స్వభావముచేతను ఆత్మగా నేనే (బ్రహ్మ లేక పరమాత్మ) తెలియచేయబడుచున్నాను. వేదార్థ సంప్రదాయ కర్తను, వేదార్థ జ్ఞానస్వరూపుడననీస్న క్లుప్తముగ చెప్పుచున్నాను. జీవాత్మ పరమాత్మ లొక్కటే నని, జీవుడు(శుద్ధజీవుడు) అకర్తయేననిన్ని దేహాది సంఘా తాభిమానమే జీవుని పునర్జన్మ కారణమనిన్ని, బ్రహ్మజ్ఞానము చేత జీవుడు పురుషోత్తమ ప్రాప్తి పొందుననిన్ని ఈ బ్రహ్మ శాస్త్రోపదేశమును ముగించెను.

క్షరాక్షరవిభాగము:— పై పురుషప్రకృతి, పురుషోత్త ములు అనుమూడురాసులు తిరిగిక్షరాక్షరములను రెండురాసు లుగ విభజింపబడి ఇద్దరు పురుషులుగ తెలియబడుచున్నారు. క్షరమ్=యత్క్షరతీతి తత్ క్షరమ్ అనగా నశించునదంతయు క్షరమే. అక్షరమ్=నక్షరతీతి అక్షరమ్అనగానశింపనినిత్యసత్య వస్తువు అక్షరము. అందుచేత సర్వచరాచరాత్మక ప్రపంచ మున్న క్షరమే. వాటిలోనున్న నిత్య సత్యవస్తువు లేక నాశ రహితవస్తువు అక్షరము అగుచు మాయాశక్తి అగుచున్నది. ఇటులను జీవభూతము(పురుషుడు) క్షరమున్ను, మాయాశక్తి యే అక్షరుడున్న అని రెండు విధములుగ నుండగా వీరికంటే ఉత్తమపురుషుడే (పురుషోత్తముడే) అక్షరాధి (పరమాత్మ లేక నిర్గుణబ్రహ్మ) యని తెలియనగును. ఐతే ఈ ముల్లోక ములు నిండి వాటిని ఎవరు భరించుచున్నారో ఆయన ఈ

శ్వరుడనబడుచున్నాడు. అందుచేత నీ కార్యకారణ ఉపాధు లలో ఆత్మగానుండు జీవేశ్వరభూతములున్ను (క్షరాక్షర పురుషులున్ను) బ్రహ్మజ్ఞానముచేత భ్రాంతి నశించుటచేత అన్నిటిలోనున్ను వాటికతీతమగుచు నున్న నిత్యసత్యవస్తువుగ (పురుషోత్తముడుగ)మిగిలి నేనుండుటచేత సత్పదార్థమగు నేను పురుషోత్తముడను (పరమాత్మను లేక ప్రత్యక్కును) అందు చేత నే వేదములలోను, లోకములలోను పురుషోత్తముడనని ప్రఖ్యాతిచెందితిని. ఎవరైతే నన్ను పురుషోత్తమునిగ తెలుసు కొను చున్నారో వారు బ్రహ్మజ్ఞానులే. అట్టివారంతయును తెలిసినవారే. అట్టి జ్ఞాని అక్షరాధియగుచు సర్వ భావముల చేత నన్ను తెలుసుకొన్న విదుడే అగును. అందుచేత నతడు పురుషోత్తమప్రాప్తి నొందును. ఈ అతిరహస్యమైనట్టిన్ని, జీవుడు పురుషోత్తమప్రాప్తి పొందునట్టిన్ని యోగాజ్ఞోపదేశ మును చేసి శ్రీకృష్ణుడు అర్జునునికి నాయందే బుద్ధిగలయోగి (అనాసక్తకర్మయోగిన్ని బుద్ధిమంతుడున్ను, (జ్ఞానియున్ను) కృతకృత్యుడున్ను అగునని, "ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వ ద్థం ప్రాహురవ్యయం । ఛందాంసి యస్యపర్ణాని యస్తం వేద సవేదవిత్॥ 15–1.—

శ్లో॥ ఇతిగుహ్యతమం శాస్త్రమిదముక్తం మయానఘ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యస్య భారత॥ 15"

శ్లో॥ లతో ముగించెను. ఈ అధ్యాయ మతిముఖ్య మైనందున ముఖ్యముగ జీవుడు బ్రహ్మెటులనగునో (పురు షోత్తము డెటులగునో) ఆ విద్యలేక . అధ్యాత్మవిద్య చెప్ప

చున్నది. అందుచేతనే విరళముగా పైనచెప్పబడినది. దీని సారము ఈక్రింది పద్యములలో చూడనగును.

145 తే॥గీ॥ ధర్మజిజ్ఞాసిదు పునరుత్పత్తి; ఇంకను।
బ్రహ్మజిజ్ఞాసఫలము బ్రహ్మగుటను
జీవబ్రహ్మైక్యతాన్త్రిశో చితప్రజ్ఞాన।
మునను జీవుడు విరజుండెపుడగు రామ॥

,, ప్రాక్తనపు కర్మవాసన ఫలితదైవ।
దేహివిద్యాధరియుజుపత్నె, సుఖదుఃఖ।
యయ్యెం; అద్యతనపుయత్న తయ్యెడులయ।
మదింక నిర్వాసనను; దైవ మదిటు మిథ్య;

,, అదియుకాని దదనుబుద్ధి ఆధిభౌతి।
బుద్ధి; యథ్యాసమూలము బుద్ధికిహమె।
కించుక పరిణామ్యగునిత్య మింకదియు న।
శింప నాతివాహిక చిత్త మెపుడు బ్రహ్మ॥

,, బ్రహ్మలక్ష్యమన పరమ బాహ్యమును అ
నంత, రాపూర్వ, తత్పద, మంతదె త్వ
ముం; మనసాత్మేంద్రియము బుద్ధె భోక్త; కర్మ
ఫలమనుభవి శరీరందుః పండితులింకం॥

,, యిట్టిభోక్తకు శోధననె తెలియంగ
వలయునికం చిదాత్మయె హేతు వదహమావ
రకమనియు, నది శోధింప రవియటె స్ఫు
రించు,ం జిత్స్వతన్త్రాత్మ మరినిరుపాధి॥

,, రవియందె చిదాత్మోటుల భాగ లక్షణమున
సాక్షి, జ్ఞానస్వరూపత సంవిదాత్మ
బ్రహ్మ దేహాద్యహము మయ ద్రష్టయునది
శ్రోత, విజ్ఞాత, బోద్ధగుఁశ్రుతిని తెలియఁ॥

,, ఉపనిషద్బుద్ధిలో నాత్మ నుడువుఁ బుద్ధి
భూ, చిదాకసము, సహస్రము, హృదయముఁ
భ్రూపరిమె భువోభూమికా రూఢసిద్ధె
బ్రహ్మఁ భూతదథోఽధ్యాస భాస తమమె;

,, విస్మృత దేశాంతరగవస్తు విషయరూప
మొందు బుద్ధివృత్తి, దిదేశములకుమధ్య
మునగు నిర్విషయ మగు చిన్మఖ్యమదియ;
దానియందు బుద్ధి విలీనత నది బ్రహ్మ;
తత్త్వవిదునకిటుల ముక్తి తత్క్షణఫలమె॥ అ. భా. 1వ

కం॥ అజ్ఞానావరణము బ్ర
హ్మజ్ఞముననె నాశితమగు నరయఁగఁరామా!
అజ్ఞానాతమస రజ
త్వజ్ఞమ్మాబ వృత్త్యనన్యతను బ్రహ్మగుటన్॥ అ.భా 1వర్ణ.

ధర్మాధర్మ విచార ఫలముగ పునర్జన్మయే కలుగుచుండును. చర్విత చర్వణముగ నట్టి దేహముతో తిఱిగి ధర్మ జిజ్ఞాసయే ప్రాప్తించును. దృష్టాంతముగ నదీ ప్రవాహములో కొట్టుకొనిపోవుచుండు పురుగు ప్రవాహమునకెదురీదుచు తిర్గి ప్రవాహ పతితమేయగుచు, దరిచేరుటకే

ప్రియతిన్నింపదు అని గర్భోపనిషత్తు చెప్పుచున్నది. లోకానుభవమున్ను అదియే. ఇట్టివాడే ధర్మజిజ్ఞాసువగుజీవి. ఇంకను బ్రహ్మజిజ్ఞాస ఫలముగ బ్రహ్మజ్ఞానియు, జ్ఞానానన్యముగు బ్రహ్మయున్ను జీవుడగును. దృష్టాంతముగ పూర్వజన్మకృత కర్మఫలవాసన చేత విద్యాధరి పూర్వజన్మలో తాను బ్రహ్మ భార్యను కావలెనను కోరిక కలిగియుండుటచేత బ్రహ్మ చేయు మఱు సృష్టిలో(శిలా బ్రహ్మాండ సృష్టిలో)సాపేక్షగానే తన భార్యగ విద్యాధరిని పుట్టించి తనకట్టి కోరికలేమిని నిరిచ్ఛితుడుగ నున్నాడు. అందుచేత దైవ దేహము పొందిన్ని ఆమె ఆ జన్మలో సుఖదుఃఖములను పొందెను. యోగ వాసిష్టములోని విద్యాధరోపాఖ్యానము చూడనగును. అందుచేత ఈ జన్మలో చేసిన సుప్రయత్నము బలవత్తరమైన దైవ పూర్వజన్మవాసనలు నశించును. పూర్వవాసనయే బలవత్తరమైన పూర్వకృత కర్మఫల వాసన అనుభవించియే తీరవలయును. అందుచేత జీవుడు ఎక్కువ ప్రయత్నము చేసి వాసనలను శమింపచేసుకొనవలయును. అందుచేతదైవతములే సుఖ దుఃఖములనుకొనుట భ్రమయే. దైవమనున దిటుల మిథ్యయే. ఇటుల తన మనస్సే జీవునకు బంధువున్ను శత్రువున్నకూడ నగుచున్నదని అమృత బిందూపనిషత్ చెప్పుచున్నది. ఆత్మకాని అహంకార వృత్తియేఆత్మయనుకొనుట పారిభాషికముగ వేదాంతములో చిత్ సత్తైక్య మగునట్టి తాదాత్మ్యము లేక అధ్యాస యనబడుచున్నది. అధ్యాస భ. గీ. అ 4 శ్లో 18 భాష్యములో నుడువబడినది అధ్యాసయనగ అది కానివస్తువును అది ఆ వస్తువే నను భ్రమ

జ్ఞానము· (అహంకారమే ఆత్మయనుట అధ్యాస) అధ్యాసకు మూలము బుద్ధివృత్తి. దానికి మూలము అహంకార వృత్తి. అహంకారము (ప్రభా) శమించిన (నశించిన) కించిత్పరిణామి నిత్యమే అది అగుటను అవ్యవధిగానే చిత్ (చిదాకాశము) స్ఫురించును· ఈ అధ్యాస వివరణ అద్వైత భా1వర్ణకములో చూడనగును. అనగా ఆతివాహిక స్వభావముగల అహంకారము స్వచ్ఛమగుటను, అది చిదాకాశమే అగుచున్నది. బ్రహ్మ లక్ష్యము చెప్పబడుచున్నది· అది

1. అనపరము అనగా పరములేక కార్యము కానిది అనగా కారణమేఅపరముకాగా కార్యమగు దృశ్య ప్రపంచమునకు కారణమున్ను బ్రహ్మకాదు. అంతయు బ్రహ్మయే నగుటనున్ను బ్రహ్మకు కారణములేనందుననున్ను అనపరము అకారణికమ· అది అగును.

2. అబాహ్యము–అనగా అద్వితీయ ఆనంద స్వరూపము.

3. అన తరము–జన్మాంతర రహితము లేక ఏకరసము. అనగా దాని కంతరమింకొకటి లేనందున జ్ఞానైకరసము.

4. అపూర్వము–అదృష్టముకానిది. అనగా ప్రత్యక్షముగ 'భా' 'భాస్యములు' (గ్రాహకగ్రాహ్యములు లేక ప్రకాశ, ప్రకాశనములు)గ అంతటను నిండియున్న వస్తువు.

5. తత్పదము– సృష్టియంతటిలోను సత్తామాత్రముగ నానంద స్వరూపముగ నుండి సాధారణముగ 'సతు' అని ఉనికిగ తెలియబడుచున్న నిత్యసత్యవస్తువు 6 భోక్త– 1. మనోవృత్తి, 2.బుద్ధివృత్తి 3 ఇంద్రియములు,4.ఆత్మయు

కూడిన సంపుటియే భోక్త. సాభాస బుద్ధియే. సశరీరి అనగా శరీరాభిమానము కలిగి, భోక్తగ కర్మఫలములను అనుభవించునదే సశరీరియని పండితులు (ఆత్మానాత్మానుభవము కలవారు) చెప్పుచున్నారు. ఈ భోక్తను వ్యతిరేకముగ క్రమ నియమముగ మనో ఊహతో శోధించిన భోక్తకు కారణము కర్త దానికి గారణము చిదాత్మ (అహమధ్యాస) దానిని శోధించిన అహంకారముయొక్కయు, చిత్తుయొక్కయు మిథునీకరణమనియు, తెలుసుకొనగా ఆ సమకాలములో అహంకారమూలమగు అవిద్య జడమేనని తెలియుచుండగా 'చిత్' స్వతంత్రముగా మేఘము విడిచిన సూర్యునివలె ప్రకాశించును. ఈ ప్రకారము సూర్యునివలెనే చిదాత్మను భాగలక్షణమున (అనగా బ్రహ్మ కర్మచే బ్రహ్మేచ్ఛను వదలి దాని కర్మయగు బ్రహ్మజ్ఞానమును వదలక దాని కర్మయు(జ్ఞానానన్యము)బ్రహ్మయే కర్మ కాగా అది సాక్షిగా నున్న జ్ఞానమే స్వరూపముగానున్న, సంవిత్ ఆత్మ(అట తీతి ఆత్మ) బ్రహ్మయుగనే దేహాది సంఘాతములో సాక్షిగా నుండుటచే ద్రష్టవినుచుండుటచే శ్రోత తెలుసుకొనుచుండుట చేత విజ్ఞాత,బుద్ధిలో బుద్ధిసుఘగబోద్ధగను,శ్రుతులలో చెప్ప బడుచున్నది. ఈబుద్ధిలో ఆత్మయున్నదని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. బుద్ధిస్థానములు 1భ్రుకుటీ స్థానము(కనుబొమల మధ్య నుండు త్రికూట స్థానము) 2. హృదయము.ఱొమ్మునకుఎడమ ప్రక్కను అధోముఖ కమలమువంటిమాంసపిండముకొంచెము ఎడమవైపుకు వంగియున్నది. 3 చిదాకాసములోనున్న (భృకుటీ స్థానమునకు పైనున్న ఫాలభాగము) 4 సహస్రార

పదము మూడు ఎముక క్రిందయున్నది. ఈ 3. 4 స్థానములలో బుద్ధిని నిలిపిన నీరూపమే బుద్ధి యగుటను, బుద్ధి సంస్కృతమై నీరూపమై బుద్ధిస్థుడు (చిదాభాసుడు) బ్రహ్మగ మిగులుచున్నాడు. 1, 2 స్థానములలో బుద్ధిని నిల్పినబాహ్య పదార్థములను విషయీకరించుకొనుటచేత తమోగుణ ఆభాసయే అది అగుచున్నది. దృష్టాంతముగ నీ బుద్ధి వృత్తియే అతి దూరస్థమైన ఆకసములో చంద్రునికిన్ని చూచు జీవునకున్ను మధ్యనున్న నిర్విషయమగు చిత్ పదార్థముద్వారానే నిమిషములో విషయీకరణము చేసుకొని బుద్ధివృత్తియె చంద్ర విషయాకారము నొందుచున్నది. అందుచేత నిర్విషయ చిత్తునందే జీవుని చిత్తవృత్తులు (బుద్ధి వృత్తులు) లయముచేయబడిన సంతరాళము (నిర్విషయ చిత్ లేక ప్రకాశము) బ్రహ్మ యగుటను "చిదాకాశం మహా మునే దేశాద్దేశాంతర ప్రాప్తౌ సంవిదోమధ్యమేవయత్ । నిమేషేణ చిదాకాశం తద్విద్ధి మునిపుంగవ।తస్మిన్నిరస్త నిశ్శేష సంకల్ప స్థితిమేషిచేత్ । సర్వాత్మకం పదం శాంతం తదా ప్రాప్నోష్యసంశయః మహోప అ4-108-111) ప్ర. చెప్పుచున్నటులను ఆ సమకాలములో జీవుడు బ్రహ్మగానే మిగిలి యుండుటను జీవ బ్రహ్మైక్య జ్ఞానికిటులను తత్క్షణముననే ఈ లోకము లోనే జీవించియుండగానే మోక్షము(బ్రహ్మత్వము) కలుగుచున్నది. 2 గ్రంథ దృష్టాంతమున్ను అంతరాళమున కనపడ్చునని ఈ గ్రంథ మూడవభాగములో చూడుడు. అవిద్యావృత్తులే జ్ఞానము అజ్ఞానము కాగా తమోగుణాధీనుడగు జీవుని అజ్ఞానమూవరించి జ్ఞానమును ధ్వంసముచేయు

చున్నది. ఇదియే జీవాభిమానకార్యము అందుచేత బ్రహ్మ జ్ఞానముచే రజో తమోగుణ వృత్తులను నశింపచేసిన మిగిలిన సత్వవృత్తి గుణమే మిగిలియుండుటచేతనున్ను, అది బ్రహ్మ వృత్తియే యగుటచేతనున్న, బ్రహ్మ జ్ఞానానన్యమే బ్రహ్మ యగుటనున్ను, జ్ఞాన ప్రతిధ్వంసియగు అజ్ఞానము దాని ప్రతి ధ్వంసియగు జ్ఞానముచేత నాశము తత్క్షణమేఅగును. ఇదియే జీవుడు బ్రహ్మ లేక పురుషోత్తముడు లేక పరమాత్మ జీవించి యుండగానే అగు నుపాయమగుచు ఈఅధ్యాయ విశేషార్థమగు చున్నది.

పురుషోత్తమ ప్రాప్తి (క్షరాక్షర) యోగాజ్ఞము

సమాప్తము

---

## పదునారవ అధ్యాయము

## చతుర్ధ సంపద్ విభాగ యోగాజ్ఞము

తొమ్మిదవ అధ్యాయములో (అనగా తత్పదార్థ ప్రధానమగు రెండవభాగములోనిమూడవఅజ్ఞములో) 1దైవీ 2. రాక్షసీ అంశలు సూచింపబడినవి. 1. ప్రకృతి మోక్ష కర మగు దైవీసంపదగనున్ను, 2. ప్రకృతి బంధకరమగు ఆసురీ రాక్షసీ గుణములుగనున్ను రెండు రాసులుగ విడదీసి విస్తార ముగ దైవీసంపద నలవరచుకొనిదానిద్వారా మోక్ష(బ్రహ్మ) ప్రాప్తినొందుటకు చెప్పబడుచున్నది.

## దైవీ సంపద

దీనిని వృద్ధిపొందించు కారణములు—

(1) అభయము, (2) సత్వగుణముయొక్క విశుద్ధత్వము (శుద్ధత్వము) (3) విజ్ఞానయోగము (4) దానము అనగా ఉన్నదానిని యథాశక్తిగా విభజించి ఇతరులకు ఒకభాగమును దానముచేసి 2 వ భాగమును దైవమునకిచ్చి 3 వ భాగము తా ననుభవించి 4 వ భాగము ముందు అవసరముల కుంచుట, (5) దమము:— ఇచట బాహ్యకరణముల ఉపశమనమని అర్థము. పక్షాంతరముగ. బాహ్యాంతఃకరణముల ఉపశమనము లేక శాంతి. ఇచట అన్తఃకరణముచేత బాహ్యకరణముల శాంతియే శంకరభాష్యార్థము నుడువుచున్నది. విచారించిన బాహ్యాంతఃకరణముల ఉపశమనముచేత కలుగుశాంతియేదమమని భాష్యముచేతనున్ను అర్థాంతరముగ తేలుచున్నది. (6) యజ్ఞము:— శ్రౌతాగ్నికార్యమున్ను స్మార్తవైశ్వదేవ మహాయజ్ఞమున్నూ, (7) స్వాధ్యాయము ఋగ్వేదాధ్యయనమున్ను దాని నిగూఢాభిప్రాయ ప్రచుర్యకమగు భాష్యమున్ను, (శారీరకాది అధ్యయనమున్ను) (8) ఆర్జవము సర్వదా ఋజుప్రవర్తనము (9) అహింస:— ప్రాణి పీడనరాహిత్యము. (10) సత్యము:— నిజమే ప్రియముగ ననగా శాస్త్రాది ప్రమాణములతో సప్రమాణికముగనే అప్రియమైనను దాచక శాంతముగ చెప్పుట. (11) అక్రోధము—పరులవలన కలిగింపబడిన క్రోధము (కోపము) యొక్క ఉపశమనము (12) త్యాగము—బ్రహ్మయందే కర్మచేయుచు, కామ సంన్యాసమున్ను సంకల్ప కర్మఫలత్యాగమున్ను బ్రహ్మయందే చేయుట,

(13) శాంతి—అన్తఃకరణవృత్తి (రాగాది ఉపశమనములేక ప్రిభాశూన్యము, బుద్ధిశూన్యము, మనోశూన్యము)(14)అపై శునము-అపిశునత్వము అనగా పరుల తప్పును వెదకకుండుట (15) దయ-దుఃఖించుభూతములయందు కృప (జాలి) (16) అలోలుపత్వము;-ఇంద్రియముల సన్నిధినియుండు విషయము లందు అవిక్రియత. (17) మార్దవము:- మృదుస్వభావము లేక మృదువాక్యచోదనా. 18, హ్రీ-లజ్జ, 19 అచాపలము-వాక్పాణి పాదములు మొదలగు కర్మేంద్రియములను వాటి బాహ్యవ్యాపారములనుంచి విరమణము (20) తేజస్సు. ప్రభ లేక దీప్తి, (21) క్షమ-లాగబడినప్పటికి, కొట్టబడినప్పటికి, భూమివలె శాంతముగనుండుట (22) శౌచము-బాహ్యాభ్యంతరముల నైర్మల్యము అనగా మాయాకార్యములగు రాగాది కాలుష్య రాహిత్యము (23) అద్రోహము-పర ద్రోహ భావము లేకుండుట లేక మానసిక అహింస. (24) నాతిమానితా-తనను గుఱించిన పూజ్యాతిశయభావనయొక్క అభావము ఈ 24న్ను దైవీసంపదలు.

2. ఆసురీ సంపద—

(1) దంభము-ధర్మమోటమి(2) దర్పము-ధనమున్ను తన జనమున్ను నిమిత్తముగా నగునట్టి తన ధనము తన జనములను గూర్చిన గర్వము (3) అతిమానితా-తానే గొప్ప వాడు అను పూజ్యతాతిభావము. (4) క్రోధము-ఈ వికార ప్రసిద్ధిగాచేయతగిన కార్యమాధ్యత, (5) పారుష్యము-కఠిన వాక్కు అనగా కళ్లు గలవానిని గ్రుడ్డివాడనుట. (6) అజ్ఞానము-అవివేక జ్ఞానము లేక భ్రమ జ్ఞానము (మిథ్యా ప్రత్య

యము) ఇది కర్తవ్యము, ఇది అకర్తవ్యము, అను వివేక రాహిత్యముచేత కలుగు మౌఢ్యము లేక అజ్ఞానము. ఇది ఆసురీసంపదగలవారికి పుట్టుగుణములు లేక వాని కార్యములు కనుక దైవీసంపద నిన్ను తరింపచేయును. ఆసురీ సంపద నిన్ను బద్ధునిచేయును. నీవు దుఃఖింపకుండ దైవీ సంపద విస్తారముగ చెప్పినాను ఆసురీసంపద లక్షణములను ఇంకను క్రింద చెప్పుచున్నాను. నీవు దైవీ సంపదనుఅవలంబింపుము.

(1) ఆసురీ సంపదగలవారికి శుచి, ఆచారము, సత్యము లేనందునను వారి ప్రవృత్తియు, నివృత్తియుకూడ ఆసురీ సంపదచే కలుగు భావమే. వారు లోకాయతికులగుచు ఈ అసత్యజగత్తు కామ హైతుకమే అనగా స్త్రీపురుష సంయోగమువలననే జగత్సృష్టియును, అట్టి సంయోగము లేమియే (అనగా స్త్రీపురుష శుక్ల శోణిత సంయోగము లేని స్థితియే.) లయమును్న అగుచున్నది. అందుచేత నీ జగత్తుకు కర్తగా ఈశ్వరుడే లేడు అని లోకాయతికాసురీభావులు చెప్పుదురు. ఆ దృష్టిననుసరించి ఆత్మజ్ఞానము వారికి నశించును. అందు చేత వారు ఆత్మహంతకులే. ఇటుల వారికౌతికలనాశ్రయించి చచ్చేవరకు కామ భోగములననుభవించుచు ఆశాప శబద్ధులై నరక ప్రాప్తి చెంది క్రిమముగ, పాము, తాటిబండల జన్మ లెత్తుదురు. ఇటులను వారు పరమ అజ్ఞానులై యుండుటచేత వారికీలోకములోగాని, పరలోకములోగాని, (స్వర్గాదిలోకము జన్మలేనేలేదు. కారణము శాస్త్రవిరుద్ధమగువారిప్రవర్తనయే. కనుక శాస్త్రప్రమాణముననుసరించి అంగీకరణము చేయతగు నది చేయతగనిది చర్చించి శాస్త్రవిధిననుసరించి కర్మ

చేయతగునని శ్రీకృష్ణపరమాత్మ దైవాసుర సంపద్విభాగ యోగాజ్ఞోపదేశమును ముగించెను. జీవు డీ శాస్త్రవిధి నాచరించిన కలుగు ఫలము నీ క్రింది పద్యములలో క్లుప్తముగ వివరింపబడుచున్నది.

సీ. నిత్యాగ్నిహోత్ర జనిత పుణ్యమును పాప
నాశ పూర్వకముగ నమలచిత్త
మగుఁ; యుక్తి సంసార మర్మమెఱుఁగగను
విరజత్వమలవడుఁ విరతిముక్తి
నిచ్ఛింపఁదగ యమూనిత్యాది సాధన
ములు జీవికలవడ ముక్తకర్మ
పదగుడై పరివ్రజింప శ్రవణాదుల,
యందొక్కయోగము నమరఁశుద్ధ

తే. గీ. చిత్తమున్ముఖత గురుసూచితపు తత్త్వ ।
మసి మహావాక్య లక్ష్యార్థ మవగతమగు ।
నహము, బ్రహ్మాస్మ్యనెగను జ్ఞానైకరసము ।
చిత్త శుద్ధ్యున్ముఖరమునె చేయు కర్మ;॥

సీ. మా. పరగ జీవునికర్మ ఫలశేషమిటు పున;
ర్జన్మయును సశరీరత్వమిడుట।
నశరీరతకు నిత్యనైమిత్తికముల జీ
వి స్మార్త శ్రౌతపువిధి నకర్మ
ఫలమునుగననైన బ్రహ్మకర్మసమాధి;
యజ్ఞఫలముగను, అగ్నిహోమ ।

'మన్న వానన్నాద' మనుభావియుగనైనఁ
విశ్వదేవుల కనర్పితమదియున
నన్నమేః పంచసూనపు దోషరహితత్వ
శ్రౌతవైశ్వానర సత్రియజ్ఞ।
మునదె; సాధనాధికృతుండుగ నిఁక శాస్త్ర।
శ్రవణ మననాదులను సంశయవిరహితుఁడు
గనగుఁ నిర్వాసనన్ జీవుఁ డునగుబ్రహ్మ।
బోధనాచార్యు నుపదేశమొంది రామ॥

దైవీ సంపదచేతనగు జీవుని నిత్యాగ్ని హోత్రపు అనాసక్త కర్మవలన (అనగా కామ సంన్యస్తముగ సంకల్ప కర్మ ఫలములను బ్రహ్మయందు త్యాగముచేసి నందున పుణ్యాపాపముల నాశ సంకల్పబలమున అవి నశించుటచేత చిత్తము విశుద్ధమగుటకు ప్రారంభమగును. ఈ జననమరణ రూప సంసార మర్మమును శాస్త్రయుక్తిచేత తెలుసుకొనగా వైరాగ్యమలవడి రజోతమోగుణ ప్రాబల్యము నశించి దాని వలన కర్మలు వాటంతటవే లుప్తమగును. చిత్తశుద్ధమున్ముఖము కాగానే అమానిత్వాది 25 గుణములు ఉన్ముఖమగును. ఇదియే అనాసక్త కర్మఫలము. వీటి వలననే జీవుడు మోక్ష ప్రాప్తిని బ్రహ్మస్పర్శచేత నొందును. అందుచేత అమానిత్వాది గుణములు ప్రారంభముకాగానే వేదాంత విచారము మహావాక్య విచార పూర్వకముగ, ప్రారంభింపవలయునని దీని సారాంశము. అందుచేత వైరాగ్యోపేతుఁడు అగుచు మనస్సన్యాసమునుగాని, బాహ్య దండాదిధారణరూపసంన్యా

సమునుగాని ప్రారబ్ధానుసారముగ నవలంబించి, శ్రవణ, మనన, నిదిధ్యాసన, జ్ఞానయోగములలో నేదే నొక్కటి కలిగియుండుట చేతనున్ను, అప్పటికే శుద్ధచిత్తమున్ముఖము ఐయుండుటచేతనున్ను, గురువు సూచించిన అనగా సూత్రప్రాయముగ (క్లుప్తముగ) బోధించిన 'తత్త్వమసి' మహావాక్య లక్ష్యార్థము అగు జీవ బ్రహ్మైక్యజ్ఞానము అతనికి అవగత మగును. (బోధపడును) ఆ జ్ఞానవృత్తి ఫలముగానే 'అహం బ్రహ్మాస్మి' అను మహావాక్య లక్ష్యార్థమగు తాను బ్రహ్మనే యగుదునను జ్ఞానమును అశ్వపతి, జనకులవలనే అనుభవిం చును·అందుచే బ్రహ్మజ్ఞానానన్యమే బ్రహ్మయగుటనుఅనగా జీవునికి అలవడినబ్రహ్మవృత్తిలోదానికనన్యమగు బ్రహ్మయే ప్రతిఫలించుటను లేక బ్రహ్మ విషయీకరించుటను బ్రహ్మ త్మానన్యమగుటచేత అతి వ్యాప్తి దోషములేకుండానే జీవుడు బ్రహ్మగానే మిగులును; అనగా శుద్ధజీవుడున్ను, బ్రహ్మ యున్నుకూడ స్వప్రకాశ జ్ఞానస్వరూపులేయగుటచేత ప్రజ్ఞా నము లేక జ్ఞానైకరసమే ఫలముగ ప్రదీపదీప్త్యైక్య న్యాయ మున బ్రహ్మ ప్రాప్తి కలుగుచున్నది.

ఇటులను చిత్తశుద్ధి యున్ముఖరమునే కర్మఫలము నిచ్చుచు అంతట నశించును. అదిమఱువకూడని విషయమని జ్ఞాపకముంచుకొనవలెను. అటులకాక నింకను కర్మచేయు చుండిన నష్టమేమనగా లోగడ ఉదహరించునటులను అట్టి కర్మఅనాసక్త కర్మకాక కర్మఫలమగు పునర్జన్మను కలుగ చేయుటయు అనగా పునర్జన్మలో శరీరధారి జీవుడగుటయు, శరీరప్రాప్తిఫలముగ తిఱిగి ధర్మాధర్మ విచారణయు కలుగు

చుండునని తెలియపఱుప బడియేయున్నది. కారణమేమనగా అనాసక్తకర్మి అమానిత్వాదులు పొడగట్టగానే జ్ఞానానుభవమును మహావాక్య విచార ఫలముగ నొందును. కేవల కర్మినడత నదీ ప్రవాహపతిత పురుగునడతతో పోల్పఁబడియున్నది. (గర్భోపనిషత్ చూడుడు.) అందుచేత శరీరనిరభిమానమునకై (అశరీరత్వమునకై) జీవుడు ప్రయత్నింపవలసిన ఆవశ్యకము కలుగుచున్నది. దానికై విధికర్మలను అనగా నిత్యనైమిత్తిక విధికర్మలను అనాసక్తి కర్మ (అకర్మ) లనుగనే చేయవలయును. మఱియునాకర్మలనుబ్రహ్మకర్మసమాధిగనే వాటిని అగ్నిషోమమున్ను అన్నవాన్, అన్నాద; అను భావముతో యజ్ఞములుగ చేసినయెడలనే (అనగా వైశ్వానరరూప బ్రహ్మకర్మగానే అనగా ఆకర్మఫలము తనదేమిన్ని కాదను భావముతోనే) చేసినయెడలనే అకర్మలదియగుచు ఆజీవి వైశ్వదేవము చేయకున్నను, అట్టి జ్ఞానవృత్తి కలిగిన అనాసక్తకర్మి భుజించినలేక. అనుభవించిన అన్నమున్ను పంచసూనముల దోషములు లేనటువంటిశ్రోత వైశ్వానర, సత్రియజ్ఞ శిష్టాన్నమే అగును. ఇట్టివాడు సాధనచతుష్టయ సంపదను కలిగితర్వాత కలిగిన కించిత్ సందేహములను (తన మనోవృత్తిలోగాని లేక ఇతరుల చెప్పుటచేతగాని) స్వాధ్యాయానంతరము కలిగినవాడై, బ్రహ్మశాస్త్ర, శ్రవణ, మనన, నిధిధ్యాసల నన్నింటిచేతగాని, లేక ఏఒకటిచేతగాని, రెంటిచేతగాని, 1 అసంభావన 2 విపరీతభావన 3 సంశయభావనలను పోగొట్టుకొనుట మూలముగ నిర్వాసితుడు (అనగా వాసనలులేనివాడు.) అగును. దానిఫలముగనే, శుద్ధసత్వమనో

రూపుడగుచు దాని అనన్యమగు బ్రహ్మగానే శుద్ధజీవుడగు చున్నాడు. ఈబ్రహ్మబోధ బ్రహ్మశాస్త్ర చార్యోపదేశము వలననే ఇటులను గట్టిపడుచున్నదని తెలియనగును. అందు చేత కర్మచేతనే మోక్షము కలుగునని తలంపక బ్రహ్మస్పర్శ యుత అనాసక్త కర్మచేసి మోక్షము సిద్ధించుటకు పైమెట్టు ను మేడఎక్కుటకు మెట్లునెక్కునటులను ఎక్కుచుండవలెను. అనగా అనాసక్తకర్మయోగము, ధ్యానయోగము, అమా నిత్వాది, జ్ఞానాభ్యాసయోగము, సాధనచతుష్టయసంపద, మహావాక్యవిచారణ పూర్వకశ్రవణ, మనన, నిధిధ్యాసన లన్నిగాని, ఒకొక్కటిగాని మోక్షఫలమునొందువఱకు ఆచ రింప వలయును అనుపరమార్థమును, "స్వాధ్యాయద్వైస్తాద్వి జిజ్ఞాసా।" నాన్తరు త్స్వవణమనాను శ్రివికాణామ్।" "బ్రా హ్మణముద గ్రిమేషణాత్।" స్వతః ప్రోద్భవా దమానాద్యం సాధనమితరేషామ్।" "నిర్వాసనాచార:।" (సి. సూ. 4-2-20-22). 4-4-9; 4-4-4)

అను ప్ర॥లు చెప్పుచున్నవి. ఇటులను దైవీ సంపదోప దేశమును భ. గీ. అ16 శ్లో 16లలో ముగించెను. సారాంశ మేమనగా సత్వగుణమువలననే దైవీ సంపదను వృద్ధిచేసు కొనిననే శుద్ధ సత్వగుణోపేతుడున్న, శుద్ధ సత్వగుణానన్య మగు బ్రహ్మలేక మోక్షమును పొందుననిన్ని, జీవునకుఅదియే సంపాదనీయమనియు అగుచున్నది.

సంపద్విభాగ యోగాఖ్యముసమాప్తము

---

పదునేడవ అధ్యాయము
పంచమ శ్రద్ధాత్రయ విభాగ యోగాజ్ఞము

శ్రద్ధాంతఃకరణములు కలవారే జీవులు కావలసి యుండుటను ఈ శ్రద్ధ 1 సాత్వికీ 2 రాజసీ 3 తామసీ అని మూడు విధములుగ విభజింపబడి వివరింపబడు చున్నది. 1. సత్వగుణోపేతులు, సాత్విక శ్రద్ధాన్వితులు, 2. యక్షరాక్షసులు, రాజస శ్రద్ధాన్వితులు, 3. ప్రేత భూతగుణములు కలవారు తమో శ్రద్ధాన్వితులుగ విభజితులు. అందుచేత 1. సత్వస్వభావులు శుద్ధ సాత్వికస్వభావులుగనున్ను 2. రజో స్వభావులు యక్షరాక్షస స్వభావులుగనున్ను 3. తమో స్వభావులు, ప్రేతలుగనున్న (1.సం ఘాతమరణముచే అకాల మృత్యువు నొందినవారున్ను 2. సపిండీకరణవఱకుచనిపోయిన సూక్ష్మజీవులున్ను 3. బ్రతికియున్న జీవులందు మోహము వదలక మరణానంతరము, పిశాచములలైన సూక్ష్మజీవులుగ సంచారులున్ను) సంచరించుచుందురు. శ్రద్ధయనగ శ్రీ శంకర భాష్యము అ 17 శ్లో 17లో ఆస్తిక్యబుద్ధిః అఫలాకాంక్షిభిః అని నిర్వచించుచున్నది. భాగవతములో అంతటను ఏకభగవత్స్వరూ అని చెప్పబడినది. ఇచట అనాసక్తకర్మి యొక్క ఆస్తిక్యబుద్ధి అనగా అంతటను ఒకే బ్రహ్మస్వరూ యని లోగడే సిద్ధాంతమైనది. అ17 23 శ్లోకములో యజ్ఞ దానతపో క్రియలు 'ఓం తత్సత్' నిర్దేశ్యముగ చేయువాడు అని అర్థము చెప్పబడగా బ్రహ్మ ఓం అనే అక్షర ప్రతీకమగుచున్నది. 'తత్' అనిన్ని సత్ అనిన్ని రెండేసి అక్షరములనున్ను యజ్ఞదాన క్రియలలో కలపవలెనని 25,26

శ్లోకములు చెప్పుచున్నవి. ప్రతి అక్షరమున్ను మూడు అంత ర్భాగములుగ నిర్దేశింపబడుచున్నవి. బ్రహ్మ మఱొక విధ మున నిర్దేశింపఁ వీలు లేనందున 'ఓం' అని యుచ్చరింపబడుచు జ్ఞాపక మగుచున్నది. మాయావియగు బ్రహ్మయున్ను, బ్రాహ్మణులున్ను, యజ్ఞములున్ను, ఈ మూడు విధములుగ బ్రహ్మయని తెలిసిన జ్ఞానముచేతనే సృష్టింపబడిరి. మఱియు అద్వైతము, ద్వైతము, విశిష్టాద్వైతముగ నీ బ్రహ్మ ఒకటే ననే అంతరార్థముతో ఈ దృశ్యనామరూప ప్రపంచ సృష్టి చేయబడినదని అర్థము. ఓం (అ+ఉ+మ+ం) యొక్క సంధియే 'అ' వాయు బీజము, అధిదేవత పరమాత్మ (బ్రహ్మ) ఫలము మోక్షము (మృత్యుంజయం)ఉ; భూబీజము అధిదేవత ఉమామహేశ్వరుడు, ఫలము బలిదానము. 'మ' ఆకాశబీజము, అధిదేవత కాలరుద్రుడు, ఫలము స్తంభన, ద్వేషణ, మోహన. వీటి అన్నిటియొక్క ఐక్యము అర్థాను స్వారము అగుచున్నది. ఇటుల ఓం సంయుక్తాక్షరమున్ను అగుచు ఏకం సత్ (ఒకే సత్ అను బ్రహ్మపదార్థము, వ్యాప్య వ్యాపక వస్తువున్ను శక్తి బీజమున్ను అగుచు వాటి ఐక్య మగుచున్నది. విప్రియనగ 9 అధ్యాయములో నిర్వచించి నటులను ఒకే బ్రహ్మ పదార్థము ద్వైతముగ ప్రకృతిలో నున్ను, విశిష్టాద్వైతము అనుస్యూతముగ అనేక ఉపాధిగత మగు నామరూప ప్రపంచములోనున్ను ఒకే స్వప్రకాశ వస్తువుకాగా అది అజ్ఞానులచేత అనేకమని చెప్పబడుచున్నది. ఋ. 10-82-3 ఋక్కున్ను భ. గీ. 9 అధ్యాయము లోని విషయచోదనాయున్ను చూడనగును. అందుచేతనే ఈ

అక్షరము "ఓం" సగుణ నిర్గుణ ప్రతీకముగ ముముక్షువులగు బ్రహ్మ వాదులచే చెప్పబడుచు ఉపాసింపబడుచున్నది. అందుచేత వారు మోక్షగాములగుటచేత యజ్ఞదాన తపో క్రియలయొక్క ఫలత్యాగసూచనగ 'ఓం' కు 'తత్' అను నది అనుసంధించి ఆ కర్మాది కలాపమును చేయుదురు. పై కర్మకలాపము ఈశ్వరార్పణ చేయుటచేత అందులో నున్న 'స్థితి' అనగా వివాహాది అసత్ కర్మలలో దాని ఫల మగు పుత్రాదియు ఇతర సత్ఫలమంతయు, అసత్ లోను సత్ అగుట వలన ఓంకు 'సత్' కూడ సాధుభావార్థముతో నున్ను అనుసంధించి వారు చేయుచుందురు. ఇటులను ప్రతి కర్మానంతరముననున్ను కర్మఫలత్యాగము బ్రహ్మయందు మోక్షగాములు (1) ఓం తత్ సత్ (1) ఓం తత్ (3) ఓం అని ఉచ్చరించుచు, ఫలమును, ఉదకమును, విడుచుటమూల ముగ బ్రహ్మకు నర్పింతురు. ఇటుల అకర్మనిగూర్చి అతడు ముముక్షువు అగుటను బ్రహ్మార్పణ చేయు విధము నుడువ బడినది. ఈ సన్ పదమహాత్మ్యము భ. గీ. 2-16 శ్లో శంకర భాష్యములో విశేషముగ వివరింపబడినది. చూడనగును. క్లుప్తముగ సణ్ఘటః అనుచోట సత్పదార్థము యొక్కయు ఘటమను అసత్పదార్థముయొక్కయు బుద్ధులున్నవనిన్ని, సత్పదార్థము భావపదార్థమున్ను, ఘటపదార్థము అభావ పదార్థమున్ను అగుచు, 'సన్ఘటము = ఘటో స్తి అను అర్థము నిచ్చు ప్రకృతిత్వ పదార్థములో అస్తి లేక ఉనికిని తెలుపు సత్పదార్థము లేక భావ పదార్థము 'భా' రూపః (ఛాం—3-14-2) ప్ర॥ చేత ఘటములో అంతరీక్షణముగ

ననుస్యూతముగనుండి ఘటమగు అసత్పదార్థమును చేతనము చేయుచున్నది. అని అర్థము. అటులనే 'పటో_స్తి' అనుచోట కూడా ఈ సత్పదార్థము అంతరీక్షణముగ ననుస్యూతముగ నుండి అసత్పదార్థమగుపటమునున్ను చేతనముచేయుచున్నది. అందుచేత నీ సత్ లేక భావపదార్థము అన్ని అసత్పదార్థములలోనున్న వివ_ర్తమగుచు అంతరీక్షణమగుటనుపరమకారణమగుచున్నదని "అథభావా ద్వా వావ అంతరీక్షేభ్యః(సి సూ. 1_1-1) భ. గీ 2-16న్ను ప్రి॥ అగుచున్నది. మా చేతరచితమగు సిద్ధాంత దర్శన నృసింహీయవ్యాఖ్య (సి. సూ. 1_1)కి చూడనగును. భ. గీ. 2_16 శ్లోకములో ఉభయోరపిదృష్టః అంతః తు అనయో త_త్త్వ దర్శిభిః" అనుటచేత ద్వైతాద్వైతములుగ ఒకే బ్రిహ్మ అనుస్యూతముగ నున్నటులను త_త్త్వ దర్శిః అనుటచేత పై అర్థమును తెల్సుకొన్నవాడే జ్ఞానియగునని అర్థము. క్లుప్తార్థము.

## లక్ష్యార్థ సామానాధికరణము

సత్పదమునకున్ను, అసద్ఘట పదార్థమునకున్ను లక్ష్యార్థముగ సామానాధికరణార్థము ఎటుల నగుచున్నదనగా సన్ ఘటః అను చోటను సత్ పదమునకు 'ఉనికి అని లేక ఉన్నది' అని అర్థముకాగా అది స్వతంత్రముగనే అర్థకమగుచున్నది. పట, ఘటములకు సన్ సమానాధికరణము లేనియెడల అర్థముకాదు. అందుచేత సత్ చేతనవాచియున్ను ఘటపటములు అచేతనవాచకములున్ను అగుటచే ఘటపటములలో లక్ష్యార్థక సత్ వుంటేనే అర్థమగుచున్నదని గ్రాహ్యము. ఈలక్ష్య

బ్రహ్మ పదార్థము అన్ని జడపదార్థములలోనున్న అనుస్యూతముగా నుండి చేతనము చేయుచున్నది. అందుచేత ఈ సత్ సమానాధికరణ్యము నీలోత్పలములో విశేష నీలపద సమానాధికరణ్యము విశేష్యము అగు ఉత్పలముతో వలెనే కాదని రూఢియగుచున్నది. భాష్యములోని సమాసపదము— ' సామానాధి కరణ్యే ననీలోత్పలవత్" [సన్ ఘటః సన్పటః సన్హస్తీతి అను పాఠము.] సాధువగుచున్నది. ఇచట రెండు బుద్ధుల సామానాధికరణమున్నది సత్ బుద్ధి, ఘటబుద్ధి; సన్ బుద్ధి పట బుద్ధి; సన్ బుద్ధి, హస్తిబుద్ధి అందుచేత వస్తుభేద బుద్ధులకు సామానాధి కరణ్యమగునను నది సాధుపాఠము. అనగా "వ్యావృత్తమనువృత్త మితి ఏకసిద్ధమ్" కార్యేఘటే అసద్బుద్ధి విషయస్య జగత్యనుగతా, సర్వజగత్కారణస్య 'సత్' బుద్ధి సర్వజగత్కారణస్య సత్తా ఆత్మనః సచ్చిదానంద రూపస్య ధర్మాః సత్తా సచ్చిదానందాః ఇచ్చట తైత్తరీయ బ్రహ్మానందవల్లిలోని శ్రీ భగవత్పాద శంకరాచార్య విరచిత ప్రథమానువాక భాష్య మనుసంధేయము-"తస్మాత్ సన్ పట ఇతిసామానాధికరణ్యే సత్పదం ఆచార్యైః లక్ష్యార్థ బ్రహ్మణః అవోచత్, నహివాచ్యార్థః" సమానాధికరణేన | నీలోత్పలవత్ । ఇతిరివ బ్రహ్మణః అవాక్యార్థత్వాత్" అని చెప్పబడుటచేత "సామానాధికరణే ననీలోత్పలవత్ అను లక్ష్యార్థ సామానాధికరణ్యమే శ్రీ శంకరభాష్యానుసారము సమీచీనమగుచున్నదని స్పష్టమగుచున్నదనిన్ని, 2. సామానాధకరణేన। నీలోత్పలవత్ అను పాఠము విశేషణ విశేష్యముల సామానాధికరణ్యముచేత వాక్యార్థము కొందఱు చెప్పి

నటులను కాదనిన్ని నిర్ణిక్తమని గమనీయము. మేముచూచిన భాష్యప్రతులలోని పాఠముపైన మే ముదహరించిన మొదటి పాఠ మున్నదిగాని ఈ 2 వ పాఠము లేనే లేదు. మఱియు నీ చివరి పాఠముపై తైత్తరీయ శంకరభాష్య ప్రవచనముచే బాధితమగుచున్నది. ఈ విమర్శనాత్మక గ్రంధములో 'సత్' పదమహాత్మ్యము ఇంతవిస్తృతంగా వివరించబడుచున్నది. అందుచేత సత్ సత్పదార్థముయొక్క అనుస్యూతముగానే అసత్ (అచేతన)పదార్థములు చేతనములగుచున్నవని సిద్ధాంతమగుచుండగా అచేతన పదార్థములన్నిటిలోను అనుస్యూతమగు ఒకే సత్పదార్థముగానే గోడమీదబొమ్మ గోడగానే సత్యమై నటులను, సత్యమగుననియున్ను, నామరూపద్వైత పదార్థములు గోడమీద బొమ్మవలె, అసత్యమనియు నిర్ణిక్తమే. భ. గీ. 2-16 శ్లోకము నుడువుచున్నటులను ఈ ప్రకారము అసత్ వలన భావములేక సత్ కలుగదనిన్ని, సత్ వలన అసత్ (అభావము) కలుగదనిన్ని, ఈ రెంటియొక్క అంతమును తెలుసుకొన్నవారే అనగా ఒకే పరమాత్మ అద్వైతముగ నున్ను, ద్వైతముగనున్ను ఉన్నదను లేక, 'భా' భాస్యములుగ నుండగా వాటిలోఒకే బ్రహ్మఅనుస్యూతముగ యున్నదనిన్ని ఆబ్రహ్మ అద్వైతముగానే ఉన్నదనునట్టిన్ని, ద్వైత విశిష్టాద్వైతముగానే ఉన్నదనునట్టిన్ని అగుభావములయొక్క అన్తః అంతకాలమును తత్త్వజ్ఞానులు (1) ఏకంసత్, విప్రా బహుధావదంతి। (ఋ. 10-82-3)

" నాసతో విద్యతేభావో నాభావో విద్యతేసతః
ఉభయోరపిదృష్టోఽన్త స్త్వనయోస్తత్త్వ దర్శిభిః॥ భ॥గీ.2-16

అను ప్ర॥ చే గమనించుచున్నారు. అనగా ద్వైతైక్యపద నిర్ముక్తియనే ఆబ్రహ్మను భావించుచున్నారని అర్థము. లేక అంతయుబ్రహ్మగనే సత్యమనియు నామరూపఘట పటాదిగ అసత్యమనియు తెలుసుకొనుచున్నారు. అనునదే నిర్ణిక్తము. ఈసందర్భములో ప్రథమ షట్కములోని 2 వ అధ్యాయము లో 2–72 శ్లోక విశేషార్థము అంతకాలమునకు చూడనగును. అదియే అంతభావము. అనగా "భా" భాస్యములుగను లేక ప్రకాశ, ప్రకాశ్యములుగను లేక అద్వైతద్వైతములుగను ఒకే బ్రహ్మయున్నదను జ్ఞానమేతత్త్వదర్శనము లేక బ్రహ్మజ్ఞాన మని అర్థము. అట్టి బ్రహ్మజ్ఞానియొక్క జ్ఞానమే అనన్యముగ బ్రహ్మయగుననియు అనగా అట్టితత్త్వజ్ఞజీవుడే జీవించియుండ గనే బ్రహ్మయగుననిన్ని, "బ్రహ్మవేద బ్రహ్మైవభవతి।" (ముండక 3–2–9) అనుప్ర॥చేత విపులముగా వర్ణింపబడుచున్న దని తెలియనగును. అందుచేతనే అట్టివానిశ్రద్ధ ప్రకృతిలో సర్వత్రబ్రహ్మస్పర్శయేయగునని వేఱుచెప్పనక్కరలేదు. శ్రద్ధ= (శ్+అ+ర్+ధ్+అ+ఫ్) లసంధికాగా 'శ్', ఆక సబీజము, అధిదేవత, శివుడు. ఫలముమోక్షము. అ వాయు బీజము, అధిదేవతబ్రహ్మ. ఫలముమృత్యుంజయము లేక మోక్ష ము. 'ర్', అగ్నిబీజము, అధిదేవత అగ్ని. ఫలము రౌద్రకర్మ సాధన. ధ్ ఉదకబీజము. అధిదేవత ధన్వంతరి, ఫలము విషజ్వర విషనాశము. అందుచేత జీవుడుచేయు పుణ్యపాపము లను (విషములను) లెస్సగా దగ్ధముచేసి కేవలము బ్రహ్మ యొక్కటే వ్యాప్యవ్యాపకవస్తువుగ అంతటనునిండియున్నదను అర్థముచేత 'శ్రద్ధ' పదము సార్థకమే అగుచున్నది. ఇది

శుద్ధ సాత్త్విక గుణ ఫలమున్ను అగుచున్నది. ఇటుల నన్నిటి యందున్ను శ్రద్ధావస్తువగు బ్రహ్మను స్పృశింపక చేసినకర్మ అశ్రద్ధ కర్మయగుచు అసత్ కర్మ అగును. అట్టి కర్మ బ్రహ్మ చేసినను ఫలమీయనే ఈయదు. సత్కర్మ లేకశ్రద్ధాకర్మయే బ్రహ్మకర్మ లేక జ్ఞానయుతకర్మయగుచు ఫలకారియగుననిన్ని అసత్ కర్మ లేక అజ్ఞానయుతకర్మ చల్లార్చిన బొగ్గులలో నేయి పోయు హోమకర్మవలె నిష్ఫలమనియు ఛాందోగ్య శ్రుతులు 5-24-1-3, 5-10-7 కఠ 1-2-6 ప్ర॥ లు చెప్పు చున్నవి. విద్యదవిద్యాత్కర్మ ఫల వివరణ అ. భా. 9 వర్ణకం ధర్మ జిజ్ఞాసాఫల శీర్షికలో చూడనగును. అందుచేత అశ్రద్ధ కర్మ ఇహలోక ప్రాప్తినిగాని పరలోక ప్రాప్తినిగాని ఈయదని తెలియనగును అనిన్ని, శాస్త్రవిధిననుసరించి శ్రద్ధతో చేసినదే శ్రద్ధాయుక్త కర్మయగునన్ని.

శ్లో॥ త్రివిధంభవతి శ్రద్ధా దేహినాం సాస్వభావజం
సాత్త్వికీ రాజసీతామసీచేతి తాంశృణు॥ భ. గీ. 17-1 శ్లో
అశ్రద్ధయాహుతందత్తం తప స్తప్తం కృతంచయత్ ।
అసదిత్యుచ్యతే పార్థ! నచతత్ప్రేత్యనో ఇహ॥ 17-28

వఱకు శ్లోకములలో చెప్పెను. మోక్షగామియున్ను అగు అనాసక్త కర్మయోగి శ్రద్ధాన్వితముగ యజ్ఞదాన తపో కర్మలను ఫలములను కోఱకనే 'ఓం తత్ సత్' అని ఉచ్చరించుచు బ్రహ్మకర్పించిన ఫలముగ మోక్షమును చెందునని శ్రద్ధాత్రియ విభాగాజ్ఞోపదేశమునుముగించెను. ఈ విషయమే ఈ క్రింది పద్యములలో క్లుప్తముగ చెప్పబడుచున్నది.

కం॥ ఫలనిరిహాకర్మ బ్రహ్మ
త్మలమ్మైక్యోపాసనభ్రమరకీటుమటుక్
వలె, నద్వైతా ప్తికి జీ
వు లోనరుపంగ శుద్ధ చిత్తపుఫలమదియిడుక్ అ.భా. 1వ

తే. గీ॥ ధర్మము నధర్మ ఫలములు త్తమమునీచ।
జన్మలను తారతమ్యపు సాధనలను।
గతియు నాగతి, సంసారగతుల నిడవి
బ్రహ్మమాత్మ యవధి యను ఫలము నిడువు॥అ.భా.వ9

అనాసక్త కర్మయున్ను, భ్రమర కీట న్యాయమున నిర్గుణ బ్రహ్మైక్యమునకు జీవులు 'అహంబ్రహ్మాస్మి' అనుచు ఉపాసనను న్ను చేయగా శుద్ధ చిత్త ఫలము కలుగును. ధర్మముయొక్కయు అధర్మముయొక్కయు ఫలములు వారి సాధనల తారతమ్య ఫలితముగానగు ఫలములను అనగా ఉత్తమ నీచ జన్మలను కలుగజేయును అవి గతి (పరలోకగమనము) ఆగతి (ఇహాలోకాగమనము) అని చెప్పబడు మరణ జనన రూపకర్తృత్వ భోక్తృత్వ రూప సంసార గతులనే కలిగించుచున్నవి బ్రహ్మాత్మ యవధి లేక జీవ బ్రహ్మైక్యము అను మోక్షము లేక తీరస్థానమును జీవునకు (సాధకునకు) అవి కలుగ జేయవు. అందుచేత ఫల నిరహాకర్మద్వారానే (అనాసక్త కర్మ ద్వారానే) జీవ బ్రహ్మైక్యజ్ఞానము లేక జ్ఞానైక రస ఫలము అనునది జీవుడు సంపాదించుకొనవలెను.

శ్రద్ధాత్రియ విభాగ యోగాఙ్గము సమాప్తము

— —

## పదునెనిమిదవ అధ్యాయము

## షష్టమ మోక్ష సంన్యాస యోగాజ్ఞము

అంతట సంన్యాస, త్యాగ తత్త్వోపదేశము అర్జునుని చేత అడుఁగబడి శ్రీకృష్ణుడు పరమాత్మ ఇటులనుపదేశించెను. 1. సంన్యాసమనగా కామ్యకర్మల న్యాసమే 2. సంకల్ప సర్వకర్మ ఫలత్యాగమే త్యాగము అని పండితులు చెప్పుదురు త్యాగము మూడు విధములుగ విభజితము. యజ్ఞ దాన తపో కర్మలు త్యాజ్యములు కావు అనే శ్రీకృష్ణుని నిశ్చితాభిప్రాయము. ఫలత్యాగ కర్మ మనుజులను పావనముచేయును. ఇటులను అసజ్జముగ చేయుటయే శ్రేష్టమని నా నిశ్చితాభిప్రాయము. ఏ నియత కర్మచేసినను దాని యందనురక్తి (సజ్జమును) వదిలి, ఫలము బ్రహ్మార్పణము చేసిన అట్టి త్యాగము సాత్వికమని మా మతము. ద్వేషమను మల కలుషితము కానట్టిన్ని, అశ్రద్ధ లేనట్టిన్ని, కర్మలనుచేసి వాటి ఫలములందనురక్తిలేకున్న, అట్టి కర్మియే త్యాగియున్న, సత్వముతోకూడిన మేధావి (అనగా తాను విన్నది తన ఊహాచే నిశ్చయపరచుకొనునట్టిన్ని, అందుచేత అనగా తన బుద్ధి ఉత్ప్రేక్షశక్తి చేతనే) ప్రజ్ఞకలవాడున్న సంశయరహితుడున్న అగుచున్నాడు. దేహధారులకు కర్మలనన్నిటిని వదలుట, అశక్యమే. కామ్యకర్మలను ఎవడైతే సంన్యసించి సంకల్ప కర్మఫలములను బ్రహ్మయందే త్యాగముచేయునో వాడీసాధనల ఫలముగనే జ్ఞాని జితాత్మయగునని 18_49 శ్లోకము చెప్పుచున్నది. శ్రీకృష్ణపరమాత్మ కామ్యకర్మ సంన్యాసము,

కర్మ సంకల్ప ఫలత్యాగముయొక్క ఉత్కృష్టత్వమును మొదటి షట్కములోని కర్మాధ్యాయాజ్ఞములలో నిశ్చయించి అట్టి అనాసక్త కర్మి లేక గౌణ సంన్యాసియే రెండవ షట్కములో స్థిరపఱుప బడిన బ్రహ్మైకాంతికభక్తుడు అనిన్ని, ఇచట (మూడవ షట్కములో) కర్మ ఫలత్యాగి యున్న అగుననిన్ని సిద్ధాంతము చేసెను. ఈ భగవద్గీత అజ్ఞుడుగనున్న అర్జునుని ద్వారా ప్రతి అజ్ఞానిన్ని ప్రబోధితుని చేసి తరింపచేయుటకేనని మఱువకూడదు. అ18-3-4 శ్లో చూడుడు. మఱియు నటుల కర్మ త్యాగముచేసిన అకర్మిని అన్ని పుణ్యాపాపములనుండి తానే (శ్రీకృష్ణ పరమాత్మయే) దాటించెదనని అభయము నిచ్చెను. అనగా అట్టి అకర్మి జ్ఞానియే అగునని ఈ అధ్యాయములోని 63 శ్లోకములో ప్రదర్శించెను. మఱియు ప్రాకృతిక కర్మకు ఐదుకారణములున్నవనియు, ఆత్మయే కర్మచేయునని తలంచువాడు దుర్మతియని నిందించి, తుచ్ఛాహంకారము (దేహాది సంఘాతమే ఆత్మయను తలంపు) లేనివాడు కర్మ చేసినను చేయని వాడుగా అకర్మి యగుటను బంధరహితుడేనని చెప్పి ఆ కర్మఫలములు వానిని బంధింపవని ఈ క్రింది శ్లోకములలో నిర్వచించెను.

శ్లో॥ అనిష్టమిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్ ।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సంన్యాసినామ్॥

పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధమే ।
సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణాం॥

అధిష్టానం తథాకర్తా కరణంచ పృథగ్విధమ్ ॥
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్రపంచకమ్॥
భ. గీ. అం18-12-14శ్లో

శ్లో॥ శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతేనరః।
న్యాయ్యంవా విపరీతంవా పఞ్చైతేతస్యహేతవః॥

,, తత్రైవంసతి కర్తారమాత్మానం కేవలంతుయః।
పశ్యత్యకృత బుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః॥

,, యస్యనాహం కృతోభావో బుద్ధిర్యస్య నలిప్యతే।
హత్వాపి స ఇమాన్ లోకాన్నహన్తి ననిబధ్యతే॥
భ. గీ. 18-15-17.

ఇటులను కర్మలకు హేతువులు 1. అధిష్ఠానము 2. కర్త 3. వివిధకరణములు 4. చేష్ట 5. దైవము అనునవే. ఇటులను కర్మాన్తర్యమును తెలిసినవాడే వేదాన్తతత్త్వదర్శియు, కృతకృత్యుడున్ను, సర్వకర్మ సిద్ధిని తెలుసుకొను చున్నవాడు నగును. (1) అధిష్టానము:- కోటికయు, ద్వేషము, సుఖము, దుఃఖము మొదలగువానిని కనపరచు చుండునట్టిన్ని, వాటి యాశ్రయమున్ను అగు శరీరము (2) కర్త:-స్పైప్రకారమే కర్త్రోపాధి లక్షణమగు బుద్ధి, అదియే భోగించుటచేత భోక్త యునగును. అద్వైతభాలోని 4 వర్ణకములోని విశేషవివరణ చూడుడు. (3) కరణము:-శ్రోత్రాదికము, చక్షురాదికము మొదలగుననేక సంపుటి అనగా 12. (4) చేష్ట:-అనేక విధ ములగు చేష్ట- అనగా పదివిధములగు ప్రాణాదివాయువులు. (5) దైవము:-అధిదేవత పూర్ణరూపముగ కండ్ల కధిదేవత,

సూర్యుడు మొదలగు అధిదేవతలు లేక అధిదైవము. ఇటు లనుమనోవాక్కాయములచేతచేయుకర్మలేక ధర్మాధర్మకర్మకు పై ఐదున్ను కారణములు కాగా కేవల ఆత్మయే కర్తకర్మ కగునని తలంచువాడు. అజ్ఞానియు దుష్టమతియునగును. ఐతే కర్మలయందు శాస్త్రాచార్యోపదేశాన్తఃకరణము కలిగి నేను (ఆత్మ) కర్తను గాను, శాస్త్రములో చెప్పిన పైఐదున్ను అవిద్యాకల్పితములగుచు కర్మకుకర్తఅగును నేనుసాక్షీభూతు డనే, అప్రాణుడను, శుభస్వరూపుడను, అక్షరాతీతుడగు పరమాత్మను, అవికారిని, అనుభావుడు లేక పరిజ్ఞాత (అనగా అన్తఃకరణఉపాధికుడు) ఈ కర్మచేతనిబద్ధుడుకాడు; అనగా కర్మనుకర్మఫలమును అనుసరింపడు. ఇట్టి కర్మచేత నేను నరక స్వర్గముల ననుభవింపను అనుబుద్ధికలవాడు సుమతియు, కర్మ తంత్రము (సంగ్రహము) ను అంతయున్ను లెస్సగా తెలుసు కొన్నవాడున్ను అగును. అట్టివాడీ లోకమునంతను చంపినను చంపనివాడే. అట్టివాని భావము గుణములచేతనే కర్మలు చేయఁబడుచున్నవని అగుటను నిశ్చయాత్ముడేఅగును.

ఇటులను జీవన్ముక్తుడున్ను పై భావముచేత వైవిధ్యక్త కర్మను అభ్యాసముచేత నితరులచేత ప్రబోధింప బడి, చేసినను అతఁడకర్మి ఎటులగునో మహోపనిష విషయ సారాంశము అ5-71 73ప॥ చెప్పుచున్నది. ఈఅధ్యాయము చివరనున్ను, అద్వైత భా 10 వర్ణకములోనున్ను చూడనగును: ఇదియే క్లుప్తముగ,

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మ సంగ్రహః భ.గీ.18.18

శ్లోకములో పై కర్మచోదనా తిరిగి జ్ఞాన జ్ఞేయ, పరిజ్ఞాత అని త్రిపుటీ కలాపముగనున్నూ; కరణం, కర్మ, కర్త యను పరిజ్ఞాతగనున్న కర్మసంగ్రహము చెప్పబడు చున్నది. 1 జ్ఞానము అనగ అవిశేషమైన సర్వ విషయ జ్ఞానము లేక వృత్తి జ్ఞానమున్నూ అగును. 2 జ్ఞేయము అనగ సర్వవిషయాంతరవస్తు సామాన్య జ్ఞాతవ్య వస్తువున్ను 3 జ్ఞాత లేక పరిజ్ఞాత. లేక ఉపాధికుడు అనగా అవిద్యాకల్పితఉపాధులగు మనోబుద్ధులయొక్కయు ఆత్మయొక్కయు కూడిక యగు భోక్త యగును. పరిజ్ఞాత యనగ అన్ని కర్మలను ప్రవర్తింప చేయువాడు. లేక జీవుడని అర్థము. కర్మ సంగ్రహమున్ను మూడు రాసులుగ చెప్పబడుచున్నది. 1. కరణము – క్రియ చేయును అనుట చేత శ్రోత్రాది అన్తః కరణముగానున్న బుద్ధి మనో స్వరూపమున్ను కర్మచేయు కోటికలు లెస్సగా కలుగునది అనిఅర్థము. 2. కర్మ–స్వర్గాదిఫలరూప కర్మ 3 కర్త అసక్త కరణముచేత అవిద్యావంతుడు ఇక్కడ లక్షితుడు అవిద్యాకార్యమగు ఉపాధితాదాత్మ్యుడున్ను కర్మచేతవ్యాప్య మగువాడున్ను కరణవ్యాపారవంతుడున్ను, అధిష్టానలక్షణుడున్ను అనగా పరిజ్ఞాత లేక జీవభూతమని అర్థము అనిన్ని

శ్లో॥ జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణ సంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥

భ. గీ. 18–19 శ్లో లో పై ఆఱువిధముల భాగముల నున్ను తిరిగి మూడు రాసులుగ 1. జ్ఞానము 2. కర్మ, 3. కర్త అను మూడున్ను సత్వరజస్తమోగుణ భేదములచేత చెప్పబడుచున్నవి. అనగా 1 క్రియా 2. కారక 3. ఫలములలో

జీవేశ్వర విషయజ్ఞానము, సత్వ రజస్తమోగుణ సంఖ్యాభేద ము త మూడు విధములుగ 1. జ్ఞానము 2 కర్మ 3 కర్తగ కపిల సాంఖ్య శాస్త్రములో విభజింపబడిచెప్పబడియున్నది. అని అర్థము.

జ్ఞానము—1. జ్ఞానము-క్రియాకర్మ కారకము, దాని ఫలము. భోక్తవాటిలో (క్రియాకర్మ కారకములో) నన్నిటి యందు సుఖశబ్దముచేత గోచరమగు అకర్తృత్వ బుద్ధి ధరిం చిన అద్వైత సాత్విక జ్ఞానము గ్రాహ్యము. అనగా పృధక్త్వ ముగా కనపడు జ్ఞానములో కనపడు ఒకే జ్ఞానము 2. కర్మ- అసక్త కర్మ సాత్విక కర్మ అగునుగాని లోగడ నుడివిన పంచకారణత్వ కర్మ ఇచట జెప్పబడలేదు. కర్మ సంగ్రహ మన ఇచట అసమాసగతమైన బాహుళ్యమంతయు కర్మయే. ఇది కారకమగునని అనగా కర్తుం = చేయుట కొఱునదను వ్యాకరణ పారిభాషిక శబ్దమిచట చెప్పబడలేదు. 3. కర్త- అనగా క్రియ ( కర్మ ) నివర్తకుడు పైన ఉదహరించిన పరిజ్ఞాత. ఇతడు ముక్త సంగియు అసక్తకర్మియునగును. ఉపాధిక చిదాభాసుడు గ్రాహ్యము. ఇటులను కండ్లద్వారా చూచు కర్మచేయువాడు ఫలాసక్తముగ (అనగా సాత్విక కర్మ లను చేయువాడుఅనగా సాత్విక కర్త లేక పరిజ్ఞాతయు, సం కల్ప ఫలత్యాగియునగునని అర్థము. పై మూడున్ను తిరిగి విపులముగ గుణ విభాగములు క్రింద చెప్పబడుచున్నవి.

జ్ఞానము:- జ్ఞానము సాత్వికీ — జ్ఞానసాత్వికమనగా వివిధ భేదములగు భూతములలోను ఒకేవస్తువును భావించు జ్ఞానమేసాత్వికీ అగుచున్నది.

~ 2. జ్ఞానము రాజసీ—పృథక్త్వముగా అనేక వస్తువులు గాచూచుజ్ఞానమే రాజసీ.

3. జ్ఞానము తామసీ:—పాషాణ ప్రతిమాదులందే అనురక్తికలిగి వాటిలోనే భగవంతుడుండునని వస్తుస్వరూప మును గనుచుండు జ్ఞానము తామసీ.

కర్మ - కర్మసాత్వికీ—తనకునియతమైన కర్మయందు ఆసక్తియున్ను, రాగ ద్వేషములు లేకుండానున్ను ఫలమును కోఅకుండానున్ను అంతయున్ను బ్రహ్మమందే అర్పితము చేయుకర్మ సాత్వికీ. 2. కర్మరాజసీ కామనాకర్మ అహం కారముతోకూడి ఎక్కువ ఆయాసముతో చేసెడి కర్మరాజసీ 3. కర్మతామసీ:- తమోభావమును కలుగచేయునదిన్ని బంధము అగుటచేత నశింపచేయునట్టిన్ని హింసాపూర్వక ముగ చేయునట్టిన్ని, పౌరుష ప్రధానముగ చేయునట్టిన్ని కర్మ తామసీ. కర్త- 1 కర్తసాత్వికీ- ఫలసిద్ధ్యసిద్ధియొక్క సం బంధము లేకుండనే ధైర్యోత్సాహములతో కూడుకొని సిద్ధించినను లేకున్నను, నిర్వికారముతో నియతకర్మచేయు వాడు కర్త సాత్వికీ 2. కర్తరాజసీ- రాగము కలిగిఫలమును కోరుబుద్ధికలవాడున్ను, హింసచేయువాడున్ను, శుచికాని వాడున్ను, సుఖదుఃఖములకు లోనగువాడున్ను, అగు కర్త రాజసీ. 3. కర్తతామసీ- యోగయుక్తుడు కానట్టిన్ని, కేవ లము తనస్వభావమునే అనుసరించునట్టిన్ని, ఎవరికిన్ని సాష్టాంగ నమస్కారము చేయనట్టిన్ని, మాయావిన్ని, శక్తి గూహనకారుడున్ను (గూఢవిప్రియకారి) పరోపకార విచ్ఛే దనకారిన్ని, దీర్ఘాలోచన పరుడున్ను, అగు కర్త తామసీ.

—: మూడువిధముల బుద్ధియు చెప్పబడుచున్నది :—

బుద్ధి 1. బుద్ధి సాత్వికీ-: అన్ని ద్వంద్వబుద్ధులకు భేదము తరిచి తెలుసుకొంబుద్ధి బుద్ధి సాత్వికీ.

2. బుద్ధి రాజసీ-ధర్మాధర్మకార్యములను అయథార్థముగ తెలియుబుద్ధి రాజసీ 3. బుద్ధి తామసీ-అధర్మమే ధర్మమని ఎవడు తెలుసుకొనునో అట్టి వాని బుద్ధితామసీ. ఇటులనే ధైర్యమున్ను, సాత్వికీ, రాజసీ, తామసీలగునని తెలియనగును. మఱియు శ్లో॥ "యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతం। స్వకర్మణాతమభ్యర్చ్య సిద్ధిం విందతిమానవః

భ. గీ. 18-46

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వభావ నియతం కర్మకుర్వాన్నాప్నోతి కిల్బిషమ్॥18-47

శ్లోకములో కర్మియగు జీవుడు తన స్వధర్మ కర్మచేత సర్వభూతాంతరాత్మయగు భగవంతునికి కర్మసంకల్ప ఫలములను అర్పించవలెననిన్ని (అనగా అట్టి బ్రహ్మకే వాటిని సమర్పణ చేయవలెననిన్ని) అదియే సరియయిన భగవదర్పణ లేక అభ్యర్చనయనియున్ను దాని ఫలమే మోక్షసిద్ధిని మానవునకిచ్చునని యున్ను 18-46 శ్లోలో చెప్పబడుచున్నది. దోషయుక్తమైనను స్వధర్మ కర్మ పై విధముగ చేసినఎట్టి పాపమున్ను కలుగదని 18-47 శ్లో।మున్ను శ్లో॥సహజంకర్మకౌన్తేయ సదోషమపి నత్యజేత్ సర్వారంభాహి దోషేణ ధూమే నాగ్నిరివావృతా॥ 18-48 శ్లోకము. జీవుడు స్వధర్మకర్మదోషయుక్తమైనను విడువకూడదనిన్ని, అన్ని కర్మలున్ను అగ్నిపొగచేత

కప్పబడినటులనే, దోషము చేతనే కప్పబడి యున్నదనిన్ని
మఱియు శ్లో॥ "అసక్త బుద్ధిః సర్వత్ర జితాత్మావిగతస్పృహా
నైష్కర్మ్య సిద్ధిం పరమాం సంన్యాసే నాధిగచ్ఛతి॥ 18-49
శ్లోకము అనాసక్తబుద్ధిచేత సర్వకామములను సంన్యసించి
సంకల్పఫలములను త్యజించి(18-22 శ్లో) జితాత్మగ బ్రహ్మ
స్పర్శయుతముగ చేసినందుననున్ను అటుల నది బ్రహ్మకర్మ
యగుటనున్ను వైరాగ్యమును కలిగియున్నందునయున్ను పర
మార్థసంన్యాస ఫలమగు నైష్కర్మ్యసిద్ధి కలుగుననిన్ని చెప్పా
చున్నవి. ఇచట శిష్యుడగు అర్జునుడు జీవుడు వేఱు, బ్రహ్మ
వేఱు అని తలంచిన అజ్ఞాని లేక మిథ్యా జ్ఞాని లేక భ్రమజ్ఞాని
లేక అధ్యాసిగ అజ్ఞానకార్యములగు రాగద్వేషములలో చిక్కు
కొని హింసాత్మకయుద్ధ ఫలక పాపభీతిచే మోహావశుడైన
వాడే. ఇదంతయు నధ్యాసకార్యమే. భ. గీ. 1అ 2అ-1-2శ్లో
చూడుడు పరిజ్ఞాత (చిదాభాసుడు) కర్మ కర్తఅగుచుండగా
నిష్క్రియాత్మయే కర్త యని భావించుచుండుటయేఅధ్యాస
ఫలము లేక కార్యము. దీనికి కారణము చిత్ లేక స్వప్రకాశ
జ్ఞానము అహంకారములో ప్రతిఫలించి అహంకార విషయి
(చిదాత్మ) బుద్ధి విషయి కాగా పరిజ్ఞాత లేక జీవుడు (చిదా
భాసుడు) కర్త అగుచుఉండగా ఇట్టి అహంకారమే ఆత్మ
యగునను భావము భ్రమ జ్ఞానకార్యమగుచున్నది. అద్వైతి
భా. 1 వర్ణకం చూడుడు. ఇటులతలంచుచుండు అర్జునునకు
ఉపదేశ సారాంశము పై శ్లోకములలో కర్మచేయుకర్త ఆత్మ
కాదు; పరిజ్ఞాతయే; అసక్తబుద్ధితో కామసంన్యస్తకర్మసంకల్ప
ఫలత్యాగముతో చేయుచు, బ్రహ్మస్పర్శ చేయుచున్నయెడల

అది బ్రహ్మకర్మస్పర్శయే యగుచుండగా పరమార్థసంన్యాస ఫలక నైష్కర్మ్య సిద్ధి కలుగును. దాని ఫలముగానే వాడు అకర్మియు అట్టి మోక్ష సంన్యాసియు, (గౌణ సంన్యాసి) అగుటచేతను మోక్షమను బ్రహ్మత్మము లేక సిద్ధి గలుగును అనగా నీవు జ్ఞానివైతివి. నీవు బ్రహ్మ కాదను భ్రమజ్ఞానము వదిలి అంతటను ఒకే బ్రహ్మను స్పృశించుచు బ్రహ్మవే యగుటను (బ్రహ్మ లక్షణమును పురుషోత్తమ యోగాఖ్యము 15వ అధ్యాయము విషయచోదనా చూడుడు) నీవు చేయు హింసాత్మక యుద్ధ ఫలపాపము నిన్నంటదు. ఎందుచేతనగా నీవు నిష్క్రియాత్మవే (బ్రహ్మవేయగు శుద్ధ జీవుడవే.) అగు చున్నందున ఈ కర్మ చేయుటలేదు. దేహాది సంఘాతి లేక పరిజ్ఞాతయే చేయుచున్నాడు నీవకర్మివేనను భావముతో ఉదాసీనభావముతో (తూష్ణీంభావముతో) తటస్థభావుడవుగ, "సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే-నైవకుర్వన్న కారయ న్నాస్తే" (భ. గీ. 5-13) ప్ర॥ చెప్పినటుల తలంచుచున్నం దున 'యద్భావంతద్భవతి' అను ప్ర॥చే అది బ్రహ్మ కర్మయే కాగా నీవపాపి వగు బ్రహ్మవే. నీవు యుద్ధ కర్మచేసినను నైష్కర్మ్య సిద్ధి ఫలమగు మోక్షమును పొందుదువు. అని అర్జున నామక జీవుని భ్రమజ్ఞాన కార్యమగు మోహమును వదిలించి జ్ఞానివైతివని బోధించెను. ఆ మోక్షమెటులను సిద్ధించునను ప్రశ్న కుత్తరముగ ఈ క్రింది శ్లోకముచెప్పెను.

శ్లో॥ సిద్ధిం ప్రాప్తో యథాబ్రహ్మ తథాప్నోతినిబోధ మే
సమాసేనైవకౌన్తేయ నిష్ఠాజ్ఞానస్యయా పరా॥ భ.గీ.18-50

ఒకే బ్రహ్మను సర్వత్రచూచుటయే అనాసక్త కర్మి యొక్క విశ్వరూపోపాసన ఫలక ఏకాన్త భక్తియనిపూర్వమే 12 అధ్యాయములో సిద్ధాంతము చేయబడినది అది బ్రహ్మ కర్మయగుటను ఆ సాధనఫలముగానే నైష్కర్మ్యసిద్ధి యగు నని 18-49లో పైన చెప్పబడినది. అందుచేత సమ్యగ్జ్ఞానివగు టను సాంఖ్యయోగముచేతను పొందదగు మోక్షమున్ను (బ్రహ్మత్వమున్ను) ఈ అనాసక్త కర్మఫలక నైష్కర్మ్య సిద్ధి వలననే కలుగుచున్నది. అవిద్యావృత్తి అను మేఘ నివృత్తి మాత్రముననే బ్రహ్మవృత్తి కలుగుటచేతను బ్రహ్మ వృత్తిలో బ్రహ్మయే (స్వప్రకాశ జ్ఞాన స్వరూపము) ప్రకా శించుటచ్చేత జ్ఞానైక రసముగ అపరోక్ష సాక్షాత్కారము (అప్రమేయము)కలుగునని 18-49-50శ్లోకములసారాంశము. జ్ఞాన(సాంఖ్యయోగఅనాసక్తకర్మయోగముల)ఫలములుఒకే మోక్షమని ఇదివరకే "ఏకంసాంఖ్యంయోగంచయః పశ్యతి స పశ్యతి"అనుశ్లోకములో ఉపదేశముచేసియుంటిని.అనాసక్త కర్మయోగారూఢుడు, "నైవకుర్వన్న కారయన్నాస్తే" అని తూష్ణీంభావుడుగ నుండునని చెప్పబడియుండుటచేత ఈతూ ష్ణీం భావుడగు శుద్ధజీవునిలోనుండు మాయాశక్తి గౌణాత్మికత్వమిధ్యాత్మికత్వములను వదిలి బ్రహ్మాత్మికగ నుండునని సారాంశము. బ్రహ్మాత్మికమనగా జీవునకు బ్రహ్మ వృత్తి ఆపూర్యమాణముగుచున్నదనిన్ని అదిశుద్ధబ్రహ్మసత్త యేఅనిన్ని తెలియనగును.అందుచేతనే పూర్వపు అసక్త కర్మ యోగికి పరమార్థ సన్యాసఫలక మోక్షమునుతానే బ్రహ్మ మేయగు శ్రీకృష్ణపరమాత్మయే, ధ్యాన 2 మోక్షసంన్యాస

3జితాత్మత్వ 4 నైష్కర్మ్యసిద్ధిత్వ 5సమ్యగ్ జ్ఞానము.లద్వారా కలుగచేయుదునను ప్రతిజ్ఞ ఎటులనెరువేఱునో 18-50 శ్లోకములో చెప్పెను. పై అకర్మయోగికి శుద్ధాన్తఃకరణమై విగత స్పృహాయు (వైరాగ్యమున్ను) జితాత్మత్వమున్ను ప్రాప్తించుచున్నదనిన్ని స్పష్టపఱుప బడినది. అనగా పరమార్థసంన్యాసియొక్క బుద్ధిపరిణామ స్థితినే భగవత్ప్రసాదమువలన అకర్మి పొందునని ప్రదర్శింపబడినది. ఆత్మయనగా 1 సర్వాంతర్యామియగు పరమాత్మ 2 అన్తః కరణము లేక మనస్సు అని రెండర్థములు. రెండవదియే ఇక్కడ అర్థము. జితాత్మత్వ ఫలితమే మోక్షమని స్పష్టపరుచుటచేత అకర్మియొక్క జ్ఞాన ప్రాప్తిని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మయే ప్రదర్శించెను. నైష్కర్మ్య సిద్ధి అనగా సామాన్యార్థము అకర్మత్వ సిద్ధి ఇచటవిశేషార్థము గమనీయము. అదిఆత్మ నిష్క్రియాత్మ స్వరూపావస్థాన లక్షణముయొక్క సిద్ధి (నివృత్తి) లేక కర్మ జనిత పునర్జన్మ ప్రాప్తి విలక్షకమగునట్టిన్ని మోక్షసంన్యాస సమ్యగ్దర్శనములచేతనే ప్రాప్తించునట్టిన్ని; అగు సద్యోముక్తి అవస్థానరూపమగునట్టిన్ని బ్రహ్మత్వప్రాప్తి యనబడునట్టిన్ని మోక్షము. ఇది అనాసక్త కర్మయోగము (సంకల్ప కర్మఫల త్యాగము) చేతనే కలుగుచున్నదని నిశ్చయార్థము. అందుచేతనే "సర్వకర్మాణి మనసా సంన్యస్య నైవకుర్వన్నకారయన్నాస్తే" అని యోగలక్షణము నుడువబడినది. అకర్మిజ్ఞానము, ఎప్పుడున్ను ఆత్మ నిష్క్రియమనియు, కర్మచేయునది దేహాది సంఘాతమే ననియు, ప్రపంచమంతటను ఒకే పరమాత్మ అనుస్యూతము గ. అన్ని ఉపాధులలోను నున్నాడనియు నగునని

చెప్పుటచేత శ్రీకృష్ణపరమాత్మయొక్క భగవద్గీత విషయ చోదనా బ్రహ్మస్పర్శయుత అనాసక్త కర్మయోగములనిన్ని అదియే మోక్షమిచ్చుననిన్ని 3అ 18-20, 43 శ్లోకములలో చెప్పబడియేయున్నది. ఐతే అజ్ఞానిచేత చేయబడుకర్మఫలము చల్లారిన బూగ్గులలో వేసిన నేతి హోమకర్మవలె నిష్ఫలమే ననియు, జ్ఞానముచేత చేసినకర్మ అకర్మయగుచు వీర్యవత్తరమనిన్ని (ఛాం 5-24-1-3) ప్రి॥ లున్ను ఈ భగవద్గీత యున్ను చెప్పుచున్నవి. విశేషవివరణ అద్వైతభా 1,9 వర్ణకములలో సంసార రూపానువాద శీర్షికలో చూడ నగును. స్వకర్మ నిష్టమగు అనాసక్త కర్మయోగ ఫలము ఎటులను సమ్యగ్జ్ఞానఫలమగు మోక్షమిడునో, అకర్మియొక్క నియమములను, 18 51-53 శ్లోకములు వివరించి ఈ బ్రహ్మ స్పర్శయుత అకర్మి నడత ఎటుల నుండునో ఈ క్రింది శ్లోకములలో వివరింపబడుచున్నది. అటులనే నీవుండుమని అర్జును నకు బోధించెను

—:విషయా చోదనా ఉపసంహారము:—

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతిన కాఙ్క్షతి।
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతేపరామ్ ॥

భక్త్యామామభిజానాతి యావాన్యశ్చాస్మితత్త్వతః
తతోమాంతత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరం॥

సర్వకర్మాణ్యపి సదాకుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయం॥

చేతసాసర్వకర్మాణి మయిసంన్యస్య మత్పరః
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతంభవ॥
మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అథచేత్త్వ మహంకారా న్నశ్రోష్యసివినఙ్క్ష్యసి॥ 18.54_58.
ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి
భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢానిమాయయా॥
తమేవ శరణంగచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాంశాన్తిం స్థానంప్రాప్స్యసిశాశ్వతం॥
ఇతితేజ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్య తరంమయా!
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథాకురు॥ 61-63
మన్మనాభవమద్భక్తో మద్యాజీమాంనమస్కురు
మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోసిమే॥ 65
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ
అహంత్వా సర్వపాపేభ్యోమోక్షయిష్యామిమాశుచః॥66

అ. 18-46_49 శ్లోకములలో సాధనలే తిరిగి క్లుప్తముగ 18.54_56 లో చెప్పబడినది. సంసారవిలక్షకమగుబ్రహ్మ భూతుడున్ను, సర్వభూతములందున్ను నన్ను ( పరమాత్మను) ఒక్కనినేచూచుచు కోరికలుగాని, దుఃఖములుగాని, పొందక ప్రసన్నమనోరూపుడగుచున్నాడు. నేనుయథార్థముగ స్వప్రకాశ జ్ఞానస్వరూపముగ నెటుల నిశ్చయముగనంతటను అనుస్యూతముగ నున్నానో ఐకాంతికబ్రహ్మభక్తిచేతను తెలుసుకొన్నవాడు అగుచున్నాడు. దాని ఫలముగనే స్థూలదేహ పాతానన్తరము నాస్వరూపమే పొందును. మరియు సర్వకర్మ

లను నాయందు అర్పించుచుండువాడు నావ్యపాశ్రియుడగు టను మార్జాల కిశోరన్యాయముననాప్రసాదముచేతనే శాశ్వతమైనట్టి లేక అపునరావృత్తిఐనట్టి నాపదమునే పొందును. అది అవ్యయము అనగా నిత్య సత్య పదమే. అందుచేత నీవు సర్వకర్మఫలములను నాయందు మనస్సుచేత సంన్యసించి నాపరుడవగుచు జ్ఞానయోగివి(స్థితప్రజ్ఞుడవు)అగుచు నాభావుడవే ఎల్లపుడునగుము. (అనగా బ్రహ్మభావుడవే అగుము.) నాయందలి చిత్తముచేత నీవు నాప్రసాదముచేతనే సర్వ అడ్డంకులను 1 _ అధ్యాత్మ 34_35 ప్రి॥ చేత దాటితరింతువు. అటులను కాక అహంకారముచేత నా ఉపదేశమును వినవేని నీవు నశింతువు అనగా ఆత్మహంత వగుదువు. ఈశ్వరుడు(పరమాత్మ) అన్ని జీవభూతముల మనములలోనున్న ఉన్నాడు. అయితే ఆయాజీవుల కోటికల ననుసరించి సాపేక్షగానే తన మాయాశక్తి ద్వారా దేహాది సంఘాతమను యంత్రమును అధిష్టించి జీవుల మనోవృత్తిని, సాపేక్షచేతనే, పరిభ్రమింప చేయుచున్నాడు. అందుచేత ఆ ఈశ్వరునే నీవు అనన్యభక్తితో శరణు జొచ్చుము. ఆయప ప్రసాదము వలననే శాశ్వతమైనట్టి శాంతిపదము లేక బ్రహ్మత్వము లేక మోక్షమును అర్జునా నీవు పొందగలవు. ఇదియే అతి రహస్యమైన జ్ఞాన కథ. అది యంతయు నేను నీకుపదేశించితిని.

నీవు ఇది యావత్తున్న బాగుగా నీ మనస్సులో చర్చించుకొని నీయిష్టమువచ్చినటుల నొనర్చుము. నీవు ఈశ్వరానన్యుడుగ నిన్ను తెలుసుకొన్న వెంటనే భ.గీ. 2_59 శ్లోకోక్త మాయాశక్తిని దాటగలవు. నీవు బ్రహ్మమనో

భావుడవు (సంకల్పుడవు)బ్రహ్మ ఐకాంతిక భక్తుడవుకమ్ము. నా యజ్ఞమే చేయుము. నన్నే (బ్రహ్మనే) నమస్కరింపుము. అందుచేత నీవు నన్నే పొందుదువు. అనగా బ్రహ్మవే అగుదువు. ఇది సత్యమే. నీవు నాకత్యంత ప్రియుడవు గనుక నీవు ఈ జ్ఞాన రహస్యమును చెప్పుచున్నాను. మఱియు ధర్మాధర్మములను నా యందే (బ్రహ్మయందే) త్యాగము చేసి బ్రహ్మనొక్కనే శరణు చొచ్చుము. అనగా బ్రహ్మయే నీ వనుభావముతో అంతటను ఒకేబ్రహ్మను స్పృశింపుచుండుము. అనగా స్థితప్రజ్ఞుడవుగ భ. గీ. 2.55-72 శ్లోలలో నుడివినటుల నుండుము. నేనునిన్ను అన్ని పాపపుణ్య కర్మఫలములనుంచిన్ని దాటించెదను. నీవు భేదబుద్ధితో దుఃఖితుడవు కాకనేయుండుము. నీకు మోక్షమిత్తునని అభయమిచ్చెదను. ఇచట అనాసక్త కర్మియగు (బ్రహ్మకర్మి)స్థితప్రజ్ఞుడు ఎటులనగును?జ్ఞాని అనాసక్త కర్మి ఎటులనగును?అను శంకలు నివర్తింపబడుచున్నవి. భ. గీ. 2.55-59, 6970-72 శ్లోకములలోనున్న "లీన వృత్తేరనుత్పత్తి ర్మర్యాపరతేస్తు స్సా 1. స్థితప్రజ్ఞో యతిరయం యస్సదానందమశ్నుతే 1 బ్రహ్మణ్యేవ విలీనాఽత్మా నిర్వికారో వినిష్క్రియః బ్రహ్మత్మనో శ్శోధితయో రేకభావావగాహినీనిర్వికల్పాచ చిన్మాత్రావృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే । సా సర్వదా భవేద్యస్య సజీవన్ముక్త ఇష్యతే । (అధ్యాత్మ ఉప 91-96) శ్రుతిలోనున్న చిన్మాత్రవృత్తి కలవాడేస్థితప్రజ్ఞుడనిన్ని యతిన్ని,ముని, జీవన్ముక్తుడగుచున్నాడు. అద్వైత భా.9 వర్ణకముచూడుడు. అనాసక్త కర్మి జ్ఞానికాగా అట్టి స్థితప్రజ్ఞుని లక్షణములు

ఈక్రింది పద్యము భ.గీ. 2 అధ్యాయములోని 15 లక్షణము లను వివరించుచున్నది.

సీ॥ నిష్కామమును, ఆత్మనిరతి దుస్సుఖవిరతి
యును నిఃఖేదస్థితియు, భయాది।
కంపప్రకృతుల సఙ్గములు లేమి, శుభా శు
భ సమాహితపు చిత్తమసక్తుదునికి।
ధీంద్రియజయమును, ధీజ్ఞచిత్త్వంబును
నిర్వ్యవహృతి చిత్తనిర్వృతియును।
మమత స్పృహాహంవిరమణ నిస్పృహ
యను పంచ దశపు లక్షణా చరితుఁడు।

తే. గీ. గ స్థితప్రజ్ఞుడతడనఁగ బొనరుచును ।
మనన శీలాభ్యసితుఁడుగ ను నమరుఁదగ
జీవ బ్రహ్మైక్యభావుడు స్థితుఁడు బ్రాజ్ఞె ।
మానిగఁ స్థితధీగను మసలు రామ!

ఈ జ్ఞాని (స్థితప్రజ్ఞుడు) 1 నిష్కామము(కోటికలేమి) 2. ఆత్మక్రీడ 3. దుఃఖము కలుగగ దుఃఖము లేని స్థితి 4. సుఖము గలుగగ సుఖ ప్రాప్తి మఱుపుస్థితి 5. రాగ ద్వేష భయ క్రోధములచే చలింపనిస్థితి 6. ప్రాకృతిక జనుల సంగము లేమి 7. సుఖప్రాప్తి యందు ఆనందరాహిత్యము 8. అశుభ ప్రాప్తియందు ద్వేషాభావము. 9. ఇంద్రియ జయము 10. సర్వభూతస్థ పరమాత్మయే తానను తలంపు చేతనగు మనో బ్రహ్మవృత్తి 11. ప్రపంచ జాగ్రదావస్థ అజ్ఞానకార్యమగు ప్రాపంచిక విషయ తలపులో దానియందు తూష్ణింభావము,

చేతనగు వృత్తి లేక సంతత బ్రహ్మానుభవము. 12. లౌకిక రాహిత్య ఫలకవ్యవహార విజృంభణరాహిత్యముచే పరివ్రాజము. 13. చిన్మాత్రవృత్తి లేక చిత్త నిర్వృత్తి 14. నిర్మమత్వాహంకారము (నేను నాది అను మమకారమున్ను నేను విద్యావంతుడనను అహంకారమున్ను లేమి,) 15. ప్రాపంచిక విషయ నిస్పృహత్వము (వైరాగ్యము) అను 15 లక్షణములు గల జ్ఞానిగనుండి 'అహం బ్రహ్మాస్మి' అనియే వేదాంతశాస్త్ర జ్ఞానవృత్తిచే ప్రత్యక్ వైపునకు మనస్సును ప్రవహింపచేసి ఆత్మయందు మనస్సును లయించువాడు స్థితప్రజ్ఞుడు లేక జీవన్ముక్తుడగును. ఇతడు మౌనియు, ప్రాజ్ఞుడు, మననశీలుడగు మౌని లేక యతి. అవగత బ్రహ్మాత్మభావుడు బ్రహ్మస్థితిలో నున్న వాడు అని చెప్పబడుచున్నాడు.

లోగడ 9,15 అధ్యాయములలో చెప్పబడినటులను జీవ బ్రహ్మైక్య భావముకలిగి ప్రపంచమంతయు బ్రహ్మప్రతిభాసయేయనియు నామరూపదృశ్య మసత్యమనియు ప్రపంచము బ్రహ్మగనే సత్యమనిన్ని చూచుచుండువాడు అగుచున్నవాడే ఈస్థితప్రజ్ఞుడు లేక బ్రహ్మజ్ఞాని బ్రహ్మకర్మి లేక అనాసక్తకర్మి యగుచున్నాడు అని అర్థము. 2. ఇంకను జ్ఞాని లేక స్థితప్రజ్ఞుని లేక జీవన్ముక్తుని జ్ఞానానుభవదశలు నాలుగు. నాలుగవ అవస్థయే పూర్ణజ్ఞానియొక్క అవస్థ. మొదటి మూడవస్థలలోనున్న తరతమ విశేషావస్థలుండి "ప్రకృతేనార్థ కార్యేణ కించిత్కుర్వన్తి నవాపార్శ్వస్థ బోధితాస్సన్తః" పూర్వాచార క్రమాగతం ఆచార మాచరన్త్యేవ సుప్త బుద్ధవధుద్ధితా (మహోప 5-71-73,) 2. కుర్వన్నభ్యాసమేతస్యాం

భూమికాయాం పివాసనః(జీవన్ముక్తి ప్రకాశికలోని జీవన్ముక్తి ప్రయోజనం) ప్ర॥ లచేత జీవన్ముక్తుడగు 6 వ జ్ఞానిభూమికు డున్న (బ్రహ్మవిద్వరీయుడు) చెంతనున్న వారిచే ప్రబోధిం పఁబడి కర్మచేసినను పూర్వాభ్యాసకర్మలనే చేయుచు గాఢని దురలో నన్నఘంతిను బాలునివలె కర్మచేసినట్టి వృత్తిజ్ఞానము లేనివాడే. అందుచేత శ్రీకృష్ణపరమాత్మ కర్మలు చేయుచు న్నను కర్మఫలబద్ధుడు గానటులనే, ఈ విద్వరీయుడగు జ్ఞాని (జీవన్ముక్తుడు) అకర్మియే యగుచు అ 18-56 శ్లోకోక్త బ్ర హ్మవృత్తి ఘనీభవించినవాడుగ నుండును. ఇట్టివాని భావ మెటులనుండునో భ. గీ. 2_15-25 శ్లోకములలో ఆ భావ ములను శ్రీకృష్ణపరమాత్మయే చెప్పెను. మఱియు నీజ్ఞాని పూర్వజ్ఞాని (విదేహి)అగునని ఈక్రింది ప్ర॥ లు చెప్పుచున్న వి. (1) "యత్రనాస న్నసదూ్రపో నాహంచనాప్యహంకృతిః కేవలఃక్షీణ మనసః ఆస్తేద్వైతైక్యవర్జతః"(జీవన్ముక్తి ప్రకాశిక జీవన్ముక్త ఫలము) (2) విదేహముక్తి విషయం తుర్యాతీత మతఃపరమ్। యేనిదాఘ మహాభాగా స్సాప్తమీా భూమిమా శ్రితాః॥ భూమికాసప్తకంచైతద్ధీమతామే వగోచరమ్ ప్రాప్త జ్ఞాన దశామేతాం పశుమ్లేచ్ఛాదయోఽపియే సదేహావాప్య దేహావా తేముక్తా నాత్రసంశయః (మహాోప అ 5_69-74 76 ) 3. "దేహంచనశ్వర మవస్థితముత్థితంవా సిద్ధోనపశ్యతి యధోరధ్యగమత్స్వరూపమ్దైవాదుపేతమథదైవవశాదపేతం నాఽసోయథాపరికృతమదిరా మధాంధః॥ ( శ్రీభాగవతమ్ ) నోపజనం స్మరంన్నిదం శరీరం సంపదాప్రయోగ్య ఆచరణే। యుక్తమేవాయమస్మిన్ శరీరేపాణోయుక్తః (శ్రీ భాగవతం)

4. ఆత్మక్రీడ ఆత్మరతిః క్రి యావానేషబ్రహ్మవిదాంవరిష్ఠః (ముండక 3-1-4 ) ప్రి॥ ల చేత బ్రహ్మవిద్వరిష్ఠునకు (పూర్ణ జ్ఞానికి) దేహస్పృహ ఈ స్థూలదేహ ముండగానే నశించును. ఇది జ్ఞానుల కనుభవైకవేద్యమే. ఐతే ఇతడెటుల జీవయాత్ర నడపునను శఙ్కరాగా పరిహృతమగుచున్నది 1. " నిర్వా సనాచారః" (సి. సు. 4-3-4) ప్రి॥ చే నిర్మనస్కుడై నందున అశ్వములు రధస్థుని యత్నములేకున్నను రథచోదకుని ప్రే రేపణచే పురోవర్తి గ్రామమును చేర్చునటుల్లను జీవుని యత్నము లేకున్నను భగవత్ప్రేరితమై ప్రాణవాయువు శరీర వ్యవహారమును నడుపుచుండును. ఇట్టి పూర్ణజ్ఞాని తనను అని చ్ఛాప్రారబ్ధము విడిచినను విడువకున్నను మద్యపానముచే మత్తుడుగానున్న జీవునివలె బ్రహ్మానుసంధానమత్తుడై ఐహి కానుభవము నెఱుగకనే 6 వ జ్ఞాని భూమికునకుండు వ్యుత్థాన దశలేకనే బ్రహ్మపరవశుడై యుండును. ప్రకృతజీవన్ముక్తుడు 4-6 జ్ఞానభూమికలలోని(1.సత్వాపత్తి 2.అసంసక్తి 3.పదార్థా భావనలలోని) జ్ఞాని 'ఆభాసమాత్రమేవేదం నసన్నాసజ్జగ త్త్రియమ్॥ ఇత్యస్య కలనాత్యాగం సమ్యజ్ఞానం విదుర్బుధాః అన్నపూర్ణ 5-63-64) ప్రి॥ చే యావత్తు దృశ్యనామరూపా త్మకమును ఆభాసమాత్రమనిన్ని జాగ్రత్త్రితయ జగత్తును 'సదసత'న్నన్ని అనగా అనిర్వచనీయమనిన్ని, కల్పితమనిన్ని దానిని త్యజించును. అనగా దాని భావనయే విడుచును. ఈ త్యాగజ్ఞానమే సమ్యజ్ఞానము (బ్రహ్మజ్ఞానము) అని పం డితులున్ను (ఆత్మానాత్మ జ్ఞానులున్ను) ఉపనిషత్తులున్ను బోధించుచున్నవి. ఇటులను బ్రహ్మస్పర్శయుత అనాసక్త

కర్మి మోక్షసంన్యాసినిన్ని, నైష్కర్మినిన్ని, జీవన్ముక్తుడున్ను, (జ్ఞానినిన్ని)అగునని శ్రుత్యనుగ్రాహకభగవద్గీత నుడువుచున్నది. అటులనే జీవన్ముక్తుడున్ను (జ్ఞానినిన్ని) అనాసక్తకర్మి యనిన్ని ఉపనిషత్తులు చెప్పుచున్నవి.

ఈ సారాంశమే భగద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ "ఏకం సాంఖ్యం చ యోగంచ యః పశ్యతి స పశ్యతి। (భ. గీ. 5-5) 2. "నహ్య సంన్యస్త సంకల్పో యోగీభవతి కశ్చన" (భ. 6-2) 3 "సర్వం కర్మాఖిలం పార్థజ్ఞానేపరి సమాప్యతే॥" (భ. గీ. 4-33) 4 "నైష్కర్మ్య సిద్ధింపరమాం సంన్యాసే నాధి గచ్ఛతి" (18-49) 5 "నైవకుర్వన్నకారయన్నాస్తే భ. గీ. 5-13) 6. "యద్భావం తద్భవతి"

7. నమాంకర్మాణి లిమ్పన్తిన మేకర్మ ఫలేస్పృహా (భ. గీ. 4-14) 8. ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః।

కురుకర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరంకృతమ్ (4-15)

9.కుర్యా ద్విద్వాంస్తథాఽసక్తశ్చికీర్షుర్లోకసంగ్రహం(3-25) లో చెప్పినను విశేషార్థము గమనీయము. ఇటులను సాంఖ్య, కర్మ యోగము లేక ఫలకము నియేఉపదేశసారాంశ మగుటను అదేటులననిన్ని, మార్జాల కిశోర, కపి కిశోర పరస్పర భేద న్యాయములు ఏకఫలములుగ ఎటులను సమర్థనీయమని శఙ్కరాగా పరిహృతమగుచున్నది. అ18-10,47, 49, 50, 54-59; 61 66 శ్లోకముల శ్రీ శంకర భాష్యము అంతయున్ను, ప్రథమషట్కములోనిక ర్మాధ్యాయములున్ను

ద్వితీయ షట్కములోని 12 అధ్యాయమున్ను, చరమషట్కములోని 16, 17 అధ్యాయములున్ను; వాటి శంకర భాష్యమున్ను సమగ్రముగ చదివినయెడల ఈ సారాంశము సువిదితమున్ను, సుసమన్వయమున్ను అగును. 18-66 శ్లోకములో నుడివినటులను సర్వధర్మములను బ్రహ్మయందే పరిత్యజించి బ్రహ్మ శరణ్యుడగువాడు అంతకు పూర్వమేకలిగిననైష్కర్మ్య సిద్ధి ద్వారా బ్రహ్మవృత్తి ఆపూర్వమాణమైనవాడే అగుచున్నాడు. మూర్జాల కిశోర న్యాయమున జీవుడు వేఱు,బ్రహ్మ వేఱు అను భేదబుద్ధి కార్యమగు "అసుర్యా నామ తే లోకా అన్ధేన తమసా వృతాః। తాగ్ంస్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే కే చాత్మహనో" (ఈశావాస్య 3) ప్ర। చే దాటింపబడి బ్రహ్మవృత్తి ఆపూర్యమాణమైనవాడే. (జ్ఞానియే) ఈ అకర్మి. అతను తనను బ్రహ్మగా తెలుసుకొన్నందున భ. గీ. 2_59 శ్లోకోక్తమైన రాగద్వేషాదులు లోగడనే నుడివినటులను విడిచినందున, అతనికి దుఃఖకారణమే లేదు. అనిన్ని, జ్ఞాని ఐనాడనిన్ని అన్వయముఖముగ నుపదేశించిరి. ఇదియే 18అ 66 శ్లో శంకరభాష్య గూఢాభిప్రాయము౨ అ 18-10, 47_66 శ్లోకముల భాష్యము చదివిన సువిదిత మగుచున్నది. మఱియు 66 శ్లోకభాష్యములో, సింహమాణవక గౌణ 2 దేహాత్మ మిథ్యాధ్యాసలు వదిలినవాడు 18_57 శ్లోకోక్త జ్ఞానియనియు బ్రహ్మైకాన్తిక భక్తుడు నగుచు 18-63 శ్లోకోక్త జ్ఞానియగునన్ని, జ్ఞానరహస్యమును బోధించెను. అట్టిజ్ఞానిబ్రహ్మైకాన్తిక భక్తుడును, బ్రహ్మచిత్తుడును, బ్రహ్మయాజియునైన మోక్షముపొందునని 65 శ్లోకములోనభయమిచ్చుచుఅర్జునుని

అట్టివాడు కమ్మని చెప్పెను. 18.66 శ్లోకములో తన ఉప ఉపదేశమును ముగించెను. అందుచేత అకర్మి జ్ఞాని యగు చున్నందున మోక్ష ప్రాప్తికరతలామలకమే.

విషయచోదనా సారాంశము

(అనాసక్తకర్మి జ్ఞానియు, జ్ఞాని అనాసక్తకర్మియు ననియే అనాసక్త కర్మి (మొదటివాడు)

భ. గీ. 3-28 అ 14-6, 28 శ్లోకోక్త అకర్మి లేక పారిభాషిక గౌణ సంన్యాసి, అ18లో చెప్పబడినట్లు లనుకర్మలు ప్రకృతి కార్యమగు మహదాది కార్యకరణ సంఘాతాత్మ లేక పారిభాషిక గౌణాత్మ లేక పరిజ్ఞాత (చిదాభాసుడు) చేయునుగాని నిష్క్రియాత్మ కర్మచేయుట లేదనుభావుడున్ను అందుచేత అకర్మి (బ్రహ్మకర్మి)యు నగును దాని ఫలక నైష్కర్మ్య సిద్ధుడుగ మోక్ష సంన్యాసియు నగుచున్నాడు. ఉదా: ఇక్ష్వాకుడు.

పరమార్థజ్ఞాని-రెండవవాడు

అర్థాంతరముగ భ. గీ. 3అ శ్లో 20 యో. వా. నిర్వాణ ప్ర॥ పూ. అ. స 12-13శ్లో(1)జ్ఞాని లేక జీవన్ముక్తుడున్న అసక్త కర్మియునగు జనకుడు, అశ్వపతి ప్రాగ్ధవశ గృహస్థులు,2.పరమార్థ సంన్యాసితనయొక్క స్వప్రయత్నము వనే జ్ఞానము సంపాదించుకొన్నచో జ్ఞానయోగ భూములు- 1. శుభేచ్ఛ, 2. విచారణ, 3. తనుమానసి అను మూడు భూమికల నారూఢుడై తర తమ విశేషముచేత ఇతరులచే చిర ప్రబోధితుడై అనాసక్త కర్మిగ1.సత్త్వాపత్తి 2.అసంసక్తి 3.పదార్థా భావనా భూమికలల్లో నారురుక్షుడు. వీరుభ

యులున్న ఇంకను విదేహులు కాకున్నను జ్ఞానులే. ఇద్దరు ప్రపంచమందన్ని ఉపాధికజీవులలోనున్న ఒకే బ్రహ్మను అనుస్యూతముగ కనుచుందురు. ఇద్దరికి అందుచేత బ్రహ్మ వృత్తి ఆపూర్యమాణమై యున్నది. అందుచేతవిశ్వరూపోపాసకులే. ఇద్దరు విదేహత్వమునకు లేక అపునరావృత్తి కెదురు చూచుచున్నారు.

1. అనాసక్త కర్మి

1. ఈశ్వర ప్రసాదఫలక మోక్షమున కెదురు చూచుచు బ్రహ్మ శరణ్యుడే.

2. తనపారిభాషిక గౌణాత్మిక వృత్తియే ఉపాధి కాగా దానిని నశింపచేసుకొనిన్ని బ్రహ్మ శరణుచొచ్చిన్ని గౌణ మిథ్యాజ్ఞానములునశించి(బ్రహ్మాత్మికవృత్తి(బ్రహ్మత్వానన్య వృత్తి ఉపాధిగ కలిగిబ్రహ్మకర్మియై) యున్నవాడు ప్ర। భ.గీ. అ18–57 63,66

3. మనోవృత్తి ఒకే బ్రహ్మస్పర్శచే అతి విమలమైనందున బ్రహ్మవృత్తియే ఉపాధి.

2. జ్ఞాని లేక జీవన్ముక్తుడు.

1. సం అసం ప్రజ్ఞాత సమాధులలో (సౌషుప్త.మౌన సమాధులలో) బ్రహ్మత్వానుభవము నొందుచు ప్రారబ్ధక్షయము ద్వారా విదేహత్వమున (మోక్షమున) కెదురు చూచుచున్నాడు.

2. కాలిన విత్తువలె విక్షేపము భోగముతోనే నశించునని తలచుచు స్థూలదేహపాతమున కెదురుచూచుచున్నాడు,

ప్ర॥ 4 భోగేనత్వితరే క్షపయిత్వా సంపద్యతే 1. బ్ర సూ. 4-1-19 ఇతనికిన్ని గౌణ మిథ్యాऽజ్ఞానములు నశించి, విక్షేపము మట్టుకు తరతమముగ మిగిలియున్నది.

3. మనోవృత్తి (బ్రహ్మవృత్తి)చే అతి విమలమై నందున బ్రహ్మవృత్తియే ఉపాధి.

ఉభయుల మనోబ్రహ్మవృత్తిలోను బ్రహ్మయే ప్రతి ఫలించుటచేత బ్రహ్మయే బ్రహ్మవృత్తివ్యాప్తతను అతి వ్యాప్తి దోషములేకుండ ఆత్మ (జీవుడు) బ్రహ్మగ "బ్రహ్మ చోదనాతు పురుషమవబోధయతి" బ్ర. సూ 1-1-1-3 అ. పా. సూ. వర్ణ శారీరకభాష్య ప్ర॥చేత జీవించియుండగానే గాని, స్థూలదేహపాతానంతరమున గాని భ. గీ. అ. 6-47-అండ్. 18-50,66 శ్లోకములునుడివినటులనగుచుఅపునరావృత్తి ఫలమునొందుదురను విశేషార్థము సుసమన్వయమగుచున్నది.

—: ఇందుకు ప్రమాణములు :—

శ్లో॥ బ్రహ్మధ్యోపాత్తసాధనస్య తన్నిష్ఠస్య విద్యాప్తి రిహాముత్రవా । సి.సూ. (4 అ. 3. 1, 3)

,, స్వావృత్త్యపాయే ప్రాప్తస్యైవాన్యాప్తిర్దశమవత్ ।
సి. సూ. 4-4-1.

,, బ్రహ్మాకారమనో వృత్తిప్రవాహోऽహంవృత్తింవినా।
,, సంప్రజ్ఞాతసమాధి స్యాద్ధ్యానాభ్యాస ప్రకర్షతః
(ముక్తికోప 2-10,2,10,3,

,, ప్రారబ్ధక్షయవశాద్దేహత్రయభఙ్గంప్రాప్యోపాధి వినిర్ముక్తం ఘటాకాశవత్పరిపూర్ణతా విదేహముక్తి స్సైవకైవల్య ముక్తిరితి (ముక్తికోప 1 అధ్యాయ చివరివాక్యము)

,, నిర్వికల్ప మనంతంచ హేతుదృష్టాంత వివర్జితః
అప్రమేయమనాదించ యజ్జ్ఞాత్వా ముచ్యతే బుధః॥
(అమృతబిం. 9)

,, స్వయ మావిర్భవేదాత్మా మేఘాపాయేఽంశుమానివ
(నాదబిం-30)

జ్ఞానోదయాత్పురాఽరబ్ధంకర్మ, జ్ఞానాన్ననశ్యతి।
అదత్వా స్వఫలంలక్ష్యముద్దిశ్యోత్సృష్టబాణవత్।
వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తోబాణః పశ్చాత్తుగోమతౌ।
నతిష్ఠతి ఛినత్త్యేవ లక్ష్యం వేగేన నిర్భరమ్॥
(అధ్యాత్మ 112-115)

,, స్థితప్రజ్ఞోయతిర్యయం అను పై నుదహరించిన
(అధ్యాత్మ 91-96)

ఇటులను అకర్మియు, సాంఖ్యుడు (జ్ఞానియు) అగు యోగులిరువురున్ను అకర్మికి సాంఖ్యవృత్తి(బ్రహ్మజ్ఞానవృత్తి) అఙ్గము అగుటనున్ను

సాంఖ్యునకు (పరమార్థ సంన్యాసి లేక జ్ఞాని లేక జీవన్ముక్తుడు) అనాసక్తకర్మ అఙ్గముపై (మహోప 5-71-73) ప్ర॥ చే అగుటనున్ను ఒకే జీవబ్రహ్మైక్యావధి లేక మోక్ష ఫలముబ్రహ్మవృత్తి చేననుభవించుటకుభయులునర్హులే. మరియు

వీరిరువురు స్థూలదేహపాతానంతరమున అపునరావృత్తిఫలము నొందుదురు అనునది సారాంశము.18_57 శ్లోకోక్త జ్ఞాని అకర్మ ఫలముగా నగుచున్నాడు. అప్పటికే సింహ మాళవక గౌణా ధ్యాసియు, దేహాత్మ మిథ్యాధ్యాసియు కాకుండనే గౌణాసం న్యాసియు బ్రహ్మశరణ్యుండునగును. ఇటుల అకర్మి (బ్రహ్మ కర్మి) నైష్కర్మ్యసిద్ధినిపొంది బ్రహ్మాత్మానన్య జ్ఞాని ( భగ వత్ప్రసాదమున బ్రహ్మవృత్తి కలిగినందున) ఈయనయు జ్ఞానియే. ఇంతవఱకే మార్జాలకిశోర న్యాయఫలము. ఇంతట నుంచి కపికిశోర న్యాయమే వర్తించును. ఉభయులకు బ్రహ్మ వృత్తిలో 'భా' రూపబ్రహ్మ, తనంతటతానే జీవబ్రహ్మ భిన్నజ్ఞానకార్యమగు అజ్ఞానమేఘము విడిచినందున సూర్యుని వలె ప్రకాశించునను విశేషార్థము ఈక్రింది ప్రలచేతనున్న భ. గీ. 18_66 శ్లో। వలననున్న తెలియనగును.

శ్లో॥ బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తి వ్యాప్తిరపేక్షితా।
స్వయం స్ఫురణరూపత్వాన్నాభాస ఉపయుజ్యతే॥

2. స్థితోప్యసౌచిదాభాసో బ్రహ్మణ్యేకీభవేత్పరమ్ ।
(ప. ద. 7_92,94)

3. ఆత్మజ్ఞేయ విహీనాత్మా యత్కించిదిదమాత్మకః
భావాభావ విహీనాత్మా వై దేహిముక్త ఏవ సః॥
(తేజోబిం 4_79)

4 స్వానుభూత రసావేశా ద్దృశ్య శబ్దా నపేక్షితః ॥
నిర్వికల్ప సమాధి స్స్యా న్నివాతస్థిత దీపవత్॥
(సరస్వతీ ఉప. 36)

5. వృత్త్యస్మైషాఽన్తర్థి జాగర సుప్తీసంస్వేదినః 6. నిర్వాస నాచారః 7- సంసరన్నప్యన్నిదా్రితిశశ్వత్ |(సి.సూ. 4-2-2; 4-4-4; 4-4-16) 8 "అంతశ్శూన్యోబహిశ్శూన్యః శూన్య కుంభ ఇవాంబరే| అంతః పూర్ణో బహిః పూర్ణః పూర్ణకుంభ ఇవార్ణవే"(వరాహోప 4-47,48 9 శ్లో॥ "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే"(భ. గీ. 4-33) 10 "తస్మాదజ్ఞాన సంభూతం హృత్థ్సం జ్ఞానా సినాఽఽత్మనా | ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత॥' (భ. గీ. 4-42) అను జ్ఞాన సంన్యాసి యోగాజ్ఞ ప్రి॥లున్న11.శ్లో॥యోఽన్తః సుఖోఽన్త రారామ స్తథాన్తర్జ్యోతి రేవయః| సయోగీబ్రహ్మ నిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥" (భ, గీ. 5-24)12. శ్లో "లభన్తే బ్రహ్మ నిర్వాణమృచ్ఛయః క్షీణ కల్మషాః |ఛిన్న ద్వైతాయతాత్మనః సర్వభూతహితేరతాః | (భ. గీ. 5-25) 13. శ్లో"భోక్తారం యజ్ఞతపసా సర్వలోకమహేశ్వరం |సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాంశాంతి మృచ్ఛతి" (భ, గీ. 5-29) అను సంన్యాసయోగాజ్ఞ స్మృతి ప్రి॥ లున్న 14.శ్లో॥ "ఉత్క్రామన్తంస్థితం వాఽపిభుఞ్జానంవాగుణాన్వితం| విమూఢానానుపశ్యన్తిపశ్యన్తి జ్ఞానచక్షుషః(భ.గీ.15-10) 15 యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ | యతన్తోఽప్యకృతాత్మానో నైనంపశ్యన్త్యచేతసః" (భ. గీ. 15-11) 16 శ్లో॥ "యస్మాత్క్షరమతీతోఽహ మక్షరాదపిచోత్తమః | అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమమ్॥ (భ. గీ. 15-18) 17 శ్లో "అహం వైశ్వానరోభూత్వాప్రాణి నాందేహ మాశ్రితః ప్రాణాపాన సమాయుక్తఃపచామ్యన్నం

చతుర్విధం''॥(భ.గీ.15-14) 18 శ్లో "సనర్వ విద్భజతి మాం సర్వభావేన భారత ।'' (భ. గీ. 15-19) శ్లో॥ ఇతిగుహ్యతమం శాస్త్రమిదముక్తం మయానఘ।ఏతద్బుద్ధ్వాబుద్ధిమాన్ స్యాత్కృత కృత్యశ్చ భారత (15-20) ఇటులను జీవుడు బ్రహ్మ లేక పురుషోత్తముడగునను బ్రహ్మశాస్త్ర యథాదరిత అర్థమును బుద్ధితో తరిచి తెలుసుకొనిన అకర్మి (అనాసక్తకర్మి) జ్ఞాని యగుననిన్ని ఈ 18 అధ్యాయములో పైన చెప్పబడినటులను దేహాది సంఘాతియే కర్మచేయుననిన్ని అత్మచేయదనిన్ని తెలుసుకొన్నజ్ఞాని (జీవన్ముక్తుడు) భ. గీ. అ 2-55-72 శ్లోకములలోనున్న మహోపనిషత్ అధ్యాత్మ ఉపనిషత్తులలో చెప్పబడిన స్థితప్రజ్ఞుడున్ను అకర్మియు(అనాసక్తకర్మియు) నగుననియు బ్రహ్మశాస్త్రబోధనే ఈభగవద్గీత (స్మృతి) ప్రదర్శించుచున్నదనిన్ని నిష్పాక్షిక విమర్శకునకు ద్యోతమగుచున్నది. ఇటుల నీ భగవద్గీత విషయచోదనా అనాసక్త కర్మయోగము దాని యజ్ఞములతోనగు నుపదేశమగుచు అట్టి అకర్మిజ్ఞానమున్ను. జ్ఞానానన్య మోక్షప్రాప్తినిన్ని ఎటులపొందునో 18-46-66 శ్లోకములు ప్రదర్శించుచున్నవి. అందుచేత జ్ఞానమొక్కదానిచేతనే మోక్షప్రాప్తి కలుగునుగాని భగవద్గీత చోదనాయగు అనాసక్తకర్మఫలము (బ్రహ్మకర్మ) వలన మోక్షము కలుగదను వాదము సాహస మాత్రమగుటచే నిరాకృతమే. అయితే ఈకర్మ సామాన్యలనుకొను మామూలుకర్మగాదను విశేషాంశము గమనీయము. మోక్షసంన్యాసియగు అర్జునునకున్ను పుణ్యాపాపములను సంకల్పబలముననే బ్రహ్మకర్పించిననే అతనికి పరమార్థ సంన్యా

సికి కలుగు మోక్షము కలుగునని భ. గీ అ 6-46, 47 శ్లోక ముల సారాంశమున్ను గమనీయము. విషయచోదనా సిద్ధాంతము. అకర్మఫలము మోక్షమేనని యో. వా. ముముక్షు ప్ర॥ సర్గ 53 శ్లో॥ 17–19– లలో శాన్తమే (బ్రహ్మమే) స్వరూపముగ నీవగుచు బ్రహ్మమయమే కర్మఫలమును చేయుము. బ్రహ్మార్పణ చరణుడు తత్క్షణమే సమ్యగ్బుద్ధియగును. ఈశ్వరార్పణముచేత సర్వభూతాత్మయగు నీశ్వరుని కంతయు సమర్పించిన నీశ్వరమయుడుగ సంసారవిముక్తుడగుట కవి సాధనలని అనాసక్త కర్మఫలక మోక్షోపదేశము చేసెను. అందుచేతనే శ్రీకృష్ణపరమాత్మ స్వభావసంభవస్వధర్మయుద్ధకర్మను అనాసక్త కర్మగ (అకర్మగ) బ్రహ్మస్పర్శ యుతముగ చేయుమని ఉపదేశించి అటులచేసిన నిన్ను సమ్యగ్బుద్ధినిగ చేసి (అధ్యాసలేని జీవునిగను చేసి) మోక్షమిత్తునని అభయమిచ్చి ఇట్టి ఫలమును భారతయుద్ధముచేసిపొందుటో లేక యుద్ధము విరమించుటో విచక్షణాపూర్వకముగ నాలోచించుకొని నీయిష్ట ప్రకారమొనర్పుమనిన్ని ఈ జ్ఞానరహస్యమంతయు నీవు నా కత్యంతప్రియుడవగుటచేత చెప్పితినని కొంతసేపూరకుండి తదుపరి అర్జునుడు ప్రబోధితుడయ్యెనో లేదోనని శ్లో॥ కశ్చిదేతచ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా। కశ్చిదజ్ఞాన సంమోహః ప్రనష్టస్తే ధనంజయ॥ (భ. గీ. 18_72) అను శ్లోకములో నీకిదివరకు కల్గిన జీవబ్రహ్మ భిన్నజ్ఞాన ఫలక అజ్ఞాన కార్యమగు బంధుసుహృన్మరణ హింసాపాపకసంశయ కార్యమగు మోహము నశించినదా యను ప్రశ్నకు అర్జునుడీ క్రింది శ్లోకములో—

శ్లో॥ నష్టోమోహః స్మృతిర్లబ్ధ్వా త్వత్ప్రసాదాన్మయాచ్యుతా।
స్థితోస్మి గతసందేహః కరిష్యే వచనంతవ॥
(భ. గీ. 18–73)

"నేను బ్రహ్మనే ననియు, యథా సంభవ యుద్ధకర్మ అనాసక్తిగ చేసి బ్రహ్మయందే ఫలమర్పించిన నాకు పాపమే లేదనిన్ని, మోక్షము కలుగుననిన్ని మీచే చేయ బడిన ఉపదేశము వలన నా మోహమంతయు నశించినది బ్రహ్మస్మృతి కలిగినది మీ యాజ్ఞప్రకారమే బ్రహ్మస్వర్మ యుత యుద్ధకర్మ నకర్మగ (బ్రహ్మకర్మగ) చేయ సిద్ధమైతి నని బదులు చెప్పెను" ఐతే ఆత్మ మాయ ఎటులనశించునను శఙ్కకూడ భ.గీ. 2–59 శ్లోకములో ఇదివఱకే చెప్పబడినది. అదియే "శాస్త్రీణ నశ్యేత్ పరమార్థదృష్టిః కార్యక్షమం నశ్యతి చాపరోక్షాత్ ప్రారబ్ధ నాశాత్ ప్రతిభాసనాశః ఏవం త్రిధాన శ్యత్యాత్మ మాయా॥ వరాహోప౨–134–135 2 "తస్యాఽభిధ్యా నా ద్యోజనా త్తత్వభానాత్ భూయ శ్చాంతే విశ్వమాయా నివృత్తిః శ్వేత1–10)అని శ్రుతి ప్రమా ణములచే నశ్యమగుచున్నదని ఈ క్రిందిపద్యములో అర్థము సుగమ మగును.

తే. గీ. బ్రహ్మ శాస్త్ర వృతిని జగద్భ్రమఽపరోక్ష
మునని అజ్ఞాన మాభాసము ప్రకృతి ప
నిచ్ఛితారబ్ధ భోగమునె. యగునాశి
తమిటునాత్మ మాయ త్రివిధాంతమొందుఁ
అ. భా. 1 వర్ణకము

ఈ ఆత్మమాయ దురత్యయమయ్యును అది మూడు విధములుగ నశించునని జ్ఞాను లెరుగుదురు. 1. బ్రహ్మశాస్త్ర జ్ఞానవృత్తి చేతనే ఈ నామ రూపజగత్తు సత్యమను భ్రాంతి నశించును 2. మూలాఽజ్ఞానము అపరోక్ష సాక్షాత్కారమున అనగా జీవుడు అంతఃకరణ రాహిత్యముగ బ్రహ్మగ అప్రమకాగానే నశించును. 3. నామరూప జగత్తు ప్రతిభాసయున్న జీవుని సుఖదుఃఖ ప్రతిభాసనయున్ను జీవుని అనిచ్ఛా ప్రారబ్ధనాశమున నే నశించును. ఇటులనే జ్ఞాని ఎఱుగుటను మనస్సులో శాంతుడే యగును. లోకులకు సుఖ దుఃఖములచేత చలించుచున్నటులను భ్రాంతిచే వారి వారి విపరీతబుద్ధిచే కలుగుచుండును. ఈ చలనము ప్రాకృతికమని ఎఱింగినగాని వాటిని సహించుట దుర్లభము. రెండవ అధ్యాయములో స్థితప్రజ్ఞుని లక్షణములు జ్ఞాని లక్షణములు చెప్పెనవిన్ని ఆత్మ మాయనాశమున్ను ఈ అధ్యాయములో ఉచితమగుట నిక్కడ విపులముగ చెప్పబడినవి. మొదటనే చెప్పిన ఈ కాలపు మనుజులకు అర్థముకానందున అక్కడ సూచించి అజ్ఞములను పూర్తి చేసి ఇచట చెప్పబడినవి. ఇటులను "తత్త్వమసి" (జీవబ్రహ్మైక్య లక్ష్యజ్ఞాప వృత్తి) బోధయే యగు భగవద్గీత విషయచోదనా ఫలమగు అసిపదార్థైక్య లక్ష్యార్థ నిరాకార బ్రహ్మాత్మైక్య ప్రబోధచేత శ్రీకృష్ణుడు ఈ చివరి మోక్ష సంన్యాసాధ్యాయములో అర్జునునకు మన శ్శుద్ధిచేసి ముగించెను.

అసి=(అ+స్+ఇ) ల సంధి 'అ' వాయుబీజము అధి దేవత సర్వ వ్యాప్యవ్యాపకవస్తువగు బ్రహ్మ, ఫలము మోక్షము,

లేక బ్రహ్మాత్వము. 'న్' అగ్నిబీజము. అధిదేవత సరస్వతి. ఫలము వాక్కు లేక శబ్దబ్రహ్మ. 'ఇ' అగ్నిబీజము, అధిదేవత మన్మథుడు, ఫలము పుష్టి, ఇటులను జీవుడు బ్రహ్మగా అప్రమేయము లేక బ్రహ్మపుష్టినొందునను అద్వైత విషయచోదనా ఫలమగుచున్నది. ఇదియే ఈ క్రింది పద్యములో చెప్పబడు చున్నది.

తే.గీ. అహము వృత్తిపీడ్యత తత్త్వమైక్య'మసి'యు।

అర్జునుని ప్రత్యుత్తర సారాంశము. లోగడ అధ్యాయములో సిద్ధాంతమైనటులను తాను బ్రహ్మయగుదుననిన్ని సత్యమనమే అనన్యముగ బ్రహ్మయున్న తనలోనున్న బ్రహ్మ శక్తియే తన జాగ్రత్స్వప్న సుషుప్తి అనుభవములకు కారణమనిన్ని తాను శుద్ధమైన చిన్మాత్రుడనని న్ని యథాసంభవయుద్ధ కర్మహింసా పాతకము తనకందుచేత లేదనిన్ని మనసులో తలచుచు అభయుడనై తిననిన్ని తన జాగ్రత్స్వప్నసుషుప్తి అవస్థలకు సాక్షియగు సత్పదార్థమే తాననిన్ని అహంకారవృత్తి బాధింపబడుటచేత అర్జునుడు అగు తాను (జీవుడు) బ్రహ్మగా మిగిలియున్నాననిన్ని, ఆ బ్రహ్మ అంతర్యామియగుటను కొయ్య అంతరముగ అగ్నియుండి అది మధించిననే బయటపడు నటులను మనస్సుతో బోధపర్యవసానముగ తఱచి తెలుసుకొంటి ననిన్ని బ్రహ్మచోదనా జన్య జ్ఞానము పురుషుని (బ్రహ్మను) తెలుపునని తెలుసుకొంటిననిన్ని అంతయు నిపుడు సుసమన్వయ మగుచున్నదనిన్ని అగుచున్నది. స్మృతియనగా నిచట బ్రహ్మస్మృతి అగును. "ఏకం సత్ విప్రా బహుధావదంతి" (ఋ. 10-82-3) అను ప్ర॥ యొక్క అర్థము 9 అధ్యాయ

విషయచోదనాలో నుడివినటులను ఒకే సత్పదార్థమనియు, "ప్రజ్ఞానం బ్రహ్మ" (ఐతరేయ ఉప 3-3)అను ప్ర॥ చేతఒకే బ్రహ్మను అనేక ఉపాధులలో వివర్తముఅగుచు జ్ఞానస్వరూప మగుటను ప్రజ్ఞానమగుననియు ద్వైత విశిష్టాద్వైత సిద్ధాంత ములు వేదాంతపరమసిద్ధాంతములు కావనియు, రాజర్షులున్ను అనాసక్తకర్మ చేసిరనియున్ను, స్పష్టమగుచున్నది. మఱియు నీ బ్రహ్మనుయోగవాశిష్టమున్ను, తేజోబిందూపనిషత్ 4 అధ్యాయము 66 ప్ర॥లున్ను ద్వైతైక్యపదనిర్ముక్తి యనియు వేదాంతములు అద్వైతమనియు, అద్వైత భా గ్రంథము, అద్వైత భా అనియు, ఛాందోగ్యము 'భా'రూప మనియు శుక రహస్యోపనిషత్ తత్వంపదలక్ష్యమనియు, మహావాక్యములు జీవబ్రహ్మైక్య అవధియనియు బ్రహ్మసూత్రములు, ఉపనిష త్తులు బ్రహ్మయనియు ఆత్మయనియు ఆనందస్వరూపమనియు స్వప్రకాశజ్ఞానస్వరూపమనియు తత్ అనియు అయమనియు పలువిధములను మనోవాగతీత వస్తువును ఒకటి రెండు గుణము లయొక్క అనంతత్వ గుణోపేత వస్తువుగ చెప్పుచున్నవి. ఛాందోగ్య మైత్రాయణ్యుపనిషత్తులు జీవుని దైనందిన స్వా నుభవముద్వారా సాక్షిస్వరూప వస్తువుగనున్ను అప్రమేయ వస్తువుగనున్ను ఆనంద స్వరూపముగనున్ను జీవపరామైక్యచేత ప్రతిజీవుని అనుభవమునున్ను కరతలామలకముగ ప్రదర్శిం చుచున్నవి. మరియు సిద్ధాంతదర్శనము జగజ్జీవేశ్వర బ్రహ్మై క్యసిద్ధాంతమును స్థాపించుచున్నది. ఇటుల తర్కానుభవము లచేత తెలుసుకొనబడదగిన స్వప్రకాశ సర్వజ్ఞేశ్వరత్వ సర్వ శక్తిమత్వ వస్తువగుచు అదియే మోక్షమున్ను అగుటను

దానికి సులభమార్గము (సాధన) బ్రహ్మస్పర్శయుతఅనాసక్త కర్మ (అకర్మ లేక బ్రహ్మకర్మ) యే యగుచు దాని ఫలక బ్రహ్మస్పర్శద్వారా "బ్రహ్మచోదనాత్ పురుషమవబోధయతి" అను ప్ర॥ చే బ్రహ్మజ్ఞానానన్యత్వ బ్రహ్మత్వములేక మోక్ష మను విషయ చోదనాసిద్ధాంతము సమాప్తము.

మోక్షసంన్యాసయోగాంగము సమాప్తము

అనునిది గౌణసంన్యాసము (మోక్షసంన్యాసము) పరమార్థ

సంన్యాసఫలక మోక్షతత్త్వం పదార్థైక్యరూపవాక్యార్థ

నిష్ఠా అసి పదార్థ సమ్యగ్ర్థ ప్రధాన చరమ

షడాధ్యాయి ( చరమషట్కము )

స మా ప్త ము

శ్రీ భగవద్గీత విషయచోదనా సిద్ధాంతము అను

మొదటిభాగము సమాప్తము

ఓం తత్ సత్

ఓం తత్

ఓం శాంతిః శాంతిః శాంతిః.



# శ్రీ భగవద్గీత చోదనా

## రెండవ భాగము

### బోధకాలచోదనా సిద్ధాంతము

క. స. ని. భా. 2-పు 1-2 పరీక్షిత్తుని పట్టాభిషేకము, పాండవుల మహాప్రస్థానగమనము, శ్రీకృష్ణపరమాత్మ నిర్యాణమున్ను కలిశకప్రారంభ తేదీనే కాగా అంతకుపూర్వము 36 సం॥ క్రింద మహాభారతయుద్ధము జరిగినదనిన్ని, యుద్ధానంతరము యుధిష్ఠిరశకము ఆరంభించిన 36 సం॥కు జయాభ్యుదయశకము కలిశకముతోనే ప్రారంభమైనదనిన్ని చరిత్రాంశము చెప్పుచున్నది. మహాభారతము ఇటులను శోభకృతునామ సం॥ కార్తికబహుళ అమావాస్య మంగళవారం జ్యేష్ఠానక్షత్రమందు ప్రారంభమై అనగా కలిశక ప్రారంభ దినమునకు 36 సం॥ల క్రిందటఅనగా బి. సి., 3138 సం॥లో ఆకాశములో గ్రహకూడిక నీవిధముగ నుండగా యుద్ధముజరిగినదని భారతఉద్యోగపర్వములో చెప్పబడియున్నది. మేషములో కేతు, వృషభములోశని, కన్యలోశుక్రుడు, తులలోరవి వృషభములోశని, బుధ, రాహులు, వృశ్చికములో కుజచంద్రులు, మకరములో గురువుయుండగా యుద్ధప్రారంభమైనదని చరిత్రాంశమే. భీష్మనిర్యాణ దినము శోభకృత్సంవత్సర మాఘశు॥ అష్టమికి సరిపోవుటవలనునున్ను పైతేదీయే చరిత్రాత్మకమగుచున్నది. ఇటుల నీభగవద్గీతబోధ యుద్ధప్రారంభము రోజుననే రెండు వ్యూహములమధ్యను శ్రీకృష్ణపరమాత్మచేత అర్జునునికి చేయబడినదని సిద్ధాంతమే. కొందరనునటులను మార్గశీర్ష ఏకాదశి రోజున యుద్ధప్రారంభమనునది అందుచేత నిరాకృతము. మఱియు భీష్మనిర్యాణ రోజుకు యుద్ధానంతరదినముల వ్యవధిన్ని యుద్ధప్రారంభ నక్షత్రరాశియున్ను సరిపోనందున వారివాదము నిరాకృతమే.

కాలచోదనా సిద్ధాంతము సమాప్తము.

ఓం తత్ సత్

ఓం తత్, ఓం

# మూడవ భాగము

## బ్రహ్మస్పర్శ చోదనా సిద్ధాంతము

భారతయుద్ధ కాలపురుషులు శ్రీ భగవద్గీత చోదిత బ్రహ్మస్పర్శ, యథాసంభవ యుద్ధకర్మ కలుపుచు, నెటుల చేసిరో అందఱికి అది చేయ నెటుల సాధ్యమో చెప్పబడుచున్నది. ఈ బ్రహ్మస్పర్శ 1. అంతరస్పర్శ, 2. బాహ్యస్పర్శ అని రెండు విధములు. అంతరస్పర్శ బ్రహ్మశాస్త్రాచార్యోపదేశానుభవములచేతనే సాధ్యము. ఇది కపి కిశోర న్యాయమున (1) బాహ్య 2. మనో సంన్యాసములచేతనే జీవుని ప్రారబ్ధావస్థననుసరించి, శుక, జనకాదులవలెనే చేయతగియున్నది.ఇది అద్వైత భా. 1, 9, 10 వర్ణకములలోనున్ను, భ.గీ. లోనున్ను చూడనగును.3-2-10ముణ్డకోపనిషదోక్త అధికారియగు గురుసూచిత మార్గముననను, 1-2-12 ముణ్డకోపనిషదోక్త అధికారియగు శిష్యునికే పై గురువు 1-2-13 2-1-1-2 ముణ్డకోపనిషదోక్తముగ చెప్పగనే, బ్రహ్మశాస్త్ర శ్రవణ, మనన, నిధిధ్యాసలచేత ననుభవనీయమగును. అందుచేత నిచట బ్రహ్మబాహ్య స్పర్శ గృహస్థులకున్ను సాధ్యమగుటను, యుద్ధ ప్రధాన పురుషులెటులనుబ్రహ్మస్పర్శ చేసియుండిరో చూపింపఁబడుచున్నది. ఇది 5 విధములుగ నున్నది.

(1) భారతయుద్ధములోని ప్రధాన పురుషులు చేసిన బ్రహ్మ స్పర్శయనుభవము – పూర్ణజ్ఞానియగు శ్రీ వ్యాసమహర్షి యనుభవము (2) ప్రస్తుత కాలములోని జీవులు యుద్ధప్రధాన పురుషులగు పాండవులవలె వ్యవహారావస్థలో ఎటుల బ్రహ్మస్పర్శ చేయ సాధ్యమగునో పాండవులను అనుకరించుటకువారబ్రహ్మస్పర్శ యుపయోగపడుటను అదిన్ని (3) బ్రహ్మస్పర్శ మనము మాటలాడు ప్రతి శబ్దములోనున్ను, గ్రంథ రచన పఠనాది కార్యములలోనున్ను ఎటుల నిమిడియున్నదో సూచించుటచే బ్రహ్మ స్పర్శ అనుకరణసాధ్యము. (4) ఈ నామరూప సమష్టి ప్రపంచములోనున్ను, దానిలోని వ్యష్టిజీవోపాధికులగు జీవులలోనున్న బ్రహ్మ స్పర్శమార్గము (5) శాస్త్ర చోదిత సతతబ్రహ్మానుసంధానము.

1. భారత ప్రధాన పురుషులలోని శ్రీకృష్ణుడు పరమాత్మయే. భగవద్గీత బోధయే ఆయన అసంగత్వమును, కౌరవ యుద్ధాచరణము వలన యున్నూ, భూభారముడుపుటవలనున్నూ గాంధారియొక్క శాపసహన భావమువలననున్నూ ప్రాచుర్యమగుచున్నది.

ఈ పరమాత్మ ఆదర్శ పురుషుడగు జీవుడు యథాసంభవ అనాసక్త కర్మ చేయుచు బ్రహ్మస్పర్శ చేయవలెనని బోధచేయుటయే కాక తననడవడిలోనే ఆమార్గమును ప్రదర్శించెను. మఱియు అధికారియగు గురువుశిష్యుని ఎట్లు ప్రబోధితుని చేయవలెనో అదియును ప్రదర్శించెను.

—: వ్యాసమహర్షి బ్రహ్మస్పర్శ :—

ఈయన అనుభవము ఆయన గ్రంథముల రచనలవలనను ముఖ్యముగ బ్రహ్మసూత్రములు సిద్ధాంతదర్శనను వలననున్నూ చాటబడుచున్నది. మరియు నాయన శుద్ధసత్వగుణము అశ్వత్థామను ఆతడు ఉపపాండవుల నక్రిమ హింసచేసినందుకు శపించి ప్రతిశాపమును పొందియు ప్రతీకారముచేయక ఓరిమితో నుండుటవలననున్నూ కౌరవపాండవులు తనకు సమాసాదరణీయులే య్యైనను పాండవులు ధర్మపక్షావలంబులగుటను వారి కెప్పటికప్పుడు ధైర్యోత్సాహములను గలుపుచుండుటచేతనున్నూ ఆయన సతతబ్రహ్మస్పర్శ విదితమగుచున్నది. మరియును, శుకరహస్యోపనిషత్తు ఆయనయొక్క సతతఅంతర బాహ్య బ్రహ్మ స్పర్శానుభవమును చాటుచున్నది.

2. యుద్ధప్రధాన ఇతరపురుషులగుపాండవుల బ్రహ్మస్పర్శ:—

1. ధర్మరాజు:— ఈయన తన భార్యయొక్కయు, సోదరులయొక్కయు కించిద్దోషములనుకూడ దాచక చివరకు ప్రకటించి వారి చావుకైనను గుణించక చివరకు వారితో నరకములోనేనుందునని స్వర్గనరకములను సమానముగ నెంచెను. తనతోవచ్చిన కుక్కనువదిలి విమానమేయొక్కనని ప్రకటించుటయే ఆయన సతతబ్రహ్మస్పర్శ ధర్మనిష్ఠలను చాటుచున్నది. తన జీవితకాలములో శ్రీకృష్ణుని పరమాత్మగనే ఎంచినదిన్ని ఆయనయక్షప్రశ్నల ప్రత్యుత్తరములతో కనపర్చిన ధర్మనిష్ఠయు ఆయన సతత బ్రహ్మస్పర్శను భారతమే చాటుచున్నది.

(2) భీముడు:— ఈయనకెంత కోపమువచ్చినను ధర్మజునకు లోబడి ఆయన యాజ్ఞ దాటకుండుటయున్నూ శ్రీకృష్ణునాజ్ఞను శిరసావహించుచుండుటయును శత్రువగు శల్యుడు అర్జునుని ప్రతిజ్ఞ తెల్పి కర్ణుని చంపవద్దన

గా చేజిక్కినకర్ణుని వదలుటయు శ్రీకృష్ణుని పంపున అధర్మమైనను అటు లను తలంపక దుర్యోధనుని తొడలు విరగగొట్టి ప్రతిజ్ఞను నెరవేర్చుకొని అట్టి అనాసక్త కర్మఫలమును శ్రీకృష్ణునందే అర్పించి శాంతించుటయే ఆయన సతతబ్రహ్మస్పర్శ చాటుచున్నది.

(3) అర్జునుడు:- ఈయన శ్రీకృష్ణుని రెండవ అంశమే యైనను బ్రహ్మసన్నిధికి శ్రీవసిష్ఠమహర్షి వలెనే, శ్రీకృష్ణుని సన్నిధికి ఆయన అజ్ఞానస్థితిలోనుండి, ప్రాకృత పురుషులైనను వారిసందేహములను తీర్చుకొని బ్రహ్మత్వము నొందుమార్గము చూపుటకు పరమాత్మకు నిమిత్తమాత్ర సహకారియై, శ్రీకృష్ణపరమాత్మయేయని గుర్తించుటయేకాక కర్ణుని అస్త్రవర్జితుని, అధర్మమైనను శ్రీకృష్ణునాజ్ఞ చేచంపి, యావత్తుభారతయుద్ధ కర్మఫలమును పరమాత్మయందే అర్పణయున్న, తాను కేవలము నిమిత్త మాత్రుడుగనే కౌరవనాశమునకైనటులను, శ్రీవ్యాసమహర్షికి,యుద్ధవీరులను ముందుశివుడు చంపిన తర్వాతనే తాను నామకః బాణములను వేయుచుండుట ఆను తెలుపుచున్న, శ్రీకృష్ణుని నిర్యాణానంతరమున శ్రీకృష్ణునితోనే తన బలము తొలగి పోయినటులను విలాపమున్న, ఆయన సతత బ్రహ్మ స్పర్శను భారత భాగవతములు చాటుచున్నవి. ఈయన యూర్వశి శాపము నోర్పుతో నిర్వహించుకొని ప్రతీకారము చేయు మారకుండుట ఆయన బ్రహ్మైకాంతిక భక్తిని వేనోళ్ళ చాటుచున్నది.

(4, 5,) నకుల సహదేవులు-సహదేవుడు ఆత్మదర్శియే. ఈయన సదా శ్రీకృష్ణుని పరమాత్మగనే స్పృశించుచుండెను. నకులుడును అట్టి వాడే. వీరిరువురును సవతితల్లి కుమారుడైన ధర్మజుని యాజ్ఞనెపుడును నుల్లంఘింపక శ్రీకృష్ణపరమాత్మ యాజ్ఞ నెరవేర్చుచు బ్రహ్మస్పర్శ చేయు చుండిరి.

(6) ద్రౌపది-ఈమె చిదనన్యమగు చిచ్ఛక్తి యంశయే. ద్వాపర యుగములో నైయున్నది. ఈమెయే తన వివాహానంతరము తనభర్తలగు పాండవులకు రాజ్యసంపద కోరకురాలయ్యెను.శ్రీకృష్ణపరమాత్మకుసహా రిగ యుద్ధములో నుండుటయేగాక ఆ పరమాత్మ చెప్పినటులనే తన కష్ట ముల నోర్చుకొని,యుద్ధభూమిలో చనిపోయినవారిరక్తముచే తడిసియున్న భూమిమీద రక్తమును రాత్రి త్రాగి మఱునాటి యుప యమునకు యుద్ధ భూమిని పొడిగానుంచుచు పరమాత్మకు తోడై దుష్టులనందఱిని చంపుటకు

తాను ప్రోత్సహించుటయేగాక స్త్రీ స్వభావమును బాహాటముగ చెప్పి తన పాతివ్రత్యమును ప్రకటింప గలిగినట్టిన్ని, తన బ్రహ్మానన్య శక్తిత్వ మును పాండవులకున్ను, వారి ద్వారా యుద్ధవ్యూహములోనున్న వారం దరికిన్ని చాటుటయేగాక తన సతత బ్రహ్మస్పర్శ పాండవులకున్ను, కౌరవులకున్ను, ప్రకటించుచునే తాను చిదనన్యమే యగుచు భారతయుద్ధ పూర్వకముగ కౌరవులను కడతేర్చి భూభారమును సహకారియగుటయే గాక సింహబలుని తానే గెంటివేయగలశక్తి చూపి, కీచకుల నందరిని చంపించి తనశక్తిని నిర్మొగమాటముగచూపి, యుద్ధారంభమున శ్రీకృష్ణ పరమాత్మ శరణు చొచ్చి తన సతత బ్రహ్మ స్పర్శను బాహాటముగ ప్రకటించెను.

—: వారిననుకరించు వారి బ్రహ్మస్పర్శ :—

7. భాష్యకర్త శ్రీ శంకరాచార్యులవారు:- బ్రహ్మస్పర్శ:- వీరు ఎటులనినాసక్తకర్మి మార్జాలకిశోరన్యాయమున భగవంతుని కృపచేత పరమార్థ సంన్యాసియగుచు అట్టివాడు పొందు మోక్షమును పొందునో, భాష్యములో సందర్భానుసారముగ నిష్పాక్షికముగచెప్పి, అట్టివాడు గౌణ సంన్యాసియని ప్రదర్శించినట్టి పరమార్థ సంన్యాసియే. అనగా సతతమును బ్రహ్మస్పర్శచేయుచు శ్రీ భగవద్గీతలోని బ్రహ్మముడిని విప్పి గూఢముగ సత్యమును బయల్పఱచిన బ్రహ్మజ్ఞానియే.

(2, 3) ఈ గ్రంథకర్త – బ్రహ్మస్పర్శ.

ఈ గ్రంథకర్త భగవద్గీతలోని బ్రహ్మముడినిన్ని, భాష్యార్థనిగూఢ బ్రహ్మముడినిన్ని విడదీసి నిష్పాక్షికముగను, సప్రమాణికముగను, శ్రీవసిష్ఠ మహర్షి ప్రవచనానుసారముగను, శ్రీ భగవద్గీత శ్లోకానుసారముగను, శ్రీ భాష్యకర్తనిగూఢాభిప్రాయానుసారముగానున్న శ్రీ భగవద్గీత విషయ చోదనా అనాసక్తకర్మయోగమేనని బయల్పఱుచుట వలనను్ను, అనా సక్తకర్మి జ్ఞానియగుననిన్ని, బ్రహ్మజ్ఞాని అనాసక్తకర్మియగుననిన్ని, అది యే శ్రీ శంకరులవారి భ. గీ. 13-46-66 శ్లోకముల భాష్యాంతరార్థమనిన్ని సప్రమాణికముగనే ఈ విమర్శనాత్మక గ్రంథమూలకముగ తానెటుల

బ్రహ్మస్పర్శ చేయుచున్నాడో చూపించుట మూలముగ పతితలకున్ను, తదితరులకున్ను ఆదెటులను సుసాధ్యమో ప్రదర్శించుటయేగాక మంగళాచరణపద్యములోని లక్ష్యార్థములో ప్రతి అక్షరములోను బ్రహ్మస్పర్శ ప్రదర్శించెను.

### (4) నామరూప ప్రపంచము ద్వారా బ్రహ్మస్పర్శ

ఈ గ్రంథ రచన మూలముగానేగాక నామరూప ప్రతిపదార్థము ద్వారానే ప్రకాశ (భా) స్వరూపచైతన్యమే చేతనమిచ్చుచు ప్రత్యక్షముగా మనము చూచు ప్రకాశనమునకు (భాస్యమునకు) మూలమగు ప్రకాశము (భా) అగుటను ఎటుల స్పృశింపనగునో ఈ గ్రంథములో తెలుపుట మూలముగా పతితలకు బ్రహ్మస్పర్శ తెలుపుచు బ్రహ్మ 'భా', 'భాస్య' ముగనున్న దనిన్ని, అదియే ద్వైతైక్యపదనిర్ముక్తి యనియు ప్రదర్శించి (అమృత బిందు 18-21) భ.గీ. 2-72 శ్లో ప్ర॥ చేత బ్రహ్మశాస్త్ర గ్రంథపఠన ప్రాశస్త్యమును కూడ ప్రకటించెను. ఇటులను బ్రహ్మ బాహ్యస్పర్శ అందరికి నెటుల సాధ్యమో ప్రదర్శింపబడినది.

### (5) బ్రహ్మానుసంధానము:—

1. బ్రహ్మ చింతనము, 2. అన్యోన్య ప్రబోధము 3. దానినితరులకు ప్రబోధము చేయుటనను మూడు విధములుగ బ్రహ్మానుసంధానము చేయ తగియున్నది. దీని విశేష వివరణ అద్వైత భా 1, 9 వర్ణకములలో చూడ నగును. గ్రంథవిస్తరభీతిచేతనున్ను అంతరస్పర్శ అద్వైత భావాంతర్గత మున్న, గురుశాస్త్రాదిప్రోక్తమున్ను, అనుభవైక వేద్యమున్ను అగుటచేత ఇచట విరమింపబడినది. బ్రహ్మస్పర్శ ఫలక బ్రహ్మ వృత్తిలో బ్రహ్మ వ్యాప్తతను బ్రహ్మానన్య ప్రాప్తికాగా అది కేవల బోధస్వరూపమే యగుటనున్ను అది బ్రహ్మ స్పర్శచోదనాజన్య మగుటనున్ను సార్థకమగు బ్రహ్మస్పర్శ చోదనా సిద్ధాంతము సమాప్తము.

మూడవభాగము సమాప్తము

ఓం తత్ సత్

ఓం తత్, ఓం

శాంతిః

పూర్ణపూర్ణపు లబ్ధి ♦ పూర్ణమోరన్న! ।
పూర్ణపూర్ణ విభక్త ♦ మొకటిరోరన్న! ।
పూర్ణపూర్ణ మదిది ♦ పూర్ణమం తన్న! ।
పూర్ణము బ్రహ్మగన్ ♦ పూర్ణమనున్న! ।
రామ 'రఅమ' సంధి ♦ రాముడౌన్ బ్రహ్మ; ।
రాముడు బ్రహ్మను ♦ రామోపనిషద్వె;
రాము డిడునుగాత ♦ రామరంతెప్పుడుఁ; ।
రాము డిడునుగాత ♦ రామత్వమెప్పుడుఁ; ॥
'కృషిణల సంధియె ♦ కృష్ణుండు నౌను; ।
అండ పిండాండము ♦ లవికృష్ణుఁడౌను; ।
అదిదియంతయు కృష్ణు ♦ డధిగ నెయగాను; ।
ఇట నెటుఁజూచిన ♦ కృష్ణు జేయగాను; ॥

ఓం తత్ సత్ ఓం.

## —: గద్య :—

అను నిది శ్రీ ఓంకారానాథ శిష్య గంగారాజాహ్వోపనామక శ్రీరామ బ్రహ్మామాత్యశేఖర ద్వితీయ పుత్త్రి సచ్చిదానందాత్మారామకృపాకవిత సహజపాండిత్య కవితావిచిత్ర వేదాంతవైజ్ఞానిక, 'అద్వైతభా' "అప్రమేయానుభూతి," "సిద్ధాంతదర్శన నృసింహీయవ్యాఖ్య"ల గ్రంథకర్త నరసింహారాయశర్మ పాకయాజి నామామాత్యశేఖర ప్రణీతంబైన "శ్రీ భగవద్గీతచోదనా" విమర్శనాత్మక గ్రంథము

సమాప్తము.

క. శ. 5058; శా. శ. 1879;
చాం॥ హేవళంబి సం॥ ఆశ్వీజ
బ॥ సప్తమీ మంగళవారము.
హూ. శ. 15-10-1957.
బకింగ్‌హామ్ పేట,
విజయవాడ.

ఇట్లు, బుధజన విధేయుడు,
సహజపాండిత్య కవితావిచిత్ర
వేదాంత వైజ్ఞానిక
**గంగరాజు**
**వేంకట నరశింహరాయశర్మ**
పాకయాజి, B. M. D.
గ్రంథకర్త.

శ్రీ భగవద్గీతచోదనా గ్రంథము సమాప్తము.



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 37 | 4 | వరకు | వఱకు |
| 37 | 12 | నిలపి | నిలిపి |
| 38 | 5 | వరకు | వఱకు |
| 38 | 8 | మరచి | మఱచి |
| ,, | ,, | శబ్ద | అనుశబ్ద |
| ,, | 8 | చే నగు | చేతను |
| ,, | ,, | సిప | సిష్ట |
| ,, | 16 | 16 | 15 |
| 36 | 6 | మరియు | మఱియు |
| 39 | 14 | తప | తపః |
| 41 | 15 | వారి | నీ |
| 42 | 12 | స్థితాఽశ్వా | స్థిత్వాఽస్వా |
| 42 | 17 | బ్రాహ్మీయస్థితే | బ్రాహ్మీస్థితి. |
| 43 | 5 | 140 | 104 |
| 34 | 15 | భవంతి | వదంతి |
| 45 | 14 | ప్రాజ్ఞోప్య | ప్రాజ్ఞోప్యది |
| 46 | 1 | యుకోరి | లయకోరి |
| 46 | 2 | కాను | కాడు |
| 47 | 9 | కర్మ | తృతీయుకర్మ |
| 47 | 17 | వంతయు | అర్పణమునంతయు |
| 47 | 18 | సమాధిచే | సమాధి |
| 48 | 19 | జ్ఞాయసీ | జ్యాయసీ |
| 43 | 18 | భగీ. 3-18 | భ.గీ. 3-1 |
| 49 | 1 | శ్యేవహీ | శైవహి |
| 50 | 2 | సూర్యుని | సూర్యునికి |
| 50 | 8 | ఆదిత్యుని | ఆదిత్యుని దేక |
| 50 | 16 | రవియు | నవియు |
| 53 | 9 | ఇదం | ఇమం |
| ,, | 14 | తస్మా | శ్లో॥ తస్మా |
| ,, | 12 | ఝిత్త్వేనం | ఛిత్త్వేనం |
| 54 | 4 | నిత్యసంన్యాసి | సంన్యాసి |
| 55 | 22 | ఆత్మ్రి | ఆత్మ |
| 56 | 5 | జీవించ | జీవించి |
| 56 | 12 | తక్షణమే | తత్క్షణమే |
| 59 | 13 | జ్ఞాని | జ్ఞాను |
| 59 | 16 | మహా | మహాః |
| 56 | 18 | నిశ్శ్రేయ | నిశ్శ్రేయ |
| 56 | 23 | యోగాజ్ఞపాండవ | యోగాఙ్గపాండవ |
| 58 | 1 | అధ్యాత్మ | ఆధ్యాత్మ |
| 58 62 | 1 | భగద్గీతచోదనా | శ్రీభగవద్గీతచోదనా |
| 59 | 16 | నిక్రమో | నిర్మమో |
| 61 | 14 | సంన్యస్త | సన్న్యస్త |
| 62 | 7 | 4అ | 4అ॥ |
| 62 | 18 | శమ | శమరి |
| 63 | 2 | సంన్యస్త | సన్న్యస్త |
| ,, | 7 | 35-34 | 95, 94 |
| ,, | 9 | మున్ను | మును |
| 82 | 11 | మననసేమి | మనసేమి |
| 83 | 20 | ప్రకాశవే | ప్రకాశమే |
| 85 | 14 | రందరికిన్ని | రందఱికిన్ని |
| 87 | 2 | తదిత | తాత |
| 87 | 10 | వాసుల | వాసులకు |
| 84 | 22 | వే విదు | వేపవిదు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 92 | 20 | యేకం | ఏకం |
| 93 | 3 | స్వజాతి | సజాతీ |
| 93 | 18 | ఆత్మదు | ఆత్మ యందు |
| 94 | 16 | కోరక | కోఱిక |
| 95 | 5 | లోపము | రూపము |
| 95 | 15 | 1-82-8 | 10-88-3 |
| 102 | 15 | తెయునని | తెలియునని |
| 105 | 18 | గక్తి | రక్తిచే |
| 110 | 9 | నన్నెరుగుము | నన్నెఱుంగుము |
| 110 | 21 | నెరుగుము | నెఱుగుము |
| 110 | 24 | తే. శి. | తే. గీ. |
| 111 | 4 | రమ్మన్ను | రమున్ను |
| 113 | 9 | హ్యాతే | దహ్యాతే |
| 113 | 21 | అనుదా | అనుపదా |
| 114 | 8 | సూక్ష్మ | 2 సూక్ష్మ |
| ,, | ,, | 2, 8 | 3 |
| ,, | 23 | 90 | 96 |
| 116 | 20 | పరివర్త్యత్తి | పరివర్జయత్తి |
| ,, | ,, | అజానత | అజ్ఞానత |
| ,, | 8 | సూక్ష్మ | సూక్ష్మపంచీకరణ |
| ,, | 8 | కానినజే | కానినచే |
| ,, | 10 | తెగచిన | తెఱచిన |
| ,, | 19 | సర్వాన్ | సర్వాన్ |
| ,, | ,, | కుశాగ్రిణ | కుశాగ్రిణి |
| 117 | 5 | మెరిగి | మెఱిగి |
| 116 | 21 | పస్య | పశ్య |
| 119 | 24 | చున్నది | చున్నవి |
| 117 | 24 | ఈశ్యర | ఈశ్వర |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 118 | 4 | పథ్యము | సిధ్యాథ్యస్త్ర |
| 120 | 5 | అననురక్తి | (అననురక్తి |
| ,, | 23 | దనురక్తి | దననురక్తి |
| ,, | 17 | సేత | చేత |
| 121 | 1 | ఇది | ఇవి |
| 122 | 15 | విగితావిజితా | విదితావిదిత |
| 124 | 18 | అది | ఆ |
| 125 | 4 | భాతి | — |
| 127 | 23 | అన్నన్న | అను |
| 130 | 3 | లగు | లుగ |
| 125 | 4 | పరిణముతే | వృధ్యతే |
| 130 | 17 | సాక్షీ | సాక్షి |
| 132 | 3 | అధి | అథి |
| 133 | ,, | ఈశ్వ | ఈశ్వ |
| 134 | 23 | అనుగక్తి | అననురక్తి |
| 135 | 19 | అఘి | అగ్ని |
| 135 | 20 | అసు | ముల |
| 136 | 6 | తిరిగి | తిఱిగి |
| 136 | 23 | చేతనమున్న | చేతనమును |
| 137 | 6 | నోలు | నోగు |
| 137 | 6 | నున్నదని | మున్నవని |
| 140 | 6 | దేహమును | దేహాను |
| ,, | 17 | కోరిక | కోఱిక |
| ,, | 19 | కోరికలు | కోఱికలు |
| 141 | 13 | సంగులు | చంద్రులు |
| 141 | 18 | 11 | 10 |
| 143 | 6 | ననీనున్న | ననిన్ని |
| 118 | 18 | తిరిగి | తిఱిగి |
| 143 | 28 | బ్రిహ్మ | బ్రహ్మ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 186 | 1 | బ్రిహోతి | బ్రిహ్మను |
| 187 | 12 | పూర్వ | పూర్ణ |
| 187 | 14 | వర్జతః | వర్జితః |
| ,, | 17 | శ్రితా | శ్రితాః |
| 190 | 22 | నన్ని | ననిన్ని |
| 188 | 20 | సదసదన్నిన్ని | సదసదనిన్ని |
| 189 | 7 | శృత్యను | శ్రుత్యను |
| 190 | 7 | అపూర్వ | అపూర్య |
| 191 | 1 | ఊప | — |
| 189 | 10 | యన్న | యజ్ఞ |
| ,, | | న్నాస్తే | — |
| 193 | 21 | 2-10,2,10,8; | 2-102,103 |
| 194 | 8 | వివర్జితః | వర్జితః |
| 194 | 24 | (పై ప్రిమోహా | (పైమహోప |
| 194 | 22 | మరియు | మఱియు |
| 196 | 12 | మృచ్ఛయః | మృషయః |
| ,, | 13 | ద్వైతా | ద్వైథా |
| 196 | 5 | 43 | 48 |
| ,, | 13 | యుతాత్మనః | యతాత్మనః |
| ,, | 7 | భిత్వైనం | ఛిత్వైనం |
| 197 | 4 | తత్కృత్య | కృత్య |
| 197 | 14 | సున్నది | చున్నది |
| ,, | ,, | ఖోక్తారం | భోక్తారం |
| 198 | 19 | తేత | దేత |
| ,, | ,, | తజ్ఞాన | దజ్ఞాన |
| 199 | 19 | ద్సృమరో | ద్భృమప |
| 199 | 16 | శృతి | శ్రుతి |
| 200 | 2 | పెరుగు | పెఱుగు |
| 200 | 9 | ఎఱుగు | ఎఱుఁగు |
| ,, | ,, 13 | చెప్పె | చెప్పి |
| ,, | ,, 18 | జ్ఞాప | జ్ఞాన |
| 202 | 8 | బ్రిహ్మను | బ్రిహ్మ |
| 202 | 21 | మరియు | మఱియు |
| 203 | 3 | చోదనాత్ | చోదనాతు |
| 204 | 1 | క. స. | క. శ. |
| 204 | 3 | కాల | బోధకాల |

## వంశావతారము

మొదటిపద్యము 2పా. గనగు—గఁ తగఁ

10వ పద్యము 3వ పా. సహ - స

## గ్రంథకర్త విజ్ఞప్తి

| | | | |
|---|---|---|---|
| 16 | | కేయః | కే. వి. యన్ |
| 210 | 20 | కింక | నింక |
| ,, | | 2వపద్యం, 6వపాదం, చేయువల యునకగ్నలఁ జీవుల పుడుఁ | |
| 211 | 2 | కవిత | కలిత |
| ,, | 5 | నరసింహ | వేంకటనరసింహ |